సాహిత్య

# ప్రస్థానం

జనవరి 2011

వెల రూ. 10

కాలం చెట్టుకు
చిగురించిన మరో ఆకు
ఏం తేల్చనుందో!
అనుభవాల వెలుగులో
అశేష ప్రజ
చైతన్య గీతం!!
కొత్త సంవత్సరానికి
గంభీర స్వాగతం !!!

సాహితీ స్రవంతి

PRSNM02A123

సాహిత్య
ప్రస్థానం
జనవరి 2011
సంపుటి : 11 సంచిక : 61

# స్వాగతం... సమస్యలు, సంక్షోభాలతో...

నూతన సంవత్సరాగమన వేళ తెలుగు నేలను సమస్యలూ, సంక్షోభాలూ చుట్టుముట్టి వున్నాయి. అన్నిటిలోకి తీవ్రమైంది, బాధాకరమైంది రైతాంగ విషాదం. వరుసగా అయిదుసార్లు వచ్చిన అధిక వర్షాలు, వరదలు రైతులను చితగ్గొట్టేసి ఆత్మహత్యలు, ఆకస్మిక మరణాలకు బలి చేశాయి. అంతకుముందే వ్యవసాయం గిట్టుబాటుగాక ఎరువులు, విత్తనాలు, పురుగుమందులూ అన్నిటినీ మించి పరపతి అన్నీ తీవ్ర సమస్యలై అల్లాడుతున్న రైతాంగాన్ని ప్రకృతి వైపరీత్యాలు పూర్తిగా ముంచేశాయి. ఇలాటి ఆపత్కాలంలో అన్నదాతను ఆదుకోవడానికి అధికారంలో వున్న వారు తగినన్ని చర్యలు తీసుకోకపోవడం ఆందోళనలకు కారణమవుతున్నది. ప్రపంచీకరణ తాకిడికి సేద్యమే గిట్టుబాటు కావడం లేదు. దానితో పాటు అనుబంధంగా వుండే చేతివృత్తులు కూడా మరణశయ్యపై వున్నాయి. ఇలాంటి సమయంలో రాజకీయ విభేదాలకు అతీతంగా రైతాంగాన్ని ఆదుకోవడానికి సమగ్ర చర్యలు తీసుకోవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వం పైన వుంది. అందుకు అవసరమైన నిధులను జాతీయ విపత్తు కింద అదనంగా విడుదల చేసి సహాయపడవలసిన బాధ్యత కేంద్రంపై వుంది. నూతన సంవత్సరంలో ఇదే ప్రధమ కర్తవ్యం అందరికీ...

... ... ...

గత ఏడాది అంతటా తెలుగు ప్రజల మధ్యన ప్రాంతాలకు సంబంధించిన ఉద్రిక్తతలను పాలక వర్గ రాజకీయవేత్తలు పరాకాష్టకు చేర్చారు. వైరుధ్యభరితమైన వ్యూహాలతో, ప్రయోజనాల ఘర్షణతో అనేక ప్రహసనాలు నడిపారు. దీనిపై శ్రీకృష్ణ కమిటీ పూర్వాపరాలు నివేదించిన తర్వాతనైనా రాజకీయ పరిష్కారానికి కేంద్రం ప్రయత్నిస్తుందా అనేది సందేహమే. ఈలోగా రాజకీయ శక్తులు మరోసారి వివాదాలు పెంచే ప్రయత్నం చేస్తున్న దృష్ట్యా అప్రమత్తత చాలా అవసరం. ప్రజల చైతన్యమే ప్రశాంతతను కాపాడుతుంది. కనుక సంయమనం ఈ సమయంలో చాలా అవసరం.

... ... ...

ప్రాంతాల తేడాలకు అతీతంగా వివిధ తరగతుల ప్రజల సమస్యలపై పోరాటాలు ఈ కాలంలో ఉధృతంగా నడుస్తున్నాయి. ఉద్యోగులు, ఉపాధ్యాయులు, ఆశా వర్కర్లు, 104 సిబ్బంది, బీడీ కార్మికులు, కాంట్రాక్టు ఉద్యోగులు ఇలా వివిధ తరగతుల వారి పోరాటాలపై ప్రభుత్వం, పోలీసులు ప్రయోగించిన నిర్బంధం తీవ్ర ఖండనలకు గురైంది. అధిక ధరలు అభాగ్య ప్రజానీకానికి ఆశనిపాతమవుతున్నాయి. ప్రాంతీయ అనైక్యత లేదా సమైక్యత అనే సమస్యపై రాజకీయ నిర్ణయం తీసుకోవలసింది కేంద్రమే గనక ప్రజల మధ్య అది ఎలాంటి విద్వేషాలకూ దారితీయకుండా చూసుకోవడం అవసరం. ప్రాంతీయ సమస్యలు అంతర్గత కలహాల సాకుతో ప్రజల దైనందిన సమస్యలను నిర్లక్ష్యం పాలుకాకుండా చూడాలి. 2జి స్పెక్ట్రం వంటి కుంభకోణాలు పునరావృతం కాకుండా చూసుకోవాలి. సామ్రాజ్యవాద పీడన, సాంస్కృతిక కాలుష్యం, మతతత్వం, మార్కెట్ దాడి వంటివాటిని నియంత్రించగలగాలి. ఉపేక్షిత వర్గాల ప్రజలకు ఉపశమనం కలిగించడంపై ప్రత్యేకంగా దృష్టి పెట్టాలి. ఆ విధమైన ఆకాంక్షలతో, ఆశాభావంతో 2011కు స్వాగతం పలుకుదాం.

... ... ...

బొమ్మలు : శివాజి, వెంకటేష్, కె. శ్రీనివాస్, రవి

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in

కథ

# లవ్ ఇన్‌ఫెక్షన్




- జి. అనసూయ

లంచ్ బెల్ కాగానే బిల బిలమంటూ బయటకొస్తున్న అమ్మాయిలు, అబ్బాయిలు బయట చెట్ల క్రింద, వరండాలో అనువైన చోటు చూసుకుని స్నేహితులతో మాటలు, అన్నం మూటలూ పంచుకుంటున్న పిల్లలు. ఆడపిల్లలు, మగపిల్లలు ఎవరి స్నేహితులతో వాళ్ళు గుంపులుగా కూర్చున్నా... ఓరగానో, అరగానో ఒకర్నొకరు చూసుకుంటున్న చిలిపి వయసు ఆకర్షణలు... ముసి ముసి నవ్వులు, మోచేతి పొడుపులు... కళ్ళల్లో మెరుపులు..

ఇవాళ ప్రేయర్‌లోనే ప్రిన్సిపాల్‌గారు ఆర్డరు వేశారు. పిల్లలెవరూ క్లాసురూంలలో లంచ్ చేయకూడదని. ఎవరైనా క్లాసుల్లోనే భోజనాలు చేస్తుంటే చెక్ చేసి చర్యలు తీసుకునే బాధ్యత ఫిజికల్ డైరెక్టర్ విన్సెంట్‌దని. అందుకే లంచవర్లో కొలీగ్స్‌తో కలిసి పిల్లల్లాగే ఎంజాయ్ చేస్తూ లంచ్ తినే విన్సెంట్ కారిడార్లో తిరుగుతూ ఎవరైనా క్లాసురూంలలో ఉన్నారేమోనని చూస్తున్నాడు.

యధాలాపంగా చివరి రూం హెచ్ఇసి క్లాసురూంపై దృష్టి పడింది. ఎవరో ఉన్నట్లు అనుమానం కలిగింది. దగ్గరగా వేసి వున్న తలుపులు తీసి లోపలికి చూశాడు.

ఒక అమ్మాయి, అబ్బాయి పక్క పక్కగా కూర్చుని ఉన్నారు. సార్‌ను చూడగానే కంగారుగా లేచి నుంచున్నారు. సెకండియర్ హెచ్.ఇ.సి. మురళి, సునీత. ప్రేయర్ టైంలో ఇద్దరూ లేరు.

మామూలుగా అయితే క్లాసులో తలొంచుకుని బుద్ధిగా పాఠాలు వినే మురళి, క్లాసులో ఉందా లేదా అన్నట్టుండే సునీత... విన్సెంట్‌కు బాగా కోపం వచ్చింది.

"వెళ్ళండి లంచ్ అవర్లో క్లాసుల్లో కూర్చోవద్దని ప్రిన్సిపల్ చెప్పడం విన్లేదూ" అన్నాడు గదమాయింపుగా... చడీ చప్పుడు లేకుండా చెరో తలుపు నుండి బయటకు వెళ్ళిపోయారు ఇద్దరూ.

మరో నాలుగైదుసార్లు విన్సెంట్ కంటపడ్డారు ఇద్దరూ. ఓసారి కాలేజి బిల్డింగు వెనకాల చెట్టు కింద, మరోసారి కాలువ దగ్గర, మిగతా పిల్లలు గుసగుసగా అంటూనే ఉన్నారు "ప్రేమ పక్షులు", "లవ్‌బర్డ్స్" అంటూ...

ఓ రోజు మధ్యాహ్నం "మురళీ సాయంత్రం నన్ను ఓసారి కలువ్" అన్నాడు విన్సెంట్ .

ఆ సాయంత్రం నాల్గింటికి స్టాఫ్‌రూంకి వచ్చి బుద్ధిమంతుడిలా చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

వచ్చీరాని మీసాలు, భయంతోనో, సిగ్గుతోనో మొహం మీద అలుముకున్న చిరు చెమటలు, నుదుటి మీద పడుతున్న క్రాఫింగ్ జుట్టూ.. బ్లూ కలర్ స్టోన్‌వాష్ జీన్స్ ఫ్యాంట్.. కొంచెం టైట్‌గా చాలీచాలనట్టున్న ఆపిల్ కట్ షర్టు మురళిని చూడగానే విన్సెంట్ లేచి బయటకు వచ్చాడు. మురళి భుజం మీద చెయ్యేసి...

"ఏరా! ఎలా చదువుతున్నావ్.." అడిగాడు విన్సెంట్.

"బాగానే చదువుతున్న" సార్

"క్వార్టర్లీ ఎగ్జామ్స్ అన్ని రాశావా".

"రాసిన సార్"

"ఎన్ని మార్కులొచ్చినయ్..."

"యాభై రెండు శాతం సార్.."

"ఫస్టియర్‌లో నీ మార్కులు ఎన్ని..."

"డెబ్బై శాతం సార్.."

"ఫస్టియర్‌కు సెకండియర్‌కు అంత తేడా ఎలా వచ్చిందిరా.. తేడా పరీక్షల్లో వచ్చిందా లేక నీ చదువులోనా" అన్నాడు విన్సెంట్.

"నా చదువులోనే సార్..." తలొంచుకుని అన్నాడు మురళి.

"ఏరా ఇప్పుడు చదువు పాడుచేసుకొని ప్రేమ అంటూ తిరగడం కరెక్టేనా... ఎందుకురా ఇలా చేస్తున్నావ్.."

"ఏమో సార్...అహ... ఏం లేదు సార్..." తడబడుతూ అన్నాడు మురళి.

"ఇదంతా పక్కకు పెట్టి చదువుమీద మనసు పెట్టు. ఇలాంటి వాటికి కాదు ఈ సమయం... వెళ్ళు."

"సరే సార్..." అంటూ వెళ్ళిపోయాడు మురళి.

మర్నాడు క్లాసులో ఇద్దరూ కనిపించలేదు. ఏమైందని అడిగితే ఫస్ట్ పిరియడ్ మురళి వచ్చిండు సార్... సునీత లేదని వెళ్ళిపోయిండు అన్నారు తోటివాళ్ళు.

వీడు చాలా ముదిరిపోయిండు అనుకున్నాడు విన్సెంట్. ఆ తర్వాత ఓ రోజు మురళి ఫ్రెండ్స్ వచ్చి చెప్పిండ్రు. 'సునీతను ఇంట్లో కాలేజీ మానేయించండ్రంట సార్.. అది తెలిసి వీడు కూడా కాలేజీకి వస్త లేడు' అంటూ.. 'సునీత వాళ్ళన్న మురళితోని మాట్లాడతానని పిలిపించిండంట సార్' అన్నాడు ఇంకో కుర్రవాడు.

అకస్మాత్తుగా మురళి కనిపించడం మానేసిండు.




పిల్లలు ఎందుకో కలవరంగా, గుసగుసగా మాట్లాడు కుంటున్నారు. రెండు వారాలుగా సునీత కూడా రావడం లేదు.

ఇద్దరూ కలిసి ఎటైనా వెళ్ళిపోయారా ఏమిటి?.. అనుకుంటున్నారు స్టాఫ్.

మురళికి తల్లిదండ్రి లేరు. అమ్మమ్మనే పెంచి పెద్దచేసింది. అట్టడుగు సామాజిక వర్గం. మురళి వాళ్ళ అమ్మమ్మ కులపెద్దలతో కలిసి వచ్చి పోలీస్‌స్టేషన్‌లో కేసు పెట్టింది. సునీత అనే అమ్మాయి తరపు వాళ్ళే తన మనవడ్ని కిడ్నాప్ చేసి ఉంటారని. పోలీసులు సునీత వాళ్ళ అన్నలను, తల్లిదండ్రిని పిలిపించారు. మురళి స్నేహితులను పిలిచి ఇంటరాగేట్ చేశారు.

మురళి స్నేహితులు.. 'ఇదంతా సునీత అన్నల పనే సార్... వాడ్ని కిడ్నాప్ చేసి కొడ్తున్నరంట' అన్నారు.

సునీతను నిజంగా నీవు మురళి ప్రేమించుకున్నారా అంటే నాకేం తెలవదు సార్... నేను మాట్లాడకపోతే ఏడ్చేవాడు. ఫోన్ చేయక పోతే చచ్చిపోతాననే వాడు. నేను కాలేజీకి రాకపోతే ఇంటికి వచ్చేవాడు అంది.

"మీ ఇంట్లో మీ ప్రేమ విషయం తెలుసా!" ఓసారి ఫోను మాట్లాడ్డం చూసి నన్నే తిట్టి కాలేజీకి పోవద్దన్నారు.

"మరి నీవు చెప్పక పోయావా మురళి విషయం."

"చెబితే మా అన్నలు మురళిని కొడ్తరేమోనని చెప్పలేదు సార్..." సునీత మాటల్లో భయం, అమాయకత్వం.

ఆ అమ్మాయిని చూస్తే... ఈ పిల్లేనా ఇంత కథకు హీరోయిన్ అనిపిస్తుంది. వెనుకపడ్డ సామాజిక వర్గానికి చెందిన ఓ మోస్తరు ఆర్థిక స్థితి కలిగిన కుటుంబం సునీతది. సన్నగా, నలుపు రంగులో ఉండాల్సిన దానికంటే తక్కువ ఎత్తుగా అతి మామూలుగా కనిపించే ఈ అమ్మాయి మురళిలాంటి బాగా చదివే... డైనమిక్‌గా ఆటల్లో, పాటల్లో అన్నింటిలో ఫస్టుగా ఉండే మురళిని అంతగా ఆకర్షించి తన చుట్టూ తిప్పుకోగలిగిందంటే ఆశ్చర్యమే.

"అదే సార్ ప్రేమ గొప్పదనం. అది బొగ్గును కూడా బంగారంగా కనిపింపచేస్తుంది." పొయటిక్‌గా అన్నారొక లెక్చరర్.

నాలుగోరోజు విన్సెంట్ వచ్చేటప్పటికి పిల్లలంతా గంభీరంగా కన్పించారు. నలుగురు గుంపుగా నిల్చున్నచోట నవ్వులు, కబుర్లు వినిపించకపోగా తలొంచుకుని ఏడుపును ఆపుకుంటున్నట్లు కన్పించింది.

"ఓ స్టూడెంట్ దగ్గరకొచ్చి... మురళి చనిపోయిండు సార్" అన్నాడు.

ఒక్కక్షణం మనసు మొద్దుబారినట్లనిపించింది.

"ఎలారా... ఎప్పుడు?

"సునీత అన్నలే వాణ్ణి తీసుకుపోయి కొట్టి కాల్వల పడేసిండ్రంట సార్.."

"నిన్న సాయంత్రం రిజర్వాయర్‌లో శవం దొరికిందంట సార్... ఎవరో చూసి చెప్తే పోలీసులు వెళ్ళి బయటకు తీసిండ్రంట."

చూసొచ్చిన పిల్లలు.. శవం గుర్తుపట్టలేనంతగా కుళ్ళిపోయి వుందని... తలమీద పెద్ద దెబ్బ ఉందని... మొహం అంతా కప్పలు, చేపలు పీక్కుతిని భయంకరంగా ఉందని చెప్పారు. ఎస్‌సి సంఘాలు, విద్యార్థి సంఘాలు శవాన్ని తీసుకువెళ్ళి సునీత ఇంటిముందు పెట్టి ధర్నాలు చేశారు. శవయాత్ర చేశారు. దళిత విద్యార్థి హత్యను ఖండించారు. దోషులను శిక్షించాలన్నారు. సునీత కుటుంబ సభ్యులు అప్పటికే పరారీలో ఉన్నారు. పోలీసులు దోషులను పట్టుకునేందుకు తమ ప్రయత్నం తాము చేస్తున్నామన్నారు. పోస్టుమార్టం రిపోర్టు వస్తే గాని నిజాలు బయటకు రావన్నారు.

మురళి స్నేహితులందరిని ఒక్కొక్కర్నే పిలిచి... ఇంటరాగేట్ చేశారు. మురళి ఫోను నుండి పోయిన కాల్స్ వచ్చిన కాల్స్ ఆధారంగా రెండు మూడు రోజులుగా మురళితో మాట్లాడిన ప్రతి ఒక్కరిని స్టేషనుకి పిలిపించారు. ఎస్.పి. గారు కాలేజీకి వచ్చి.. టీనేజీ లవ్ ఎంత ప్రమాదకరమో, అది పిల్లల జీవితాలను ఎంత నాశనం చేస్తుందో గంటలు గంటలు ఉపన్యాసాలు ఇచ్చారు. ఆర్డీవో మురళి కుటుంబానికి లక్ష రూపాయల ఆర్థిక సహాయం ప్రకటించారు.

విద్యార్థి సంఘాలు... మురళికి సంతాప సభలు పెట్టాయి. మురళిని అమర ప్రేమికుడిగా కీర్తిస్తూ కవితలు చదివారు, పాటలు పాడారు.

నెలరోజుల హడావిడి తర్వాత విషయం పాతబడింది. ఈత కని వెళ్ళి కాలుజారి కాలువలో పడి చనిపోయాడని పోలీసులు నిర్ధారించారు. కేసు మూసేశారు పోలీసులు. అంతా ఎప్పటిలాగే వుంది. సునీతను చదువు మాన్పించారు. 'వెధవ మంచి మాటల్తో చెబితే వినలేదు. తగిన శాస్తిజరిగింది అనుకున్నారు' సునీత అన్నలు.

కబడ్డీ టీంలోకి మురళి స్థానంలోకి మరో కుర్రవాడిని తీసుకున్నాడు విన్సెంట్.

అటెండెన్స్ పలికేటప్పుడు నెం. 32 రాగానే ఒక్కక్షణం ఆగి సర్దుకొని 33ని పిలుస్తున్నారు లెక్చరర్లు. హెచ్‌ఇసి క్లాసులో మురళి, సునీత కూర్చునే సీట్లు చాలా రోజులు ఖాళీగానే ఉన్నాయి.

ఇద్దరు మంచి విద్యార్థులు పోవడం వల్ల పాస్ పర్సంటేజి తగ్గిందని బాధపడ్డాడు ప్రిన్సిపాల్.

ఏ జబ్బయినా బ్లడ్ టెస్ట్ చేస్తేనో, ఎక్సరే తీస్తేనో తెలుస్తుంది. కాని ప్రేమ జబ్బును ముందే తెలుసుకోవడానికి ఏ టెస్టూ కనిపెట్టలేదు... అలా కనిపెట్టగలిగితే... ఎన్నో విలువైన పసివాళ్ళ జీవితాలను కాపాడు కోగలుగుతాం కదా... అనుకున్నాడు విన్సెంట్... లవింగ్ టీచర్...

•

## డిసెంబర్ నెల పురస్కారాలు



### నా పేరేమిటి?

కథకు........రూ.700/-

రచయిత : డా. కట్టా సత్యప్రసాద్



### గొంతెత్తొద్దూ

కవితకు.......రూ.500/-

రచయిత : సిహెచ్.వి. బృందావనరావు

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

## సత్యం-శివం-సుందరం

- వల్లభాపురం జనార్ధన



సుఖ ప్రవంతినీ పచ్చ బంగారాన్నీ
ప్రవహిస్తూ మూట గట్టించే
శ్రమ ఒక మౌన ప్రవాహం
శ్రమ విలువను కాందిశీకం చేసే
కుట్ర పునాదులను పెకలించడానికి
పోటెత్తే వరదా - ఉప్పెన
స్వేద కందరాలకు పక్షవాతాన్ని తెప్పించే
తిమ్మరుసు ముద్రలను
సేంద్రియ ఎరువుగా చేసి
కొత్త సేద్యానికి భూమిని తయారు చేయడానికి
పరుచుకొనే అగ్ని పర్వతలావా
అనీమియాతో కునారిల్లుతున్న
తనను తానే బలవర్ధకంగా
వర్ధిల్ల జేసుకొనే బలవర్ధక ఔషధం
చేదును పంచే అంతర్యాన్ని చూపించే
అంతర్నేత్రం
హక్కుల పరిరక్షణ ముసుగులో
అగమ్యగోచరలోచనాలతో
ఆధునికానంతర వాద దృశ్యాలన్ని సాకుతూ
తూర్పును మాయం చేయటం కోసం
నడిపించే ప్రణాళికల ప్రాజెక్టుల
ఎముకలు కుళ్ళబొడిచే
దండయాత్రను నడిపే దుడ్డుకర్ర
ఆకలి రుణాల ప్రశ్నలకు సవాళ్ళు విసరడానికీ
గ్లోబల్ ఫ్యాషన్ నిశీధి చెరసాలను
బద్దలు కొట్టడానికీ
గాయాల గీతాల పల్లవులను
ఉద్యమ పావురాలుగా ఎగరేస్తూ
కన్నీటి రుచినీ - కసినీ నింపుకొని
నిప్పులు చిమ్మే సూర్యగోళం
సంక్షేమ నటరత్నాలుగా
అభినయ శోభను ప్రకటిస్తూ
ఆస్కారు అవార్డులు పండించుకొంటున్న
గోమాయువు పజిళ్ళకు
కామాలు కాదు ఫుల్‌స్టాప్ పెట్టే వాక్యం
ముగింపు మారని బతుకులకు
కొత్త ముగింపును పుట్టించడానికి
దూకే జలపాతం తెగువ
నిశ్శబ్దాలను ప్రవాహ దిశను
మార్చే శక్తులకు చేసే
విస్ఫోటనా విద్యుత్తు ఫార్ములా
నిరుత్సాహానికీ - నిర్వేదానికీ
నిలువ నీడలేకుండా చేస్తూ
ప్రతికూల శక్తుల జాడలను
మడమ తిప్పించే కంఠీరవ గర్జన
కబ్జాలతో బొజ్జల
జబ్బలను బలిపించుకొన్న
అధికార ఖజానాను ఖాళీ చేయిస్తూ
దయనీయ దృశ్యాలను
సోదిలోకి రాకుండా
లేకుండా చేస్తూ
నలుపు నవ్వులకు మరణ శాసనం రాస్తూ
ప్రపంచాన్ని
సమతా సరస్సుగా మార్చటానికి
ఊరే - ప్రవహించే - ప్రసరించే
కుసుమించే శ్రమైక జీవన సౌందర్యం
సత్యం - శివం - సుందరం

## ఆర్తినాదం

- పి.లక్ష్మణ్‌రావ్



గొంతులోని
నాడీతంత్రుల్ని
శృతిచేసి
ఆర్ద్రంగా వినిపిస్తాడు
ఆకలిపాట!
బతుకువర్ణ సమీరాలు
ధర్మ ప్రభువుల్ని స్తుతిస్తూ
గానం చేసే సహస్ర నామావళి అది!
చూపుల్ని వీధి గుమ్మం దగ్గర
కాపుకాయించి
పిలుపు గానంతో
లోపలి తలుపుల్ని తడుతుంటాడు.
ఈసడింపు కరుణతోనైనా విని
దానం చేసే దయామయులకు
కృతజ్ఞతాశ్రువులతో
పాదాభిషేకం చేస్తాడు !
'పో', 'పో' అని కసురుకునే
ఇల్లాలి నిర్దయ
పాటకు తగిలితే
విసుగు చెందని బతుకు పల్లవిని
మరో ఇంటి ముందు
చరణగీతంగా సాగదీస్తాడు!


డా॥ చిలుమూరి శ్రీనివాసరావు

# సామాజిక, సాంస్కృతిక దృక్పథంలో 'మాదిగల చరిత్ర'

- డా॥ దార్ల వెంకటేశ్వరరావు

తమ జీవన విధానంలో లేఖనం భాగం కాలేని వృత్తుల వాళ్ళు సర్వసాధారణంగా చరిత్రలో గౌరవనీయంగా చిత్రితం కాలేదు. వాళ్ళ వృత్తులు కూడా నైపుణ్య రాహిత్యంతో కూడిన జాబితాల్లోకి వెళ్ళిపోయాయి. అలా చరిత్రకు దూరంగా గెంటివేయబడ్డవాళ్ళలో మాదిగల సమూహం ఒకటి. నిత్యం సమాజంలో పుట్టుక నుండి గిట్టేవరకూ జరిగే అనేక కార్యక్రమాలతో విడదీయరాని అనుబంధాన్ని పెనవేసుకున్నా, సమాజంలో అత్యంత నిరాదరణకు గురవుతున్నవాళ్ళు మాదిగలు.

కొందరి చరిత్రలు గొప్పగా కనిపిస్తాయి. మరికొందరి చరిత్రలు చప్పగా కనిపిస్తాయి. కొంతమందికి మరికొంతమంది చరిత్రలు అసలు చెప్పుకో దగినవిగా కూడా అనిపించవు. అది కొంతమంది బలవంతంగా కలిగించిన భావన. నిజానికి ప్రతి జాతికి చరిత్ర ఉన్నా, కొన్ని జాతుల చరిత్రలే మనుగడలో ఉండటానికి, మరికొన్ని చరిత్రలు ధ్వంసం కావడానికీ అనేక కారణాలున్నాయి. పాలకుల విధి, విధానాలు, ఆరోపిత సాంస్కృతిక కారణాల వంటివి వాటిలో ముఖ్యమైనవి. కొన్నిసార్లు పాలకులు మారగానే ప్రాధాన్యాలు మారిపోతుంటాయి. చరిత్ర, సంస్కృతి విలువల్లో మార్పులు చోటుచేసుకుంటాయి. మాదిగల పరిస్థితీ ఇంతే.

ఒకప్పుడు పాలకులుగా ఉన్నవాళ్ళు, పరాజితులైన తర్వాత ప్రాధాన్యతల్లో మార్పులెన్నో వచ్చాయి. మాదిగల చరిత్ర కూడా అటువంటిదే. ఈ అంశాలతో పాటు వృత్తుల్ని కూడా నైపుణ్యం గలవీ, నైపుణ్య రహితమైనవీ అంటూ చేసిన విభజన కూడా కొంతమంది చరిత్ర, సంస్కృతులకు ప్రాధాన్యమేర్పడ్డం లేదా ప్రాధాన్యం కోల్పోవడం వంటి వాటికి కారణమైంది. తమ జీవన విధానంలో లేఖనం భాగం కాలేని వృత్తుల వాళ్ళు సర్వసాధారణంగా చరిత్రలో గౌరవనీయంగా చిత్రితం కాలేదు. వాళ్ళ వృత్తులు కూడా నైపుణ్య రాహిత్యంతో కూడిన జాబితాల్లోకి వెళ్ళిపోయాయి. అలా చరిత్రకు దూరంగా గెంటివేయబడ్డవాళ్ళలో మాదిగల సమూహం ఒకటి. నిత్యం సమాజంలో పుట్టుక నుండి గిట్టేవరకూ జరిగే అనేక కార్యక్రమాలతో విడదీయరాని అనుబంధాన్ని పెనవేసుకున్నా, సమాజంలో అత్యంత నిరాదరణకు గురవుతున్నవాళ్ళు మాదిగలు.




మాదిగలతో పాటు సాధ్యమైనంతలో అన్ని జాతుల చరిత్రలనూ చరిత్రకారులు, సామాజిక శాస్త్రవేత్తలు, మరికొంతమంది భద్రపరిచే ప్రయత్నం చేసినా, జాతి ఆత్మ అందులో కనిపిస్తుందా? లేదా? అనేది చాలా ముఖ్యం. ఆ చరిత్రను భద్రపరిచే వారి దృక్పథాన్ని బట్టి ఆ చరిత్ర బహిర్గతమవుతుంది. అంటే జాతుల చరిత్ర రచనలో రెండు ప్రధాన పద్ధతులు కనిపిస్తున్నాయన్నమాట. పాలకుల లేదా అధికారిక లేదా విధిలో భాగంగా రాసే చరిత్రలు ఒక పద్ధతికి చెందితే, తమ జాతి మూలాలను తామే అన్వేషించి రాసుకునే చరిత్రలు రెండవ పద్ధతిగా చెప్పుకోవచ్చు. ఈ పద్ధతి రచనలో జాతి చైతన్యం, ఆత్మగౌరవం, అక్కడక్కడా జాతి ఆధిక్యతలు ప్రదర్శితమవుతాయి. సామాజిక, సాంస్కృతిక పద్ధతిలో వెలువడిన పరిశోధన గ్రంథమే డా॥ చిలుమూరి శ్రీనివాసరావు రాసిన "మాదిగల చరిత్ర – సంస్కృతి".

గ్రంథ రచయిత డా॥ చిలుమూరి శ్రీనివాసరావు వృత్తిరీత్యా అధ్యాపకుడు కావడం వల్ల చారిత్రక ఆధారాలను జాగ్రత్తగా సేకరించి, వాటిని ఒక క్రమపద్ధతిలో విశ్లేషించే ప్రయత్నం చేశారు. కింది వర్గాల, వర్ణాల చరిత్రల్ని రాయడం చాలా శ్రమతో కూడిన పని. రాసేటప్పుడూ, సత్యాన్ని బహిర్గతం చేసేటప్పుడు రకరకాల ఆకరాల్ని ఆధారం చేసు కోవాల్సి వుంటుంది. అందువల్ల కేవలం కల్పిత కథలుగా, పుక్కిటి పురాణాలుగా ప్రచారంలో ఉన్నవాటిని కూడా సేకరించి పరీక్షకు పెట్టక తప్పదు.

పురాణాల్ని నమ్మాలా? వద్దా? అనేది చరిత్రకారుల్లో ఒక చర్చనీయాంశమే అయినప్పటికీ పురాణాల్లోని విషయాల్నీ వదలకుండా చర్చించడం చరిత్ర రచనలోనూ జరుగుతుంది. అది మాదిగల చరిత్ర, సంస్కృతిని నిర్మించే టప్పుడు అనుసరించక

తప్పదు. అందుకనే ఈ గ్రంథంలో జాంబవ పురాణం లోని కథల్ని కూడా విశ్లేషణకు స్వీకరించారు. సామాజిక శాస్త్రంలో భాగంగా భావించే ఆంత్రోపాలజీ పరిశోధనల్లో జాతుల అనువంశిక లక్షణాల్ని గుర్తించి వారి చారిత్రక అంశాల్ని కనుగొనే ప్రయత్నం చేస్తుంటారు. ఈ గ్రంథంలో మాదిగల ముఖ కవళికల నుండి, వారి రంగు రూపురేఖల్ని వివరించడంలో ఈ పద్ధతి కనిపిస్తుంది.

క్షేత్ర స్థాయిలో పరిశోధన జరిపి వాటి ఫలితాలతో వారి చరిత్ర, సంస్కృతిని వెల్లడించే ప్రయత్నంలో సహభాగత్వ పరిశీలన (పార్టిసిపేటరీ అబ్జర్వేషన్)ను శాస్త్రీయంగా నిర్వహించ గలిగితే మంచి ఫలితాల్నివ్వగలుగుతుంది. ఈ పద్ధతిలో పరిశోధనాంశాల్ని సేకరించేటప్పుడు క్షేత్రస్థాయి లోకి వెళ్ళి వారితో కలిసి పోవాలి. అప్పుడే వాళ్ళ నిజమైన జీవితాల్ని గుర్తించగలుగుతారు. ఈ పరిశోధకుడు క్షేత్రస్థాయిలోకి వెళ్లి అనేకాంశాల్ని గుర్తించారు. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే దళితుల్లో సుమారు 61 ఉపకులాల వాళ్ళున్నారు. ఒక ఉపకులం సాంస్కృతిక అంశాలు మరో ఉపకులంలోని వాటితో పోల్చి చూస్తే చాలా భిన్నంగా కనిపిస్తాయి. అందువల్ల అస్పృశ్యత వంటి ఏవో కారణాలతో ఒక షెడ్యూల్‌లో ఒదిగిపోయినా, వారి వారి జీవన విధానాల్లో వ్యత్యాసాలున్నాయి. అందువల్ల స్వేచ్ఛగా, స్వచ్ఛంగా అడిగిన వెంటనే వారి వారి సాంస్కృతిక విషయాల్ని చెప్పేసే వీల్లేదు. కనుకనే పరిశోధకుడికి చాలా నేర్పు, ఓర్పు ఉండాలి. అలాంటి కృషి ఈ గ్రంథంలో కనిపిస్తుంది.

**ఈ పరిశోధకుడు క్షేత్రస్థాయిలోకి వెళ్లి అనేకాంశాల్ని గుర్తించారు. ఒక్క ఆంధ్రప్రదేశ్‌లోనే దళితుల్లో సుమారు 61 ఉపకులాల వాళ్ళున్నారు. ఒక ఉపకులం సాంస్కృతిక అంశాలు మరో ఉపకులంలోని వాటితో పోల్చి చూస్తే చాలా భిన్నంగా కనిపిస్తాయి. అందువల్ల అస్పృశ్యత వంటి ఏవో కారణాలతో ఒక షెడ్యూల్‌లో ఒదిగిపోయినా, వారి వారి జీవన విధానాల్లో వ్యత్యాసాలున్నాయి. అందువల్ల స్వేచ్ఛగా, స్వచ్ఛంగా అడిగిన వెంటనే వారి వారి సాంస్కృతిక విషయాల్ని చెప్పేసే వీల్లేదు. కనుకనే పరిశోధకుడికి చాలా నేర్పు, ఓర్పు ఉండాలి. అలాంటి కృషి ఈ గ్రంథంలో కనిపిస్తుంది.**

భారతదేశంలో వర్ణ వ్యవస్థ, అస్పృశ్యతల ఆవిర్భావం, మానవ జాతులు, మాదిగ జాతి, మాదిగల చారిత్రక నేపథ్యం, మాదిగ ఉపకులాలు, జనాభా వివరాలు, మాదిగల జీవన శైలి, సంస్కృతి, జాతి మూలాలను తెలిపేటట్లు గ్రంథాన్ని ఎనిమిది అధ్యాయాలుగా రాశారు. భారతదేశంలో అత్యధిక జనాభా కలిగిన కులాల్లో మూడవ స్థానంలో మాదిగలే ఉన్నారని గణాంకాలతో సహా నిరూపించారు. వీరిని దేశవ్యాప్తంగా రకరకాల పేర్లతో పిలుస్తుంటారని ఆ పేర్లను వివరించారు. ఆంధ్రప్రదేశ్‌లో మాదిగలు ఎనిమిది శాతం వున్నా, తగిన స్థాయిలో అవకాశాల్ని అందుకోలేకపోయారని చెప్పారు.

మాదిగలకు గల చరిత్ర, సంస్కృతిని గుర్తించడంలో ఈ గ్రంథ ప్రత్యేకతను వివరిస్తూ ఆచార్య కొలకలూరి ఇనాక్ చక్కని ముందుమాటను రాశారు. "ఆర్యుల కంటే ప్రాచీనులైన కాకసాయిడ్, మంగోలాయిడ్, నీగ్రాయిడ్, ఆస్ట్రలాయిడ్ మూలాల నుంచి మాదిగల ప్రాచీనత వెతకడానికి (పరిశోధకుడు డా॥ చిలుమూరి శ్రీనివాసరావు) ప్రయత్నించాడు. ఆర్యుల కంటే ప్రాచీనులైన మాదిగల్ని అతి ప్రాచీన భారతీయుల్ని, భారతదేశ మూలవాసుల్ని నిర్ణయించడానికి వేదాలు, ఉపనిషత్తులు పనికిరావు. సోషియాలజీ, ఆంత్రోపాలజీ, చరిత్ర, సంస్కృతి మూలాల్లోకి పోయి చేయవలసిన పనిలో భాగంగా కృషి చేసిన పరిశోధకుడ్ని విద్యావేత్తలు, ఆంధ్రులు ముఖ్యంగా మాదిగలు అభినందిస్తారంటూ" ఆచార్య ఇనాక్ కితాబిచ్చారు.

సాహిత్య పరిశోధనను ఇతర శాస్త్రాలతో సమన్వయిస్తే సాహిత్యానికున్న ప్రయోజనం అర్ధవంతంగా ఉంటుంది. తెలుగు సాహిత్యాన్ని మార్క్సిస్టు భావజాలంతో విమర్శించే స్వభావాన్ని సంతరించుకున్న తర్వాత సామాజిక ప్రయోజనాన్ని నెరవేర్చే బాధ్యతను ఒక మంచి గుణంగా మార్చుకుంది. మార్క్సిజం వల్ల కింది వర్ణాలు, వర్గాల వారి జీవితాల్ని, భావాల్ని పరిగణనలోకి తీసుకోవాలనే వాదనకు బలం చేకూరింది. అలాగే చరిత్ర రచనలోనూ ప్రజల కోణం నుండి అవగాహన చేసుకునే పద్ధతికి ప్రాముఖ్యం పెరిగింది. భావవాద దృక్పథానికి క్రమేపీ కాలం చెల్లిపోయి, భౌతిక పరిస్థితుల్ని, చారిత్రక స్థితిగతుల్ని ఆధారంగా చేసుకుని, పోషకుల ప్రభావాన్ని అంచనా వేస్తూ సాహిత్యాన్ని మూల్యాంకన చేయడం శాస్త్రీయ విధానమనే ఆలోచన విస్తృతమైంది. దీనితో సాహిత్య విలువలు పడిపోతున్నాయనే గోల కూడా సంప్రదాయ సాహితీవేత్తల నుండి వినిపిస్తుంది. ఈ నేపథ్యంలో ఈ పుస్తకం సాహిత్య మూల్యాంకనానికి ఇతర శాస్త్రాల సమన్వయమెంత అవసరమో తెలిపేటట్లుంది.

పాఠకుల సౌకర్యార్థం ఈ పుస్తకంలోని కొన్ని ముఖ్యాంశాల్ని కింద పేర్కొంటున్నాను.

1. మాదిగలు అస్పృశ్యులు కారు. గతంలో రాజ్యమేలిన రాజులు, గొప్ప కవులు, ధర్మదాతలు. వీరులుగా గొప్ప చరిత్ర కలవారు. (పుట : 18). 2. మాదిగలు ఊరికి దూరంగా ఎందుకు నెట్టివేయబడ్డారో తెలియాలంటే వీరికున్న నిజమైన చరిత్ర తెలియాలి. (పుట : 19) 3. మొదట్లో యజ్ఞయాగాదుల్లో పవిత్రంగా గో మాంసాన్ని అందరూ తినే వారు. దీనివల్ల క్రమేపి పశు సంపద నశించడం గమనించిన బుద్ధుడు దాన్ని అహింస సిద్ధాంతంతో ముడిపెట్టి ప్రచారం చేసి మాంసాహారాన్నే నిషేధించేలా ఉద్యమించాడు. దీన్ని గమనించిన బ్రాహ్మణులు, తమ అస్తిత్వానికే భంగమేర్పడుతున్న పరిస్థితుల్ని గమనించి గోవధను నిషేధించడంతో పాటు, మాంసాహారాన్ని తినడమే పాపమనే భావనను ప్రచారం చేశారని చాలామంది చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు. ఇది బౌద్ధమత ప్రచార చరిత్రను గమనించిన వారికి తెలుస్తుంది. ఈ పరిస్థితుల్లో మాంసాన్ని తినడం, అదీ బతికున్న దానికంటే, చనిపోయిన పశువుల మాంసాన్ని తినడం అపవిత్రంగా, అస్పృశ్యతకు దారి తీసిందనేది డా॥ అంబేద్కర్ వాదన. దీన్నే ఆధారంగా తీసుకున్నారీ పరిశోధకుడు. దీనితో పాటు స్థానికులపై ఆర్యులు విజయం సాధించి, ఓడిపోయిన వారిని దాసులుగా చేసుకున్నారనీ, అలా ఓడిపోయిన జాతుల్లో మాదిగలు కూడా ఒకరని వివరించారు. (పుట : 32)

4. ఆదిమజాతుల్లో ఎక్కువగా 'బి' గ్రూపు రక్తం గల వాళ్ళుంటారు. అలాగే మాదిగల్లోనూ ఈ గ్రూపు రక్తం వాళ్ళే అధికంగా కనిపిస్తారు. కనుక, మాదిగలు ఆదిమజాతికి చెందిన వాళ్ళవుతారు. (పుట : 47,

## సంఘటనలు

- డా॥ సి. నారాయణరెడ్డి

సాఫీగా సాగిపోయే బతుకు దారిలో
అప్పుడప్పుడు
కొన్ని విషమ సంఘటనలు ఎదురై
పాదాలను పరీక్షిస్తాయి.
తిరిగిపోతారా లేదా అని హెచ్చరిస్తాయి.
హెచ్చరికలతో తిరిగిపోయే
పిచ్చుకలు కావు ఆ పాదాలు
అవి వేసిన అడుగును వెనక్కి తిప్పుకోవు
వీచే గాలితో కలిసి దూసుకుపోతూనే వుంటాయి
ఎలాగైనా పాదాలను పట్టి లాగేయాలనుకున్న
సంఘటనల ఎత్తుగడలు
ఎప్పటికప్పుడు తలకిందులవుతుంటాయి
అప్పటికి తప్పుకున్న సంఘటనలు
అదృశ్యంగా పాదాల వెంట పడి వస్తుంటాయి
అవకాశం కోసం ఎదురు చూస్తుంటాయి.



పాదాల గురి ఎదుట వున్న గమ్యం వైపే
అప్పుడవి ఆలోచనల కేంద్రాలవుతాయి.
వాటి ధ్యాసంతా భవిష్యత్తుపైనే
పాదాలు పరధ్యానంలో వుండే క్షణాల కోసం
ఎదురు చూస్తున్న సంఘటనలు
దారి నడుమ గుప్తంగా
బురద గుంటలై పొంచి వుంటాయి.
అన్యమనస్కంగా వున్న పాదాలు
వాటిలో పడి
గబుక్కున జారిపడక తప్పదు
చుట్టూ చూస్తే ఎవరూ కనిపించరు
ఏవో వికవిక నవ్వులు తప్ప
పాదాలకు అర్థమవుతుంది
అవి ముష్కర సంఘటనల మురికి నవ్వులని
ఒక్కమాటుగా ఎగిరి నిలిచి
తమ నిర్దిష్ట గమ్యం వైపు
విసురుగా సాగిపోతాయి పాదాలు

53)

5. మాదిగలు బలంగా ఉండి, అత్యధిక శాతం మంది గోధుమ వర్ణంలో ఉంటారు. (పుట : 48)

6. మాదిగలు రాజ్యాల్ని పాలించారనీ, యుద్ధాలు చేసి విజయం సాధించారనీ చెప్పడానికి కడప పరిసరాల్లోని అక్క దేవతల కొలను గాథల్ని పరిశీలించాలి.

7. మాదిగలు కాళికాదేవిని ఆరాధించేవారనీ, వీరిది మాతంగ వంశంగా పేరు రావడానికి ఇదొక ప్రధాన కారణం. దీనితో పాటు కర్ణాటకలో పాలకులుగా ఉన్న మాతంగ వంశమే మాదిగలదని హెచ్.ఎ. స్టువర్ట్ అనే చరిత్రకారుడు సోదాహరణంగా వివరించిన దాన్ని గమనించాలి. (పుట : 54)

8. హర్షుని ఆస్థానంలో బాణుడు, మయూరుడితో సమానంగా గౌరవింపబడిన దివాకరుడనే కవి మాతంగ వంశానికి చెందినవాడే (పుట : 56)

9. అమరావతీ స్థూపంలోని పూర్ణకలశ రూపశిల్పి 'విధుక' అనే మాదిగ జాతికి చెందిన వాడు. అదే నేటికీ ఆంధ్రప్రదేశ్ అధికార చిహ్నంగా కొనసాగుతుంది. (పుట : 57)

10. కాటమరాజు కొలువులో ఉన్న బిరినీడు, పల్నాటి యుద్ధంలో వీరుడైన కన్నమనీడు మాదిగ వీరులు. మాదిగలుగానే భావించే గోసంగి అనే ఉపకులం మాదిగలదే. నేటికీ కొంగవాలు కత్తి ఉపయోగించగలిగేది మాదిగలే. గుంటూరు పరిసరాల్లో నేటికీ పూజింపబడుతున్న వీరశిలలు మాదిగల వీరత్వాన్ని తెలుపుతున్నాయి. (పుట : 65)

11. యుద్ధ సమయంలో వీరత్వాన్ని ప్రేరేపించే వాయిద్యాలను మ్రోగించే కళా నైపుణ్యం మాదిగలదే. నేటికీ జానపద కళారూపాలుగా స్థానిక చరిత్రల్ని కాపాడుతున్నవాళ్ళు మాదిగలు. చిందు భాగవతం, జాంబవ పురాణం మొదలైనవెన్నో మాదిగలకు చెందిన పురాణ వారసత్వ సంపద మాదిగలకుంది.

12. మాదిగలు పురాణాల్లోని పవిత్రమైన అరుంధతీదేవి వంశానికి చెందిన వారిగా చెప్పుకుంటారు. జాంబవంతుణ్ణీ తమ మూలపురుషుడుగా భావిస్తారు. అందుకే మాదిగలకే ఉన్న మరెన్నో పేర్లలో అరుంధతీయులు, జాంబవంతులు అనే పేర్లు అనేక ప్రాంతాల్లో కనిపిస్తాయి.

13. మాదిగల్లో జాంబవంతులు, అరుంధతీయులు, అసాదులు, గోసంగులు, బైండ్ల మొదలైన ఉపకులాల్ని పూజారి వర్గంగా భావిస్తారు. తమ వివాహాది కార్యక్రమాల్ని జరుపుకోవడానికి ఏర్పడిన ఒక ప్రత్యామ్నాయ వ్యవస్థ మాదిగలకుంది.

14. తెలుగు సాహిత్యంలో "మాల"గా వ్యవహారంలో ఉన్న కులాలు మాదిగలకు చెందినవి. ఆముక్తమాల్యదలో మాలదాసరి కథలోని పాత్ర గోసంగులకు చెందింది. గోసంగులు మాదిగలు.

ఇలా అనేకమైన కొత్త అంశాల్ని ఈ పుస్తకం అందిస్తుంది.

మాదిగల చరిత్ర, సంస్కృతి ఏ ఇతర జాతులకీ ఏమాత్రం తీసిపోదు. పాలకుల అధికార ప్రాబల్యం, విశేష వ్యాప్తి, ప్రచారం, దాన్ని ఉన్నతీకరించుకునే వ్యవస్థ ఉండటం వల్ల కొన్ని సంస్కృతులు మాత్రమే కనిపిస్తున్నాయి. అలా కనుమరుగైపోతున్న సంస్కృతుల్లో మాదిగల సంస్కృతి ఒకటైంది. నిజానికి ఇది మానవుల్ని ఏక సంస్కృతిలో జీవించే లక్షణాన్ని సంతరించుకున్నా, ఆధిక్యం ప్రదర్శించనంతవరకూ, తమదే నిజమైన వారసత్వమనో సంస్కృతి అనో భావించకపోతే బాగుంటుంది. ఏ సంస్కృతైనా కాలానుగుణంగా మారాలి. మారని స్వభావం ఉంటే అది ప్రమాదకరం. మాదిగలు మారుతున్నారు. అది ప్రగతికి మార్గదర్శకం. మారకుండా ఆధిక్యాన్ని ప్రదర్శించాలనే సంస్కృతులు ఆధిపత్య సంస్కృతులని తెలిపే చక్కని పరిశోధన గ్రంథాన్ని రాసిన డా॥ చిలుమూరి శ్రీనివాసరావు అభినందనీయుడు.

# తెలుగు నవలపై మార్క్సిజం ప్రభావం




**- నిఖిలేశ్వర్**

**భారతీయ సామాజిక వ్యవస్థలోని అంతర్ వైరుధ్యాలను వర్గ పోరాట దృక్పథంతో చిత్రించిన నవలలు ఇరవై వరకు వున్నాయి. ఈ ఇరవై లేదా మరికొన్ని ఖచ్చితంగా మార్క్సిస్టు మూలసూత్రాల కనుగుణంగా రచించబడ్డాయని అనుకోలేము. ఎందువల్లనంటే సృజనాత్మక రచన జీవితాన్ని అనుసరించిపోతుంది తప్ప శాస్త్రీయ భావజాలాన్ని అనుకరించదు. అది అవగాహనకు తోడ్పడుతుంది.**

**నూ**రేళ్ళ తెలుగు నవలా చరిత్రలో వేలాది నవలలు పాఠకులను అలరించినా, మార్క్సిజం ప్రభావంతో వచ్చిన నవలలు తక్కువే! సంఘ సంస్కరణ మూలసూత్రంగా వెలువడిన నవలల సంఖ్య మాత్రం ఎక్కువ! అధిక సంఖ్యలో మాత్రం కథా కాలక్షేపానికి పనికొచ్చినవే!

భారతీయ సామాజిక వ్యవస్థలోని అంతర్ వైరుధ్యాలను వర్గ పోరాట దృక్పథంతో చిత్రించిన నవలలు ఇరవై వరకు వున్నాయి. ఈ ఇరవై లేదా మరికొన్ని ఖచ్చితంగా మార్క్సిస్టు మూలసూత్రాల కనుగుణంగా రచించబడ్డాయని అనుకోలేము. ఎందువల్లనంటే సృజనాత్మక రచన జీవితాన్ని అనుసరించిపోతుంది తప్ప శాస్త్రీయ భావజాలాన్ని అనుకరించదు. అది అవగాహనకు తోడ్పడుతుంది.

మార్క్సిజం ప్రధానంగా భౌతిక తత్వ శాస్త్రంలో ఒక భాగంగా ఆర్థిక సూత్రాలను - ఉత్పత్తి సంబంధాలను విశ్లేషించిన సామాజిక శాస్త్రం. చారిత్రక గతి తార్కిక చింతనతో మానవాళి వ్యవస్థను నిగ్గుతేల్చిన సాధనం. ఈ తాత్విక సామాజిక సాధనాన్ని ఆయా దశలకు - సంబంధాలకు సమన్వయించి, మానవ స్వభావాన్ని - ప్రవర్తనను - పరిణామాలను లోతుగా పరిశీలించిన 'అప్లైడ్ సోషల్ సైన్స్'గా స్వీకరించవలసి వుంటుంది.

ఈ ప్రయత్నమే కొంతమేర ఆధునిక తెలుగు నవలా రచయితలు సాధించగలిగారు. అయితే మార్క్సిజం పిడివాదం కాదని నిరంతరం చలనశీలంగా కొనసాగుతున్న సామాజిక శాస్త్రమని మనం గ్రహించినపుడు పరిణామ క్రమాన్ని మరింత నిర్దిష్టంగా అర్థం చేసు కోగలం. బోల్షివిక్ అక్టోబర్ విప్లవ నేపథ్యంలో ఆచరణలో మార్క్సిజం తన ప్రభావాన్ని చూపింది. ఆ తర్వాత చారిత్రక క్రమంలో మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానంగా విస్తరిస్తూ, యూరోపియన్ సందర్భంలో యూరో కమ్యూనిజం కూడా చర్చనీయాంశమైనది. ఈ మార్క్సిస్టు పరిణామ క్రమమంతా తెలుగు నవలల్లో ప్రతిఫలించలేదు. సోషలిస్టు వాస్తవికతకు దగ్గరగా రాగలిగాయి కొంతవరకు.

అక్టోబర్ విప్లవ ప్రభావం మొదలు తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటాల అనుభవాలు, నక్సల్బరీ - శ్రీకాకుళ పోరాటాల నేపథ్యం తెలుగు నవలకు స్ఫూర్తినిచ్చింది. అయితే అలాంటి తెలుగు నవలలు ఎన్ని కాల పరీక్షలకు నిలవగలిగాయి?

ఇంతకు ఒక ఉత్తమ నవలకు నిర్వచనమేమిటో తెలుసుకుంటే నవలా ప్రక్రియ సాధించే సామాజిక ప్రయోజనం అర్థమవుతుంది. అలానే కాలపరీక్షకు నిలిచే ఈ ప్రక్రియ మౌలిక లక్షణమేమిటో గ్రహించగలం. ఆ నిర్వచనాల్లోకి వెడితే...

"సజీవమైన జగత్తుతో పరిచయం చేసే కళాకృతి నవల. చాలా విధాలా ఈ జగత్తు మన చుట్టూ వున్న ప్రపంచాన్ని పోలి వుంటుంది."

**- లార్డ్ డెవిడ్ సిసిల్**

"నవల అన్నది కేవలం గుణాత్మకమైన కాల్పనిక కథ కాదు. అది మానవుడి జీవితాన్ని గురించి, పరిపూర్ణ మానవ చేష్టల గురించి గద్యరూపంలో చెప్పబడిన వ్యాసం."

**- రాంక్స్ ఫాక్స్ (నావెల్ & ద పీపుల్)**

ఈ నిర్వచనాల నేపథ్యంలోనే కాల్పనిక సాహిత్యం (ఫిక్షన్) ఆయా సామాజిక (ఫిక్షన్) ఆయా సామాజిక ఉద్యమాలను నిజాయితీగా ప్రతిఫలించి నపుడు ఉత్తమ రచనలుగా మిగిలిపోతాయి. సమాజంలోని (వ్యవస్థాపరంగా) అంతర్గత నిజాలను వెలికితీసి మానవ సంబంధాలను మార్పు లను చిత్రించి తర్వాత వచ్చే తరాలకు మార్గదర్శకంగా నిలిచిపోతాయి.

అలా మార్గదర్శకంగా నిలిచిన తెలుగు నవలలను ప్రస్తావించే ముందు తెలుగునాట ఇరవయ్యవ శతాబ్దంలో ఆకట్టుకున్న గోర్కి నవల "అమ్మ"ను, ప్రేమ్‌చంద్ నవలలను (ఇతరత్రా పాఠకులను ప్రభావితం చేసిన శరత్‌బాబు నవలలు కూడా) మరచిపోలేము.

ఇక స్థూలంగా మార్క్సిజం ప్రభావంతో తెలుగులో వచ్చిన నవలలు – ఉన్నవ లక్ష్మీనారాయణ "మాలపల్లి, ఉప్పల లక్ష్మణరావు 'అతడు–ఆమె', కొడవటిగంటి 'చదువు', మహీధరరావు 'రథచక్రాలు' 'ఈ దారి ఎక్కడికి', శారద 'అపస్వరాలు' బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు', వట్టికోట ఆళ్వారుస్వామి – 'ప్రజల మనిషి', 'గంగు', దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు', మోదుగపూలు, జి.వి. కృష్ణారావు 'కీలుబొమ్మలు', బలివాడ కాంతారావు 'దగాపడిన తమ్ముడు' వాసిరెడ్డి సీతాదేవి 'మట్టిమనిషి' , రా.వి. శాస్త్రి 'రత్తాలు – రాంబాబు' 'రాజు – మహిషి', బీనాదేవి 'హేంగ్‌మీ క్విక్', రంగనాయకమ్మ 'జానకి విముక్తి', డా॥ కేశవరెడ్డి 'రాముడున్నాడు – రాజ్యముండాది', భూషణం 'అడివంటుకున్నది', అల్లం రాజయ్య 'కొలిమంటుకున్నది', పతంజలి 'ఖాకీవనం', అర్నాద్ 'చీకటోళ్ళు' 'స్పార్టకస్' నవల, 'ఖాకీ బతుకులు', 'నల్ల వజ్రం', కల్యాణరావు 'అంటరాని వసంతం'.

గత ఏడు దశాబ్దాల కాలంలో వెలువడిన ఈ నవలలన్నీ తెలుగు ప్రజల జీవిత గమనాన్ని, ఆయా చారిత్రక సామాజిక ఉద్యమాల సందర్భాలలో వచ్చిన పరిణామాలను సృజనాత్మకంగా మలచ గలిగాయి... అయితే మార్క్సిస్టు దృష్టితో నిశితంగా పరిశీలిస్తే వీటిలో ఎన్ని నవలలు సోషలిస్టు వాస్తవికతకు దగ్గరగా లేదా విమర్శనాత్మక వాస్తవికతను ప్రతిబింబించాయో అనే అంశం చర్చనీయాంశమే!

మార్క్సిస్టు ప్రభావమున్న ఈ తెలుగు నవలల ఇతివృత్తం, శిల్పం, రచనా పరమైన శైలి, తాత్విక భూమికలను సవిస్తారంగా విశ్లేషించే అవకాశం ఇక్కడ లేదు. స్థూలంగా వీటిలోని కొన్ని ముఖ్యమైన నవలల వస్తు – రూపాల గురించీ ప్రస్తావించుకోవచ్చు...

ఉన్నవ వారి నవల 'మాలపల్లి' 1936–38 దరిమిలా జాతీయోద్యమ కాలంలో వచ్చిన పరిణామాల నేపథ్యంలో ప్రధానంగా గాంధేయ దృక్పథంతో వచ్చిన రచన. ఇక ఆనాటికే రష్యన్ బోల్షివిక్ అక్టోబర్ విప్లవ ప్రభావం ప్రపంచవ్యాప్తంగా వుంది. ఈ నవలలో తక్కెళ్ళ జగ్గడు ధర్మకన్నాలు వేసి (ధనికులను దోచి పేదలకు సహాయం చేస్తూ) తనదైన తీరులో సామాజిక తిరుగుబాటు ద్వారా మార్పు కోరుకుంటాడా... జగ్గడి తండ్రి రామదాసు గాంధేయవాది. తన కుమారుడు తిరుగుబాటు పద్ధతిని ఆమోదించలేకపోయినా, ఈ దేశంలో రావలసిన విప్లవానికి ఏ మార్గం మంచిదో భవిష్యత్తు నిర్ణయించగలదని భావిస్తాడు. ఈ నవల ద్వారా ఉన్నవవారు గాంధేయ భావజాలానికి – మార్క్సిస్టు దృక్పథానికి మధ్య సంఘర్షణను చిత్రించి, సామ్యవాద వర్గ పోరాటాన్ని ఉదారవాద దృష్టితో ఆహ్వానిస్తాడు.

ఉప్పల లక్ష్మణరావు నవల 'అతడు – ఆమె' నాలుగు సంపుటాలుగా చరిత్ర సృష్టించింది. ఉప్పలవారు జర్మనీలో వుండగా స్విస్ మహిళ మెల్లీ షోలింగర్‌తో పరిచయం ఏర్పడి, వివాహం చేసుకుంటారు. జీవితాంతం లైంగిక సంబంధం లేకుండా దాంపత్య జీవితాన్ని సమాజ సేవకు అర్పించుకున్నారు. ఫ్రాన్స్‌లో వున్నపుడే మెల్లీ ప్రోత్సాహంతో ఉప్పలవారు కమ్యూనిస్టు ప్రణాళిక, రాజ్యాంగ యంత్రం, ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధాల చరిత్ర మొదలగునవి అధ్యయనం చేశారు.

'అతడు – ఆమె' నవల మూడో భాగంలో కమ్యూనిస్టు ఉద్యమాల ప్రస్తావన వుంది. కమ్యూనిస్టు సమాజం స్థిరపడాలంటే స్త్రీ – పురుష సంబంధాలలో విప్లవాత్మకమైన మార్పులు రావాలని, సనాతన మతాచారాలు అంతిమంగా ఆధునిక అభ్యుదయ మార్గాన మారిపోతా యనే చారిత్రక ఆశావాదంతో ఈ నవలను 'చరిత్ర'గా రూపొందించారు.

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత వచ్చిన క్రమ పరిణామాలతో పాటు రెండో ప్రపంచ యుద్ధ కాలం నాటి నేపథ్యంలో కొడవటిగంటి కుటుంబరావుగారి నవల 'చదువు'ను ఒక అత్యుత్తమ డాక్యుమెంటరీ నవలగా విమర్శకులు భావిస్తున్నారు. సామాజికంగా వచ్చే పెనుమార్పులతో మనుషులు చెదిరిపోతారనీ, ఆత్మీయ సంబంధ బాంధవ్యాలలో మార్పు వస్తుందని, కొ.కు వర్గ పోరాట దృక్పథాన్ని సమన్వయించి రచించారు. చదువురాని తల్లి కొడుకుని పెంచి చదువు చెప్పించిన తర్వాత ఆలోచనా విధానాల్లో వచ్చే వ్యత్యాసాలు, ఆ తర్వాత వచ్చే తరాలను ఎలా ప్రభావితం చేస్తాయో ఈ నవల చూపుతుంది. స్కూలు చదువుకంటే జీవితం నేర్పే చదువు నిర్ణాయక పాత్ర వహిస్తుందనే యథార్థాన్ని కొ.కు. ఒక సామాజిక వాస్తవంగా చిత్రించారు.

ఇక మృత్యుంజయులు, రథచక్రాలు, ప్రజల మనిషి, చిల్లర దేవుళ్ళు, మోదుగపూలు నవలలు ఆనాటి భూస్వామ్య వ్యవస్థను, నిజాం ఫ్యూడల్ పాలనను, రజాకార్ల దురంతాలను ప్రతిఘటించిన ప్రజాపోరాటాల ఇతివృత్తంతో వచ్చినవే. ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన రైతాంగ సాయుధ పోరాటాల వాస్తవికతను అక్షరబద్ధం చేయాలంటే రచయితలకు తప్పనిసరిగా మార్క్సిస్టు సిద్ధాంతాల అవగాహన వుండవలసిందే. ఆ చారిత్రక బాధ్యతను ఈ నవలల ద్వారా పైన పేర్కొన్న రచయితలు నిర్వహించారు.

1947 తర్వాత భారత రాజ్యాంగం నిర్దేశించిన శాసన పద్ధతిలోనే ఈ దేశంలోని ధనికస్వామ్యం – భూస్వామ్య శక్తులు, బూర్జువా దళారి పాలక వర్గాలు పాలన ఎలాంటి మార్పులను తీసుకు రాగలిగినదో మనందరికి తెలుసు. దీనికి సమాంతరంగా వర్గ పోరాట దృక్పథంతో ప్రజా పోరాటాలను నిర్వహించిన చరిత్ర కమ్యూనిస్టు పార్టీ వున్నది.

గత 60 సంవత్సరాల కాలంలో ఈ దేశంలోని వర్గ వ్యవస్థ లోని కుల జాఢ్యం, మత మౌఢ్యంతో పాటు ధనిక పెట్టుబడిదారీ పెత్త నాన్ని, ఆర్థిక ప్రాబల్యాన్ని ఎండగడుతూ ప్రజలు పోరాడుతూనే వున్నారు.

వర్తమాన రాజ్యం – దాని స్వభావం, ఎన్నికల జూదంలో నెగ్గుకొస్తున్న పాలకుల ఆచరణ వల్ల దుష్ఫలితాలు, కార్మిక – కర్షక – మధ్యతరగతి ప్రజల జీవన స్థితిగతులు యధార్ధ గాథలుగా సజీవ జీవన దృశ్యాలుగా మరికొన్ని నవలలు వచ్చాయి. వీటిపై మార్క్సిస్టు ప్రభావం ప్రత్యక్షంగా పరోక్షంగా వుంది. ముఖ్యంగా మార్క్సిస్టు భావజాలాన్ని అంతస్సూత్రంగా అన్వయించుకున్న నవలలు రత్తాలు – రాంబాబు, హేంగ్ మీ క్విక్, రాముడున్నాడు – రాజ్యముండాది, మట్టిమనిషి, కొలిమంటుకొన్నది, అడివంటుకొన్నది, జానకి విముక్తి, ఖాకీ బతుకులు, చీకటోళ్ళు, నల్లవజ్రం.

ఇక గత దశాబ్దికాలంలో వచ్చిన నవలల్లో కల్యాణరావు నవల 'అంటరాని వసంతం'ను ప్రత్యేకించి పేర్కొనవలసి వుంటుంది. ఈ దేశంలోని అట్టడుగు కులాల పేరిట తరతరాలుగా అణగారిన దళితుల జీవితాన్ని, వారి మూలాలను ఒక కావ్యాత్మకమైన శైలితో కల్యాణరావు ఈ నవల రచించారు. వర్గ పోరాట దృక్పథాన్ని కుల పోరాటానికి సమన్వయించి, దళితుల జీవన సమరాన్ని ఆట – పాటతో ముడిపెట్టే చారిత్రిక సామాజిక పరిణామ క్రమంలో ఆయా పాత్రలను సజీవంగా నిలిపారు. ఆ పాత్రల అంతరంగ కథనం, అస్తిత్వ పోరాటంలోని వేదన పాఠకులను తమ వెంట లాక్కెళ్ళి పోతాయి.

ఆధునిక తెలుగు సాహిత్యంలో నవలా ప్రక్రియ ఒక దశలో విచ్చలవిడిగా వ్యాపార వస్తువుగా బలపడినా, పాఠకులను ఆకట్టుకున్నా కాలానికి తలవంచింది. సామాజిక బాధ్యత కళాత్మక విలువలతో వచ్చిన తెలుగు నవలలు సంఖ్యలో తక్కువైనా కొన్ని గుణాత్మకంగా మార్క్సిస్టు తాత్వికతతో దిశా నిర్దేశం చేస్తూ నిలిచిపోయాయి. అయితే తెలుగు నవలా ప్రక్రియ మారుతున్న కాలానుగుణంగా తన ప్రమాణాలను కాపాడుకోకుండా బలహీనంగా మిగిలిపోయింది. •

కథ

# వరం



- బరకు

**పొలం గట్టు మీద కూర్చున్న 'ఎంకడి' కళ్ళు వెలిగిపోతున్నాయి. చిరునవ్వుతో పాటు ముఖంపై ముడతలు ఉడికిపోయిన యవ్వనానికి చిహ్నంగా తొణికిసలాడుతున్నాయి. సూరమ్మ కూతురు లచిమి, నర్సమ్మ, సిన్నోడి ఇంటిది కమలమ్మ 'ముఠా', కోకలు ఎగ్గొట్టి చిటుకు చిటుకున నాట్లు వేస్తుంటే పొలం పచ్చబారుతుంది.**

సంధ్య వెలుగులు రాకముందే నాట్లు పూర్తి చేసి సత్తు డబ్బాలను సేత్తో పట్టుకున్న ఆడంగులంతా గనెమపై వయ్యారంగా నడుస్తూ ఇంటి దారి పట్టారు. మడిలో పీకిన నారు మాగాణిలో మరో ఉసురు పోసుకుని సల్లగాలికి వయ్యారంగా ఊగుతుంటే 'ఎంకడు' జ్ఞాపకాల్లోకి వెళ్ళాడు.

...

'ఉంది, ఎకరం నేల. రెక్కలు ముక్కలు చేసుకుంటే గాని ఏటా కాసిన్ని తిండి గింజలు ఇంటికి రావు. మూడేళ్ళుగా వర్షాలు సక్కంగా రాక, సాగర్ నీళ్ళు లేక ఊర్లో చెరువు నిండు కోవడంతో జొన్న బువ్వతో కడుపు నింపుకున్నాడు 'ఎంకడు'.

'చిక్కటి మజ్జిగ... మాడు జొన్న చెక్కలు కలిపి తింటూ మధ్యలో మామిడి బద్ద నంజుకోవడమంటే ఎంకడికి భలే ఇది.'

ముప్పై యేండ్లు కష్టసుఖాలు పంచుకున్న ఇంటిది వదలని జబ్బుతో 'వరానికి పెళ్ళి చేయాలన్న దిగులుతో పోయింది.'

"సొసైటీ అప్పు పడకన పడి ఉందని ఇన్నాళ్ళూ... ఆగాడు కాని, ప్రతి యేడూ 'ఎండల్లో తాటాకులు తెచ్చి గుడిసె ముందు పందిరి వేస్తూనే ఉన్నాడు. అయితే వాటికి మామిడి ఆకులు కట్టే యోగమే ఎంకడికి పట్టలేదు."

"ఈసారి మాత్రం అలా కాదు. మేఘాలు చల్లగా చూసి, నేల తల్లి కడుపు పండేలా ఉంది. పరిస్థితి చూస్తే ముప్పై బస్తాల ఒడ్లు గుడిశకి చేరతాయి. ఓ బస్తాడు 'నూకాలమ్మ' మొక్కు పోయినా – అప్పు తీర్చితే ఏలిననాటి శని వదిలి పోతుంది."

రుణం లేని పొలం కాగితాలు మేనల్లుడు రాంబాబు చేతిలో పెడితే 'వరం' ఓ ఇంటిదవుతుందని ఎంకడి ఆశ...!

చీకటి ఆవరించి, దారి మసక బారడంతో గనెమపై తుండు భుజంపై వేసుకుని, ముల్లు కర్రతో ఇంటి దారి పట్టాడు 'ఎంకడు'.

...

నెలలు కళ్ళ ముందు గిర్రున తిరిగాయి. పొలంలో వరికంకులు ముదిరి కోతకు సిద్ధంగా ఉన్నాయి. ఇక రోజులే కోత కోసి, కుప్పలు నూర్చి ఒడ్డు గాదెకు చేరాయా! ఎండల్లో తన గుండెలపై బరువు తగ్గినట్టే. అరిగిన మోకాళ్ళకి యేడి యేడి ఆవదం రుద్దుకుంటున్నాడు 'ఎంకడు'.

కాళ్ళు సలపరంగా ఉన్నా ఆ రోజే యెళ్ళి 'కమల' ముతాని ఎల్లుండి కోతలకు రమ్మని పిలిచాడు. కుప్ప నూర్చే నాటి కోసం గోతాలకు అతుకులు వేసి సిద్ధం చేశాడు.

సేద్యాన్ని, నేలను ఇన్నాళ్ళూ నమ్ముకున్నందుకు 'నూకాలమ్మ కడుపు సల్లగా' కష్టాలు గట్టెక్క బోతున్నాయనే ధైర్యం అతడిని ఉక్కిరి బిక్కిరి చేస్తుంది.

కడుపుకి సల్ల బిర్రుగా పట్టించి యెన్నెల్లో.... ఇంటిది కాపరానికి వస్తూ తెచ్చిన నులక మంచంపై నడుం వాల్చాడు 'ఎంకడు'.



అదిగో – "రాంబాబు సేనుకు ఓతుంటే, తాను ఎనకాలే బయలెల్లాడు. ఎందుకు మావా? నీకసలే మోకాళ్ళ నెప్పులు 'నర్సమ్మ' ఇచ్చిన బిళ్ళ లేసుకుని తొంగోక అన్నాడు అల్లుడు."

'ఆరుబయట వరకూ వచ్చిన 'వరం' బలవంతంగా అడ్డుపడింది. 'రాత్రి ఎంగిలి పడకుండానే పండినవు గదా? నీరసం వస్తాది – సద్దన్నం తాళింపు పెట్టినా, నిమ్మకాయ పిండాను సూడు... అబ్బ పులివోర లెక్కుంది' రా... అయ్యా! కాస్త తిను అంటూ బలవంతం చేసింది.

ఆహా "నా ఈడోడు లెక్కల పంతులు చివరి రోజుల్లో పడక కుర్చీలో కూర్చుంటున్నట్లు భలే భాగ్యం పట్టింది కదా!? మురిసి పోతున్నాడు ఎంకడు.

...

నిర్మలంగా ఉన్న ఆకాశం గంభీరంగా మారింది. రాక్షస గాలులు ఉధృతంగా చెలరేగడంతో ఎంకడు ఉలిక్కిపడి నిద్రలేచాడు. పక్క గుడ్డ భుజాన వేసుకుని మంచాన్ని గదిలోకి మార్చాడు.

'గాలి గుడిసెను ఊపేస్తుంది. దీపం వెలుగులో పూర్ణ యవ్వనురాలైన 'వరం' ముద్ద బంతిలా వెలిగిపోతుంది. కూతురు ముఖాన్ని చూస్తూ కళ్ళు మూసుకున్నాడు ఎంకడు.

కొద్దిసేపటికే ఈదురుగాలికి తోడు చినుకులు మొదలైన శబ్దం. ఎంకడు నిద్రపోకుండా అటూ ఇటూ మెసులుతున్నాడు. జోరు వాన, హోరు గాలి చీకట్లో చెలరేగిపోతున్నాయి. గదిలో దీపం ఆరిపోయింది. నాలుగు కళ్ళు ఒకేసారి చీకట్లోకి చూశాయి.

...

జాము రాత్రి ఉందనగానే లేసి సన్నని సినుకుల్లో మాగాణి దారి పట్టాడు ఎంకడు. భుజం మీది పై పంచ గాలికి ఎగురుతుంటే ఓ సేత్తో దాన్ని పట్టుకుని, పెద్ద పెద్ద అంగలు వేస్తూ కారు సీకట్లు కరిగి తూరుపు తెలవారుతుండగా సేనుకు చేరుకున్నాడు.

"కాళ్ళలో గుచ్చుకున్న పల్లేరు కాయని సేత్తో తీసి విసిరి కొట్టాడు. సన్నటి బాధ ఉదరం నుంచి గుండె దాకా పాకుతుంటే భరిస్తూ గనేలకు గండి కొట్టాడు. ఈదురుగాలికి సేను తల నేల వాల్చింది. కంకులన్నీ నీళ్ళలో నానుతున్నాయి.

'నూకాలమ్మా? నీకు మరో బస్తా ఒడ్లు కొలుస్తానమ్మా? తప్పులన్నీ కాసి, దయా సూపమ్మా!? అంటూ ఎంకడు గ్రామ దేవతను మనసులోనే తలుచుకున్నాడు.'

బీదల తల్లి, ఇన్నదో లేదో కాని కొద్ది సేపటికే ప్రచండమైన గాలి, హోరున మళ్ళీ వాన మొదలైంది. రెండు – మూడు – నాలుగు రోజులు రేడియో పెట్టెలో 'జల్ తుఫాన్' అని సెప్పారు. పంట పోయినోళ్లకి ప్రభుత్వం రెండేలు ఇత్తదన్నారు.

వాకిట్లోనే నులక మంచం మీద ముడుచుకు కూర్చున్న ఎంకడు వీధిలోకి చూస్తున్నాడు.

'రాంబాబు' చేతిలో కొడవలి పట్టుకుని పొలానికి బయలుదేరాడు. గాబు కాడ 'వరం' ఇటిక పొడితో 'చట్టి', సత్తు గిన్నెలు, కంచాలు తోవుతుంది.

మంచంపైకి వాలుతూ ఇద్దర్నీ మార్చి, మార్చి చూస్తూ... ఎంకడు రెప్పలు వాల్చాడు.

"పొలానికి బయలుదేరిన ఎంకడ్ని అల్లుడు వద్దని వారిస్తున్నాడు. పులివోర తినమని 'వరం' బలవంతం చేస్తుంది!?"

"తాటిచెట్లు, 'పందిరి ఆకులతో' కళకళ లాడుతున్నాయి. మంగళతోరణాలుగా మారేందుకు మామిడి ఆకులు ఎదురు చూస్తున్నాయి."

రాంబాబు వీధి మలుపు తిరిగాడు. మసి చేతులు కడుక్కుని వరం గిన్నెలు లోపలికి తీసుకువెళ్ళింది.

ఎంకడి ఇంటిముందు పాత పందిరి 'కర్రలు' స్మశానం కట్టెలయ్యాయి.

●

# మధుర వీచికలు



- వంగర పరమేశ్వరరావు

పడమటింట
చీకటి పొద్దు
ఒడిలో
సూరీడు
నిదురోతున్న వేళ -
జ్ఞాపకాల వాహినిలో
తడిసి ముద్దవుతూ
నాలో
నేనై
జీవనదిలా
ప్రవహిస్తూ -
నాకై
నేను
సంజీవినీ
స్మృతివీచికా గాథలను
తలపోస్తూ -

. . .

గోరుముద్దల
ప్రేమాప్యాయతలు
సాఫల్య బంధ వీక్షణాలై
మధుర రుచుల
సాకార స్వరూపాలై
నోరూరిస్తూ -
నా ఉనికికి ఊపిరిలూది
నా శ్వాసనాడుల్లో
ప్రాణ వాయువు తంత్రులై
సాక్షీభూత స్వరూప పథాన విస్తరిస్తూ
నా క్షేమమే
తన క్షేమంగా
త్యాగ సుధలను వర్షించిన
అమృత నయనాల
అనురాగ దృక్కుల ఓదార్పులు
ఇంకా.....
నన్ను వొళ్ళంతా తడుముతూ
పరామర్శల కుశరాలు
అడుగుతూనే వున్నాయి!

. . .

రసరమ్య లోకాల
జోలపాటల
మంద్రస్వర గాత్ర మాధుర్యాన్ని
వీనులవిందుగా ఆస్వాదింపజేస్తూ
సుతిమెత్తంగా హృదయ లోగిళ్ళను
స్పర్శిస్తూ........
పరవశింపజేస్తూ....
లాలిత్య లాలింపుల ఊయలలో
పవ్వళింపజేసి..... సేదతీర్చుతూ-
ఇంకా .. ఆ ఘడియలు
స్వర్గధామాన్ని తలపిస్తూనే వున్నాయి!

. . .

జ్వర తీవ్రతతో తల్లడిల్లిన
దుర్భర క్షణాల్లో
విషణ్ణ వదనాల
స్నేహ కరచాలనాలు కలతచెంది
కనుకొలకుల్లో
కొండంత అభిమానాన్ని గూడు కట్టుకొని
తీవెలై సాగిన
ఆపన్న హస్తాల
నిష్కల్మష స్నేహ రాజ్య సదనానికి
ఇంకా.... సాదరంగా ఆహ్వానిస్తూ
స్వాగత గీతాలు ఆలపిస్తూనే వున్నాయి!

. . .

అక్షరాల అల్లికల్లో
బంగరు భవితకు బాటలే వేసుకుంటూ
వక్రించిన బ్రతుకు రేఖను
భాగ్యరేఖగా మలుస్తూ
బడి గంటల నాదాల్లో
నినదించిన
గురువుల
వాత్సల్య బోధనా సూత్రాలు
ఇంకా....జ్ఞానభిక్షను ప్రసాదిస్తూ
నన్ను వెన్నుతడుతూ
అడుగులో అడుగై నడిపిస్తూ
ఆశీర్వచనాల
ఆశీస్సులందిస్తూ
శుభసూచిక
స్వస్తి మంత్ర బీజాక్షరాలను ధ్వనిస్తూ
అఖండ కీర్తి చంద్రికా యశస్సుకు
నిత్య నీరాజనాలు అర్పిస్తూనే వున్నాయి!

. . .

నట్టింట్లోకి నడిచొచ్చిన
నిలువెత్తు సంపదలు
పసిడి సిరుల కాంతుల్ని కురిపిస్తోన్నా....
బాల్య స్మృతులు
బంగరు కోట భాగ్య సముదాయాలై
విస్తరిస్తూ
విలువల తూకపు సూచీలో
అమూల్య బరువు తూగుతూ
ధగద్ధాయమాన శోభిత సంద్రమై
అనురాగ సామ్రాజ్య సంరంభానికి
ప్రాణ ప్రతిష్ఠ చేస్తూనే వున్నాయి!

---

# నువు నమ్ము.. నమ్మకపో!

- భూషి కృష్ణదాసు

నువు నమ్ము నమ్మకు
వీళ్ళంతా వొకప్పుడు
గాడిదల్ని కాసిన వాళ్ళే
బేవార్సుగ వీధులమ్మట తిరిగి
అమాయకుల నెత్తిమీద చెయ్యి పెట్టి
అంతో ఇంతో సంపాదించి
వాడికో వీడికో దళారి పనులు
చేసి పెట్టి రాత్రికి పిల్లనో
బుడ్డినో ఏర్పాటు చేసి
పెద్దోళ్ళ కాళ్ళు పిసికి



మూతులు తుడిచి
ఈ రోజు చూడు
ఎలా వెలిగి పోతున్నారో
రాత్రికి రాత్రే దొంగచాటుగ
మొలుచుకొచ్చిన దేవుడి విగ్రహాల్లా
ఇప్పుడు
వాడో కాంటాక్టర్
వీడో లిక్కర్ వ్యాపారి
ఊర్లో ఏ పని కావాలన్నా
వీళ్ళ పలుకుబడి లేకుండా
దేవుడు కూడా నోరు మెదపడు
చచ్చిన శవం కూడ పైకి లేవదు
రాజకీయ నాయకుల దగ్గర
బడా మోతుబరుల దగ్గర
వీడి మాటంటే
వెండి రూపాయి

# తెలుగు - బంజారా భాషలలో ఆదాన ప్రదానాలు



- కె. భాను నాయక్

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వివిధ గిరిజన తెగల ప్రజలు నివసిస్తున్నారు. ప్రభుత్వం గుర్తించిన 35 షెడ్యూల్డ్ తెగలలో 'బంజారా' లేక 'సుగాలీలు' లేక 'లంబాడీలు' ఒకరు. బంజారాలు విభిన్న సంస్కృతి, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలతో రాష్ట్రవ్యాప్తంగా నివసిస్తున్నారు. ఆదిమ జాతులలో విశిష్టమైన సంస్కృతి కలిగిన తెగ 'బంజారా తెగ'. వీరు దాదాపు భారతదేశంలో ప్రతి రాష్ట్రంలో నివసిస్తున్నారు.

"భారతదేశంలోని బంజారాలను 'గోర్' లేదా 'గోర్ బంజారా' అని అంటారు. 'గోర్' లేదా 'గోర్యా' అనే పదాలు 'గవార్' అనే హిందీ పదం నుండి పరిణామం చెందినట్లు చరిత్రకారుల అభిప్రాయం. హిందీలో 'గవార్' అంటే 'గ్రామ గ్రామాలు తిరిగేవారని' అర్థం. గో సంరక్షణ చేసేవారు. కావున బంజారాలను 'గోర్ బంజారా'అని పిలుస్తున్నట్లు కూడా భావనలున్నాయి. బంజారాలకు గోవులతో అనుబంధం చాలా కాలం నుండి ఉంది. గోవుల మూపులపై ఉప్పు, సుగంధ ద్రవ్యాలు, ఇతర వస్తువులు రవాణా చేసేవారు కనుక 'గోర్ బంజారా' అని పేరు వచ్చినట్లు చరిత్రకారుల అభిప్రాయం." **(డా॥ సూర్యా ధనుంజయ్ 2005.06).**

బంజారా జాతి సంచార తెగ కావడం వల్ల వారికి సంబంధించిన చారిత్రక విశేషాలను తెలుసుకునే అవకాశం చాలా తక్కువ. బంజారా తెగలో ప్రధానంగా 'నాలుగు' గోత్రాలు ఉన్నాయి.

అవి (1) చవాణ్ (చౌహాన్), (2) రాథోడ్ (3) పమార్ (4) వడ్త్యా మొదలైనవి.

ఈ ప్రధాన గోత్రాలలో కొన్ని ఉపగోత్రాలు ఉన్నాయి. ఈ ఉపగోత్రాలు గోర్ బంజారాల మూల పురుషులవి.

భారతదేశంలోని బంజారాలను వివిధ ప్రాంతాలలో వివిధ పేర్లతో పిలుస్తున్నారు బంజారాలను..

| | | |
|---|---|---|
| పంజాబ్ | - | సిరికివాలా |
| రాజస్థాన్ | - | గవారియా లేదా గమాలియా |
| కర్ణాటక్ | - | లమాన లేదా లంబాణి లేదా లమాణి |
| మహారాష్ట్ర | - | కంగసీయా లేదా సింగాడీ బంజారా |
| కేరళ | - | గహోర్ లేదా గౌరియా |
| మిగతా రాష్ట్రాలలో | - | బంజారా, బంజర, వనజార, బ్రంజార, బ్రజ్వాసి, లభాన్, లభాన, బళదియా, లదనియా మొదలైన పేర్లతో పిలుస్తారు. |

ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణా ప్రాంతాలలో
- లంబాడీ, లంబాడా అని పిలుస్తారు.

కోస్తా మరియు రాయలసీమలో – సుగాలీ అనే పేర్లతో పిలుస్తారు.

### బంజారా భాషపై తెలుగు భాష ప్రభావం

బంజారాలు చాలా సంవత్సరాల కిందట ఆంధ్రప్రదేశ్‌కు వలస వచ్చి అక్కడే స్థిరపడిపోయారు. వీరు తమ అవసరాలు, విద్యా బోధనలు, ప్రభుత్వం కల్పిస్తున్న సదుపాయాలను పొందడం కోసం 'తెలుగు భాష'ను తప్పని సరిగా నేర్చుకోవలసిన అవసరం వచ్చింది. దీనివలన గోర్ బోలి భాష మాట్లాడే బంజారాలపై 'తెలుగు భాష ప్రభావం' పడింది. బంజారాలు బయటివారితో మాట్లాడుతున్నప్పుడు వారికి తెలియకుండానే 'తెలుగు పదాలు' ప్రవేశిస్తాయి. బంజారాలు ఇప్పటికి తమ ఇళ్ళలోను, వారి బంధువుల తోను మాట్లాడుతున్నప్పుడు వారి స్వంత భాష అయిన 'గోర్ బోలి'తో పాటు 'తెలుగు పదాలతో' కలిపి మాట్లాడతారు. కొన్ని తెలుగు పర్యాయ పదాలు, మరికొన్ని 'గోర్ బోలి' భాష పదాలుగా స్థిరపడిపోయాయని గోర్ బంజారాలు కూడా గుర్తించ లేని స్థాయిలో తెలుగు భాష ప్రభావం ఉన్నదని తెలుస్తోంది. అందుకు కారణం 'గోర్ బోలి' భాష లిపి లేకపోవడం.

బంజారా భాష మౌఖిక సాహిత్యపరంగా ఆలోచిస్తే బంజారాలు శతాబ్దాల కాలం నుంచి తెలుగు వారితో సాంఘిక పరమైన సంబంధాలు కలిగి వున్నారు. తెలుగు ప్రజలు వాడే వస్తువుల పేర్లు గాని, ఇతరముల పేర్లు గాని, బంజారాలు తమలో తామే మాట్లాడుకుంటున్నప్పుడు అనుకోకుండా తెలుగులో ఉన్న పేర్లనే వాడుతున్నారు.

ఏ సాహిత్యమైనా పరిశీలించి చూసినట్లయితే ఇంకొక సాహిత్యముతో ప్రత్యేక సంబంధం కలిగి వుంటుంది. అలాగే బంజారాల సంస్కృతి, భాష, ఆచార సంప్రదాయాలు, బంజారాల ప్రజల మీద మొదలగు వాటిపై తెలుగు భాష ప్రభావం ఉంది. కనుక తెలుగు వారి భాష, సంస్కృతి, సాహిత్యాల ప్రభావం ప్రత్యక్షంగా కన్పిస్తుంది.

**ఆదానం రూపాలు :**

ఒక భాషలోని పదాలు, పద నిర్మాణాలు ఇంకొక భాషలోనికి ఎరువు తెచ్చుకోవడాన్నే 'ఆదానం' అంటారు.

తెలుగు భాష పదాలు బంజారా భాషలో ప్రవేశించడం వల్ల ఆ భాషలోని ధ్వని నిర్మాణం, పద నిర్మాణం, వాక్య నిర్మాణాలలో మార్పులు కలుగుతున్నాయి. కొత్త రకం పద బంధాలు కూడా ఏర్పడతాయి. బంజారాలు తెలుగు భాష మాట్లాడే వారితో సత్సంబంధాలు కొనసాగించడం వలన బంజారా భాషలో తెలుగు భాష పదాలు 'ఆదాన రూపంలో' చేరినాయి.

**బంజారా భాషలోకి వచ్చిన తెలుగు భాష పదాలు :**

| తెలుగు | - | బంజారా |
|---|---|---|
| చదువు | - | సదవ్ |
| రాత్రి | - | రాత్ |
| బురద | - | బురద, బుర్ద |
| జనం | - | జనం, మన్క్య |
| జాగ్రత్త | - | జాగ్రత్త |
| వారం | - | వారం |
| ఇసుక | - | ఇసక |
| పైసలు | - | పీసా |
| రూపాయలు | - | రపీయా |
| లుంగి | - | లుంగి |
| దీపం | - | దీయో |
| మేస్త్రీ | - | మేస్త్రీ |
| గోరింటాకు | - | గొర్లఫెంటు (మేదిపిట్టి) |
| గెలిచాను | - | గెల్చగో |
| మార్కులు | - | మార్కులు |
| సుఖంగా | - | సుఖంగా |
| కష్టంగా | - | కష్టంగా |
| ఇటిక | - | ఇటుక |
| బట్టతల | - | బట్టతల |
| మూత | - | మూత (తప్కు) |
| పువ్వులు | - | పూళ్.....మొదలగునవి |

**పదాదిలో తెలుగు పదాలు, పదాంతంలో బంజారా భాష పదాలు :**

| తెలుగు | - | బంజారా |
|---|---|---|
| ముగ్గువేయు | - | ముగ్గు నాక్ |
| ఉద్క పోస్తున్నది | - | ఉద్కపోస్రోచ (ఉక్లామార్కోచ) |
| గంట అయినది | - | ఘంట వేగో |
| ఉద్యోగం వస్తుంది | - | ఉద్యోగం అవఛ (నౌకరి ఆవచ) |
| కీడు చేయకు... మొదలగునవి | - | కీడ్ మత్ కర్ |

**పదాదిలో బంజారా భాష పదాలు, పదాంతంలో తెలుగు భాష పదాలు**

| బంజారా | - | తెలుగు |
|---|---|---|
| జీవెను వేడి | - | శరీరంలో వేడి |
| హత్తెరో కడియం | - | చేతిలో కడియం |
| తెళేర్ భట్టి | - | నూనె భట్టి |
| ఆంత్రే పోట్టి (ఆంతర్ పొట్టి) | - | పొట్ట పెగులు |
| దాడి గీసాయో (దాడీ కరాయో) | - | గడ్డం తీయించుకొనుట... మొదలగునవి |

**పదాదిలో బంజారా భాష పదాలు, పద మధ్యంలో తెలుగు భాష పదాలు :**

| బంజారా | - | తెలుగు |
|---|---|---|
| అపకాణ్ <u>పాంట</u> ఛేని | - | ఈ సంవత్సరం పంటలు లేవు |
| మ నవ్ <u>బట్టల్</u> సిడాయో | - | నేను కొత్త బట్టలు కుట్టించాను |
| ఘరేమ <u>జనం</u> పుల్లురా ఛ | - | ఇంటి నిండా జనమున్నారు |
| మనిక్యపర <u>నమ్మకం</u> ఛేని | - | మనిషి మీద నమ్మకం లేదు |

హైదరాబాద్ మా <u>సదవ్రాచ</u> ఉ ఆద్మి

– హైదరాబాద్‌లో చదువు కుంటున్నాడు ఆ మనిషి.

వరగాళ్ <u>పెండ్లి</u> వేగి

– గత సంవత్సరం పెండ్లి అయినది మొదలగునవి.

**(తిరుపతి, భూక్యా. 2005 : 37)**

రెండు లేక అంతకన్నా ఎక్కువ భాషలు ఒకే వ్యక్తి మాట్లాడేటప్పుడు ఒక భాష లక్షణాలు మరొక భాషకు సంక్రమించడం సహజం.

**(1) వ్యవసాయ పదాలు :**

| తెలుగు | - | బంజారా |
|---|---|---|
| పంట | - | పంట |
| పలుకు | - | పలుకు (పల్లు) |
| బండి | - | బండి |
| కాలువ | - | కాలువ |
| నాగలి | - | నాగలి |

**(2) కూరగాయలు, పండ్లు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| ద్రాక్ష | – | ద్రాక్ష |
| బెండకాయ | – | భీండా |
| కొత్తిమెర | – | కొత్తిమెర |
| సొంటి | – | సొంటి |
| ఆలుగడ్డ | – | ఆలుగడ్డ |
| ఆవాలు | – | ఆవాలు |
| గసగసాలు | – | గసగసాలు |

**(3) విద్యాలయాలకు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| పరీక్ష | – | పరీక్ష |
| బల్పం | – | బల్పం |
| పాటము | – | పాటమ్ |
| పలుక | – | పలుక (పల్క) |
| పంతులు | – | పంతుల్ |
| కుర్చీ | – | కుర్చీ (ఖుర్చీ) |

**(4) గృహ నిర్మాణానికి సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| వాకిలి | – | వాకిలి |
| కిటికి | – | కిట్కి |
| తలుపు | – | తలుపు (తలప్) |
| దూలం | – | దూలం |
| గది | – | అర్ర |
| తాలం | – | తాలం |
| బొంగు | – | బొంగు |
| గోడ | – | గోడ |
| ఇటుక | – | ఇటిక (ఇట్క) |
| ఇసుక | – | ఉసిక (ఉస్క) |

**(5) జంతువులకు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| గొర్రె | – | గోర్లి |
| ఏనుగు | – | ఏనుగు / హాత్తి |
| ఒంటి | – | ఒంటి |
| కొంగ | – | కొంగ |
| బల్లి | – | బల్లి / ఛఫ్టి |
| ముంగిస | – | ముంగిస |
| చిలుక | – | చిలుక |

**(6) దేవాలయాలకు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| గుడి | – | గుడి |
| పూజ | – | పూజ |
| నైవేద్యం | – | నైవేద్యం (నేవద్) |
| పూజారి | – | పూజరి |

**(7) పండుగలకు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| దసరా | – | దసరా |
| దీపావళి | – | దీపావళి |
| సంక్రాంతి | – | సంక్రాంతి |
| హోళి | – | హోళి |
| శ్రీరామనవమి | – | శ్రీరామనవమి |
| శివరాత్రి | – | శివరాత్రి |
| వినాయకచవితి | – | వినాయకచవితి |
| | | ... మొదలగునవి |

**(8) మనస్సుకు సంబంధించిన పదాలు :**

| తెలుగు | – | బంజారా |
|---|---|---|
| ఆలోచన | – | ఆలోచన |
| ధైర్యము | – | ధైర్యం |
| తెలివి | – | తెలివి |
| బుద్ధి | – | బుద్ధి |
| బాధ | – | బాదా |
| ప్రేమ | – | ప్రేమ |
| దయ | – | దయ |
| అవమానము | – | అవమానం....మొదలైనవి |

'గోర్ బోలి స్పష్టంగా హిందీ, రాజస్థానీలకు సంబంధించిన ఒక చారిత్రక మాండలికం. అందులో గుజరాతి, పంజాబి లక్షణాలు కూడా కొన్ని ఉన్నాయి. క్రీ.శ. 10, 11 శతాబ్దాలలో ఈ భాషలు ఎలా ఉండేవో వాటి సగటు దూరం గోర్‌బోలిలో మిగిలి ఉంది."

(గోనా నాయక్, ఎం. 2005 : 20)

పైన పేర్కొన్న అభిప్రాయాన్ని పరిశీలించినట్లయితే 'ఉత్తర భారతదేశపు భాషలైన – హిందీ, రాజస్థానీ, పంజాబీ, గుజరాతీ, మరాఠీ భాషలకు 'బంజారా భాష అయిన 'గోర్ బోలి'కి సంబంధాలు ఉన్నాయని స్పష్టం అవుతుంది. ఈ భాషలు "ఇండో – ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినవి కావడం వలన, బంజారా భాష ఈ కుటుంబానికే చెంది ఉంటుంది.'

బంజారా భాష ఇండో–ఆర్యన్ భాషా కుటుంబానికి చెందినప్పటికీ ప్రత్యేకంగా 'లిపి' లేకపోవడం అనేది ఆ జాతి పట్ల అగాధపు లోతుగా పరిణమించిందని చెప్పవచ్చు. వీరి జీవన విధానంలో భాగంగా ఆయా ప్రాంతాలతో సంబంధాల కొరకు కూడా ప్రాంతీయ భాష పరిచయం అనివార్యమైనదిగా కూడా చెప్పవచ్చు. 'బంజారాల విద్య, ఉద్యోగం, ఆర్థిక స్థితి లాంటి ప్రగతి అంశాలకు ప్రాంతీయ భాషపై ఆధారపడి జీవిస్తున్నాయి.

"తెలుగు ప్రాంతంలో లంబాడీ భాష గూర్చి పరిశోధన చేసిన వారిలో వి. హెచ్. బ్రహ్మానందం గారి పేరు ప్రముఖంగా వినిపిస్తోంది. ఈయన 1983 – 89 సంవత్సరములలో దాదాపు

# కోయిలమ్మ పదాలు

- ద్యావరి నరేందర్ రెడ్డి

స్వార్థ చింతన తప్పు
మదికి పట్టును తుప్పు
మంచి తలచితె మెప్పు
ఓ కోయిలమ్మా!

స్వర్గ సుఖము కన్నా
కోటి వరముల కన్నా
అమ్మ ఒడియే మిన్న
ఓ కోయిలమ్మా!

సఖియ ఎర్రని బుగ్గ
లేత రోజా మొగ్గ
ముద్దు పెడితే సిగ్గు
ఓ కోయిలమ్మా!

సరస మెరుగని మొద్దు
ఆలికతడే ఎద్దు
ఎట్ల పోవును పొద్దు
ఓ కోయిలమ్మా!

మందు బాబుకు బుద్ధి
కల్లుపోతుకు మడ్డి
అప్పులోడికి వడ్డి
ఓ కోయిలమ్మా!



పొట్టి చొక్కా నాడు
ఫ్యాషనయ్యెను నేడు
వింత పోకడ చూడు
ఓ కోయిలమ్మా!

ఆడి తప్పిన మాట
శృతిని తప్పిన పాట
మెచ్చరెవ్వరు నోట
ఓ కోయిలమ్మా!

శాంతి విరిసెడి చోటు
ప్రేమసిరులకు చోటు
నేను వేసెద ఓటు
ఓ కోయిలమ్మా!

పక్క ఇంటిలో గుమ్మ
సొగసు కాంతుల బొమ్మ
గాలికి సురును చుమ్మ
ఓ కోయిలమ్మా!

---

17 రాష్ట్రాల్లో విషయాన్ని సేకరించి భారతదేశమంతటా 'గోర్‌బోలి'లో సమానతలు ఉన్నాయనీ, చారిత్రకంగా పరిశీలిస్తే 11, 12 శతాబ్దాల నాటి పశ్చిమ హిందీ స్వరూపమే మౌలికంగా గోర్‌బోలి స్వరూపమని యు.జి.సి. పరిశోధన పథకం నివేదికలో స్పష్టం చేశారు.

**(వన్నె గోపాల్, 2010 : 72)**

వి. హెచ్. బ్రహ్మానందంగారు, 'ఎ గ్రామర్ ఆఫ్ సుగాలీ లాంగ్వేజ్' అనే గ్రంథం రాశారు.

**ప్రధాన రూపాలు :**

ఒక భాషలోని పదాలు, నిర్మాణాలు, పద వాక్యాలు ఇంకొక భాషలోకి వెళ్ళడాన్ని 'ప్రదానం' అంటారు.

ఇండో - ఆర్యన్ భాషా కుటుంబానికి చెందిన 'బంజారా' భాష హిందీ, పంజాబి, ఉర్దూ, గుజరాతి, మరాఠి మొదలైన భాష పదాలకు 'బంజారా భాష పదాలు' కొన్నింటికి సన్నిహిత సంబంధాలు ఉన్నట్లు భాషా పరిశోధకులు గుర్తించారు.

| బంజారా | హిందీ | తెలుగు |
|---|---|---|
| ఘర్ | ఘర్ | ఇల్లు |
| ఘూంగ్‌టో | ఘూంఘట్ | తల ముసుగు |
| పాణి | పాని | నీరు |
| మాండ్ | మాండ్ | గంజి |
| దూద్ | దూద్ | పాలు |
| థాలి | థాలీ | పళ్ళెం |
| మర్చ | మిర్చ్ | మిరపకాయ |
| సక్కర్ | సక్కర్ | పంచదార |
| మూంగ్ | మూంగ్ | పెసలు |
| కాకడి | కకడి | దోసకాయ |
| చావళ్ | చావళ్ | బియ్యం |
| ధోతి | ధోతి | ధోవతి |
| ఊద్ | ఊద్ | సాంబ్రాణీ |
| దియో | దియో | దీపం |
| కరేలా | కరెలా | కాకరకాయ |
| హళద్ | హల్దీ | పసుపు |

... మొదలైనవి

ఆంధ్రప్రదేశ్‌లోని బంజారాలు మాట్లాడే భాష అయిన 'గోర్‌బోలి' వ్యవహర్త ఈనాడు తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీష్ పదాలు కలిపి సందర్భానుసారంగా మాట్లాడుతున్నాడు. అదేవిధంగా బంజారాలు ఆంధ్రప్రదేశ్ సరిహద్దు జిల్లాలోనూ నివసిస్తున్నారు. సరిహద్దు జిల్లాలలో ప్రక్క రాష్ట్రాల భాషా ప్రభావం కూడా కన్పిస్తుంది. ఆదిలాబాద్ జిల్లాలో బంజారాలపై 'మరాఠీ' భాష ప్రభావం కన్పిస్తుంది. అంతేకాకుండా నెల్లూరు జిల్లాలో బంజారాలపై 'తమిళం' భాష పదాలు, అనంతపురం జిల్లాలో బంజారాలపై 'కన్నడ' భాష ప్రభావం కన్పిస్తుంది. ఇన్ని విధాలా ప్రభావం ఉన్నప్పటికీ బంజారాల భాష మౌఖికపరంగా జన వ్యవహారంలో మాత్రం ఇంకా మిగిలే ఉంది.

•



# నాన్న

- కె.మురళీ మోహన్ రాజు

సంతతి పురోగతికై
తాను సతమత మౌతున్నా
తదేక దీక్షతో రాత్రింబవళ్ళు పరిశ్రమించే
మహోన్నత హిమవన్నగ శిఖరం నాన్న!
బుడిబుడి నడకల్తో వడివడి మాటల్తో
మిడిమిడి జ్ఞానంతో
మిడిసి పడుతున్న సంతతికి
వ్రేలు పట్టి నడిపిస్తూ
పొల్లు పలుకులు సవరిస్తూ
లౌకిక జ్ఞానాన్ని పెంపొందిస్తూ
వక్రమార్గం పడకుండా
వడిదుడుకులు రాకుండా
పాలించి పోషించేవాడు నాన్న!
పిల్లల ఇష్టాలకు కరిగి నీరై
హిమోన్నత మంచు శిఖరం
అన్నింటికీ తట్టుకొని ఆటుపోట్లకు
ఎదురొడ్డి నిలిచే మేరునగధీరుడే నాన్న

# ట్రాఫిక్ జామ్

- భమిడిపాటి గౌరీశంకర్



ఎక్కడ పడితే అక్కడ అలా....
క్రమశిక్షణ లేని విద్యార్థిలా...
జనం...జనం...
వాహనాల మధ్యలో .... వాహనాలలో...
కదలరే...?
అదిగో....అక్కడ...
ఓ జంటముఖంలో చిరాకు
ఇదిగో....ఇక్కడ...
ఓ ముసలాయన కళ్ళలో మారాకు
ఇదిగిదిగో ఇక్కడ...
ఓ గర్భిణి మోములో బాధాతప్త పరాకు
నిరుద్యోగి జీవితంతో ఆటలు
శవాలతో కూడా చెలగాటాలు
మతాలతో...మాలిమి లేదు
కులాలలో కలిమి లేదు
జాతి....మత..వర్గ బేధం అసలే లేదు
కాని....
ప్రజా ప్రతినిధులన్నా...విఐపిలన్నా
వివిఐపిలన్నా...అందరి కన్నా మిన్న
ప్రజలకోసమే వారున్నా
ప్రజలను కాదని...కాలదన్ని...మరీ పోతున్నా
ప్రజాస్వామ్యాన్ని అవహేళన చేస్తున్నా...
మైకులు విరగ్గొట్టినా ...
ఆదమరచి నిద్ర పోతున్నా...
వారికి దారి వదలవలసిందే....
చట్టం చట్ట బండలవుతున్నా
ప్రజల కన్నా వీరు ఎక్కువ సమానం...
వారికి రూల్స్ లేవు...
ట్రాఫిక్ జామ్‌లసలే లేవు...
నిజమైన ట్రాఫిక్‌జామ్
మధ్యతరగతి జీవితమ్
నిరంతర వ్యధాపూరిత భరితమ్
ఏది ఆశాజనక భవితవ్యం...!

# ముఠా కక్షలు - మహిళా చైతన్యం

- ఆచార్య మూలె విజయలక్ష్మి



భర్త ఖూనీ అయినా, ఖూనీ చేసి జైలుకెళ్లినా భార్య జీవితం దుర్భరమే. భర్త మరణం కల్గించే మనోవేదన, కుటుంబ బాధ్యతలు, పార్టీని కొనసాగించి, ప్రత్యర్థివర్గాన్ని ముప్పుతిప్పలు పెట్టే బాధ్యత ముప్పేటగా చుట్టుకుంటాయి. ఎదురు వర్గాన్ని మట్టికరిపించి కేసులో ఇరుక్కుని జైల్లోపడితే కుటుంబ భారంతోపాటు, కోర్టు వ్యవహారాలకయ్యే ఖర్చులు సమకూర్చి తన కుటుంబ సభ్యులతోనో, రక్తసంబంధీకులతోనో, తమ వర్గం వారితోనో కేసు వ్యవహారాలు నడిపించి, కేసు కొట్టివేయించుకోవాలి. కిందపడినా, మీదపడినా, చచ్చి దుగ్గుడయ్యేది రెండు వర్గాల్లో స్త్రీలే.

రాయలసీమలో కడప జిల్లా ముఠాకక్షలకు పెట్టింది పేరుగా స్థిరపడింది. స్వల్పకారణాలతో మొదలైనగొడవలు, తరాలు మారినా తరగని పగలతో, పౌరుషాలతో మీసాలు మెలితిప్పడమే పరువుప్రతిష్టలుగా భావించే సంస్కృతి. ఇరుకుటుంబాల మధ్యనో, ఇరు అగ్రవర్ణాల మధ్యనో రగిలిన చిచ్చు చిలికి చిలికి గాలివానై రావణకాష్టంగా మారుతుంది. పల్లెమొత్తం రెండు నాయకులు యారముట్లు సమకూర్చుకుంటారు. యారముట్లంటే ఈటెలు, గండ్రగొడ్డళ్లు, బాంబులు, తుపాకీలు వగైరా. వీటన్నిటితోపాటు అనుచరగణం. చిన్న సైన్యం. వారి పోషణ వీరి మీదే. దొమ్మీలు, హత్యలు, పోట్లు, చొప్పవాముల దహనం, ఇళ్లు తగలబెట్టుకోవడం, పచ్చనితోటలు అడ్డంగా నరుక్కోవడమేపని. పని పాటలు గాలికొదిలేసి ఎదుటిపార్టీని ఎలా దెబ్బతీయాలని నిరంతరం మంత్రాంగాలు నడుపుతూ, పన్నాగాలు పన్నే పనిలో పడిపోతారు. బదులుకుబదులు. తలకుతలబలి. తోటకుతోటకో బలి. వామికి వామి పరశురామప్రీతి. అదోమైకం. పార్టీనడపడమంటే అంతే. అలాంటి గ్రామం పార్టీలకొంప. కష్టం నష్టం ముఠానాయకులమీదే. గొడవలు చెలరేగినప్పుడు అనుచరులు బాధితులే.

నలభై యాభై ఏళ్ల కిందటి పరిస్థితులతో పోలిస్తే పల్లెల్లో ముఠాకక్షలు లేదా పార్టీలు సద్దుమణిగాయి. పాతకక్షలు పైకిలేచి అరుదుగా నయినా అక్కడక్కడ వేటకొడవళ్లతో తలలు నరుక్కునే సంస్కృతి పూర్తిగా సమసిపోలేదు. ఇలాంటి గ్రామాల్లో బడా రాజకీయనాయకుల పని సులభం. ఒక గుంపు రాజకీయ పార్టీకి మద్దతిస్తే, మరో గుంపు ఎదురు పార్టీ వాళ్లకు వంతపాడుతుంది. ఎలక్షన్ల కాలంలో గొడవలు పెచ్చుమీరతాయి. రాజకీయ నాయకుల అండా ఆపూ, ముట్టజెప్పిన డబ్బు మద్యం మత్తులో అనుచరగణం ప్రచ్ఛన్న యుద్ధాలు చేస్తారు. ప్రాణాలు సైతం లెక్కచేయకుండా రాళ్లు రువ్వుకోవడాలు, కత్తులతో పొడుచుకోవడాలు, చొక్కాలు చొక్కాలు పట్టుకోవడం ఇంకా.. మీరితే హత్యలు.. ఇంతగారచ్చలు, రాద్ధాంతాలు, రాపిళ్లున్నా స్త్రీల జోలికి, పిల్లల జోలికి పోనీ సంస్కృతి వుంది.

కానీ ఇతర జిల్లాలతో పోలిస్తే కుటుంబంలో పురుషాధిపత్యం అధిక మోతాదులో కరడుగట్టిన జిల్లా కడప జిల్లా. స్త్రీకి అస్తిత్వం లేదు. వండివార్చుడమూ, పిల్లల్ని కని సాకడం వరకే పరిమితం ఇతర విషయాల్లో జోక్యం చేసుకునే స్వేచ్ఛకానీ, మాటకు పైసా విలువ కానీ లేదు. నోరెత్తితే నోర్ముయ్యి అనడమే అక్కడి పురుషుడి నాగరికత సంస్కారం. భర్త మరణానంతరమే ఆమె ఉనికి తెలుస్తుంది. అదీ మగపిల్లలు పసివాళ్లయితేనే. పార్టీల కారణంగా మహిళలపై దాడులు, అత్యాచారాలు, ఆగడాలు లేకున్నా భర్తలో, కొడుకులో పార్టీల్లో తిరుగుతుంటే నలిగి వత్తలయ్యేది ఆడవాళ్లే. వాళ్లు దినదినగండంగా తిరుగాడుతుంటే అనుక్షణం నరకయాతన పడుతూ గడిపేది ఆడవాళ్లే. భర్త ఖూనీ అయినా, ఖూనీ చేసి జైలుకెళ్లినా భార్య జీవితం దుర్భరమే. భర్త మరణం కల్గించే మనోవేదన, కుటుంబ బాధ్యతలు, పార్టీని కొనసాగించి, ప్రత్యర్థివర్గాన్ని ముప్పుతిప్పలు పెట్టే బాధ్యత ముప్పేటగా చుట్టుకుంటాయి. ఎదురు వర్గాన్ని మట్టికరిపించి కేసులో ఇరుక్కుని జైల్లోపడితే కుటుంబ భారంతోపాటు, కోర్టు వ్యవహారాలకయ్యే ఖర్చులు సమకూర్చి తన కుటుంబ సభ్యులతోనో, రక్తసంబంధీకులతోనో, తమ వర్గం వారితోనో కేసు వ్యవహారాలు నడిపించి, కేసు కొట్టివేయించుకోవాలి. కిందపడినా, మీదపడినా, చచ్చి దుగ్గుడయ్యేది రెండు వర్గాల్లో స్త్రీలే. ఫలితంగా గొడ్డుగోదా, కొంపాగోడూ, భూమిపుత్ర, నగానట్రా హారతి కర్పూరమైతే, చితికిన సంసారాన్ని నెట్టుకురావడం గోరుచుట్టుపై రోకటిపోటు.

సామాజిక వాస్తవచిత్రణలో సాహిత్యం పాత్ర ఎన్నదగింది. రాయలసీమ కక్షలు కార్పణ్యాలు, వాటిమూలాలు, కారణాలు ప్రస్ఫుటం చేస్తూ సీమకక్షలు- కథల సంకలనం వెలువడింది. ఈ అంశాల పట్ల మహిళ మనోవైచిత్రిని తెల్పే కథలు వేళ్లమీద లెక్కించగలిగినన్ని మాత్రమే వచ్చాయి. సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి కొత్తదుప్పటి కథా సంకలనంలోని తడి, కొమ్ములు, వీరనారి ఈ కోణంలో వెలువడిన కథలు.

పుట్టెడు బాధను కడుపులో నింపుకొని ఇలాంటి సంక్లిష్టపరిస్థితులను ఎదుర్కోవాలంటే ఎంత ధైర్యం కావాలి. ఆ స్త్రీ జీవితంలో సుఖశాంతులు మచ్చుకైనా ఉంటాయా!

ముఠాకక్షల్లో పంతాలు పట్టింపులు, పగలుసెగలు రగులుతుంటే స్త్రీ కిమ్మిన్నాస్తిగా ఉండగలగు తుందా! పార్టీలు వద్దూపాడూ వద్దూ మొర్రో కొంపలు కూలిపోతున్నాయని జోక్యం చేసుకున్నా లెక్కించే నాధుడెవడు? 'నోర్మూయ్యి ఆడదాంటి కెందుకు అతి పెత్తనం' వంటి కరడుగట్టిన పితృస్వామ్య భావజాలం రాజ్యమేలుతున్న ప్రాంతం.

అంతవరకు భర్త చెప్పుచేతల్లో అణగిమణగి ఉన్న ఇల్లాలే భర్త హత్య చేయబడితే చంపినవాన్ని చంపించేదాకా గాజులు పగులగొట్టుకోను, బొట్టుచెరుపుకోను, తాళిబొట్టు తియ్యను అంటూ శపథం పట్టి ముత్తైదువుగా మనుగడ సాగిస్తూ కసిపెట్టుకుని కక్షసాధిస్తుంది. తనకు శక్తికి మించిన పనని భావించినప్పుడు, తన కొడుకులకు చిన్నప్పటినుంచీ పగ, కసి నూరిపోసి పంతాలు పెంచి, రోషం పోసి, పౌరుషం నింపి పెద్దవాళ్లయ్యాక, తన భర్తను చంపిన వ్యక్తిని వాళ్లచేత మట్టుబెట్టించి కానీ శాంతించదు. అలా చేయటం తన బాధ్యతగానూ, కుటుంబ పరువు ప్రతిష్టలు కాపాడడంగానూ భావిస్తుంది. సమాజం అలాంటి స్త్రీలను గౌరవిస్తుంది. బహుశా అందుకేనేమో స్త్రీ ఆ మార్గాన్ని ఎన్నుకుంటూ ఉండవచ్చు.

> ***"నన్ను కూకోబెట్టి సాకడానికే పొలాలమ్మిండంటా... నన్ను సాకడానికే పెద్దరెడ్డి పక్కజేరి పార్టీలో తలదూర్చిండేమో! సేద్దెం సాలిచ్చి మీసాల్దిప్పుకుంటా తిరిగిందీ నన్ను సాకడానికేనేమో! కట్టెబట్టిందీ, బాంబుల్జుట్టిందీ, బాకులు నూరిందీ, పోలీస్టేషన్ల జూసిందీ, కోర్టులకు పొయ్యొచ్చిందీ నన్ను కూకోబెట్టి సాకడానికేనేమో!" అని ఏడుపు గొంతుతో అన్నప్పుడు ఆమె జీవితంలో కడుపులో దాచుకున్న బాధ, దుఃఖం, ఆవేదన, ఆక్రోశం, ఆవేశం కట్టలు తెంచుకున్నట్లు స్పష్టమవుతుంది.***

భిన్నధృవాలుగా కన్పించే రెండు రకాల స్త్రీలు సమాజంలో కన్పిస్తారు. దుష్ట సంస్కృతి నుండి బయటపడాలనే శాంతికాముకత్వం కావచ్చు, కడగండ్లు భరించలేక కావచ్చు, విద్య ద్వారా లభించిన చైతన్యం కావచ్చు, మహిళలు తమ కుటుంబం కక్షలకు దూరంగా ఉండాలని కోరుకుంటున్నారు.

సామాజిక వాస్తవచిత్రణలో సాహిత్యం పాత్ర ఎన్నదగింది. రాయలసీమ కక్షలు కార్పణ్యాలు, వాటిమూలాలు, కారణాలు ప్రస్ఫుటం చేస్తూ సీమకక్షలు- కథల సంకలనం వెలువడింది. ఈ అంశాల పట్ల మహిళ మనోవైచిత్రిని తెల్పే కథలు వేళ్లమీద లెక్కించగలిగినన్ని మాత్రమే వచ్చాయి. సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి కొత్తదుప్పటి కథా సంకలనంలోని తడి, కొమ్ములు, వీరనారి ఈ కోణంలో వెలువడిన కథలు. రచయిత కడప జిల్లా వాసి, వాస్తవ సంఘటనలను తెలుసుకున్నారు. అక్కడి స్త్రీల స్థితిగతులను, అంతరంగాన్ని చక్కగా అంచనా వేయగలిగారు.

రాయలసీమలో కరువు కాటకాలు మానవసంబంధాలను, బంధుత్వాలనూ ఎలా ఛిద్రం చేస్తున్నాయో తెల్పుతుంది 'తడి' కథ. అన్నదమ్ముల మధ్య దెబ్బతిన్న అపేక్షలను, ఆప్యాయతలను కూడగట్టడానికి ఒక తల్లి పడిన ఆవేదనను ప్రతిఫలిస్తుందీ కథ.

ఆ గ్రామంలో కరువు. వాయురోగంకు తోడు దొబ్బుడుగాలి అన్నట్లు ఆరిపోని పగలు. సంవత్సరం కిందట వర్షంలేనప్పుడు వేరుశనగపైరుకు తడుపుకునే గుండం నీళ్ల దగ్గర మొదలయ్యాయి గొడవలు. అదీ అక్కచెల్లెళ్ల బిడ్డలు రంగన్న సుబ్బన్నల మధ్య. తలకాయలు పగులకొట్టుకున్నారు. ఇరువైపుల వాళ్లూ కేసులు పెట్టుకున్నారు. గాయాలు మానినా ద్వేషాలు తగ్గలేదు. కోర్టు ఖర్చులకు తమచేతి తడారిపోయినా కేసు వొగదెగలేదు. ఇరు కుటుంబాల ఆర్థిక స్థితి దిగజారింది. లాయరు ఫీజు కోసం తల్లి చెన్నమ్మ కడియాలడిగాడు సుబ్బన్న. మౌనం సమాధానమయ్యింది అర్ధరాత్రి అక్కింటికెళ్లి "ఈకడేలమ్మి లాయరుకిస్తే రంగన్నోల్లకు సిచ్చేయిస్చడంట. లాయరు జెప్పిండని మాసుబ్బిగాడన్నెడు. నా సేతి కడేలమ్మి ఏనా బట్టల బొక్కన్నో కొట్టి రంగన్నకు సెడ్డజేసేది నాకు నచ్చులే. ఆ కడేలు మీకిస్తే అసలు కేసే లేకుండా కొట్టేయించరా అని వచ్చినా. ఇద్దర్లో ఎవురికి సిచ్చెబడినా నేన్దట్టుకోలే నక్కా! ఎవురూ ఓడొద్దూ. ఎవరూ గెల్సొద్దూ. ఓడినా గెల్సినా పగలు కలకాలముంటయ్ ఈడికే సంసారాలు నాశినమైనయ్. అక్కా! నీకుదండంబెడ్తా. ఈ కడేల్దీసుకొని కేసు కొట్టేయించమను" అంది.

నీటి కరువు వల్ల ఆర్థిక సంబంధాలు రక్త సంబంధాలకు, మానవ సంబంధాలకు దెబ్బతగుల్తోంది. బాంధవ్యాలను కాపాడుకోవటం కోసం చెన్నమ్మ ఆరాటపడింది. అన్నదమ్ముల మధ్య తగనిపగలు, నానాటికి దిగజారుతున్న ఆర్థిక స్థితి కలిచివేసాయి. ఎవరికి శిక్షపడినా పగలు రాజుకుంటాయి. రాజీ అయితే.. ఆలోచించింది. సమస్యను లౌక్యంగా పరిష్కరించింది.

పార్టీ కార్యకలాపాల్లో తిరుగుతూ ఆస్తిపాస్తులు, పోగొట్టి కుటుంబ బాగోగులు పట్టించుకోని భర్తపైకి కొమ్ములు విసిరిన మగువ చైతన్య గాథ 'కొమ్ములు'. పార్టీ గొడవల వల్ల కేసులో ఇరుక్కున్నాడు రామిరెడ్డి. శిక్ష తప్పించుకోవాలంటే సాక్ష్యాన్ని తనవైపు తిప్పుకోవాలి. అందుకు డబ్బు అవసరం. అప్పటికే గొడవల్లో ఆస్థి హారతి కర్పూరమయింది. ఈనమోపిన బర్రెగొడ్డు అమ్మకం పెట్టాడు. ఈనితే రెండులీటర్ల పాలిస్తుంది. సంసారఖర్చులు ఎల్లుతాయి. అది లక్ష్మమ్మ లెక్కాచారం. బేరం ఎత్తగొట్టింది.

జంగిడికి వెళ్లినబర్రె రాత్రిరాలేదు. రాళ్లగుట్టదగ్గర ఈనింది. రాత్రంతా క్రూరమృగాల నుండి బిడ్డను కాపాడుకుంది. కొమ్ములే దాని ఆయుధం. కునుకుపట్టని లక్ష్మమ్మ వెతుక్కుంటూ వెళ్లింది. రాత్రంతా బర్రె దూడను కాపాడుకున్న తీరు ఆమెకు స్ఫూర్తిదాయకమయింది. బర్రెను దూడను ఇల్లు చేర్చింది. పెయ్యదూడను ఈనింది మరో అయిదొందలు ఎక్కువ పలుకుతుందని రామిరెడ్డి ఆశ. అదేమాటన్నాడు. అంతే లక్ష్మమ్మ గయ్‌మని లేచింది. "చిన్నచిన్న కయ్యలమ్మిండు. ఎకరాలకు ఎకరాలు అమ్మిండు. పుట్టింటోల్లు బెట్టిన నామెడలో బంగారు గూడా ఈని బొక్కన కొట్టుకున్నెడు.. ఈని పార్టీలకు ధూమొచ్చిపోనూ... ఈని మీసాలకు పేనుకొరుకుడు రానూ.. ఇప్పుడు పిల్లోల్ల నోటికాడి

చారెడు పాలుగూడా మట్టిగలపాలని సూస్తాండు- ఈని పౌర్సాలకు అగ్గిబడ. బరుగొడ్డును అమ్మి సాక్షాలను కొనకుంటే అవతలోల్ల కాల్లుబట్టుకుంటే రాజీపడరు! వాల్లేం పరాయోల్లా? అంది.

'నా ఇంట్లో ఉండి నా మీదికే తిరగబడ్తాండావా' అరిచాడు. తనను పొడవడానికి అతనికున్న ఆస్తిగుడిసె. 'ఇండ్లు.. ఇదొక ఇండ్లూ.. దీంట్లో సంసారమూ.. నువ్వే వుండు. దీన్ని గూడా అమ్ముకొని ఇంగొక కేసుకు దిరుగు. నాపిల్లోల్లూ నేనూ యాడన్నా సెట్టుకింద బతుకుతంలే..' అంటూ బైటకు నడిచింది. తనకూ ఉంది ఆధారం. అది పుట్టింటి వారిచ్చిన బర్రె. అవే ఆమెకున్న కొమ్ములు.

పార్టీ వల్ల చితికిన సంసారం ఇంకాహీన స్థాయికి దిగజారడం ఆ తల్లి మనసొప్పలేదు. పౌరుషాలకు పంతాలకు పోకుండా రాజీపడమంది. భర్తదారిని దుయ్యబట్టింది. పిల్లల బాధ్యత ప్రధానమనుకుంది. ఏతావాతా పార్టీల వల్ల కొంపలు గుల్లకావడం తప్ప ఒరిగేది, ఒనగూడేదేమీ లేదని గ్రహించి చైతన్యంతో ముందడుగు వేసింది.

మహిళ మనోభావాల్లో కొత్త కోణాన్ని, ఒక చైతన్యాన్ని ఆవిష్కరించిన సన్నపురెడ్డి మరో కథ వీరనారి. ముఠాకక్షల ఊబిలో చిక్కుకున్న భర్తను కాపాడుకోవడం కోసం పట్నం చేరింది ఈశ్వరమ్మ. ఆమె భర్త ఎన్నో ఖూనీలకు సూత్రధారి. బాంబులు చుట్టడంలో అందెవేసిన చెయ్యి. ఎలక్షన్లలో బ్యాలెట్ బాక్సులు ఎత్తుకొచ్చే ఘనుడు. పెద్దరెడ్డికి కుడిభుజం. అందుకే పట్నం వచ్చినా గాలిస్తున్నాడు రెడ్డి. అతన్ని చంపితే రెడ్డికుడి భుజం పడిపోయినట్లేనని ఎదుటి పార్టీ వాళ్లప్లాను.

మొగుడు వీధిలోకెళ్తే ఇంటికొచ్చేదాకా గుండెలు పీచుపీచుమంటాయి. ఓ రోజు బాంబుల శబ్దం. లోకులమాటలు బట్టి తన భర్తే అని ఊహించుకుంది. లబోదిబోమంటూ ఉరుకులు పరుగులు పెట్టింది. అదృష్టం ఆమె భర్త కాదు. ఊపిరిపీల్చుకొని ఇల్లు చేరుకుంది. తనలాగే ఆ వీధిలో మరో మహిళ గోడు గోడున ఏడుస్తూ పరుగులు పెట్టింది. తిరిగి వచ్చింది. బడికెళ్లిన బాబునులాక్కొచ్చింది. ఆటోలో సామాను వేసుకొని వెళ్లిపోయింది. లోకులు భర్తను చంపినవాళ్లపై కసి తీర్చుకోకుండా పారిపోయిన పిరికిపంద అన్నారు. తాళిబొట్టు తెంచకుండా తలకొరివి పెట్టించడానికి కొడుకు కూడా లేకుండా తీసుకొని వెళ్లి పుట్టింటికి, మెట్టింటికి చెడ్డపేరు తెచ్చిందన్నాడు మామ. ఇంటికి వచ్చిన భర్తకు జరిగిన విషయమంతా చెప్పింది ఈశ్వరమ్మ.

"పొరపాటున నాకేదన్నా జరిగితే నువ్వుగుడకా అట్లా పరిగెత్తేవు..." "నన్ను సంపినోన్ని సంపేదాకా తాళిబొట్టు తీయగాకు. సంపేదానికి నీకు సేతగాలేదనుకో- పిల్లోన్ని పెద్దయ్యే దాకా సాకివాని సేత పగదీర్చుకో. ఫలానావాని పెండ్లాం పిల్లోల్లు పౌరుషవంతులని పేరు రావాల." అంటూ నూరిపోశాడు. రాత్రంతా దుర్గ ఎందుకు వెళ్లిపోయిందా అని ఆలోచిస్తూ గడిపింది. అసలు విషయమేమిటో తటుక్కున మెరిసింది.

"ఇప్పటి నుంచే పగ, ప్రతీకారాల పాటలు పాడిస్తూ, బాంబులు కత్తులతో ఆటలు ఆడిస్తూ కొడుకును వీరపుత్రునిగా తీర్చిదిద్దే వీరమాతగా పరిణతి చెందేందుకు శక్తిలేకనే.. ఇష్టంలేకనే.. ఒక క్రూరత్వాన్ని ... ఒక ఆటవిక లక్షణాన్ని అనువంశికంగా కొనసాగించేందుకు ససేమిరా ఇష్టపడకనే..."

మొగుడు ఖూనీ చేయబడితే పూర్వంలా వీరపత్నిగానో, వీరమాతగానో మారేందుకు ఇప్పటి పెళ్లాలు ఇష్టపడరనీ, చచ్చిన మొగుడి శవాన్ని సైతం కళ్లజూడరనీ, వీలైతే ఇప్పుడుండే తాళినితెంచి మరోతాళికోసం ప్రయత్నిస్తారనీ, దుర్గ పారిపోవటం వెనకవుండే అర్థం" అని.

ఈ మూడు కథల్లోనూ ముఠా తగాదాలూ, కక్షల వల్ల కుటుంబాల ఆర్థిక స్థితి అడుగంటి పోతున్నదనీ, తమ కుటుంబాన్ని కాపాడుకోవాలనే అతివల అంతరంగం ఆవిష్కరింపబడింది. కుటుంబాల మధ్య తగాదాలు ఎందుకు ఏర్పడుతాయో, పగలూ కక్షలూ ఎలా పరిణమిస్తాయో, కుటుంబాలు ఎలా చిన్నాభిన్నమవుతాయో, ఆ కుటుంబాల్లో మహిళలు ఎంత ఆవేదన చెందుతారో, కుటుంబ బాగోగుల పట్ల ఎంత బాధ్యతగా ప్రవర్తిస్తారో విప్పిచెప్పుతాయి. చితికిన ఆర్థికస్థితి, ఛిద్రమవుతున్న మానవ విలువలు మహిళలను కుంగదీస్తాయి. ఊబిలో ఉన్న పురుషులు బయట పడడానికి దారులు ఆలోచిస్తారు. తడి కథలో చెన్నమ్మ లౌక్యంగా పంతాలు పట్టింపులు అనవసరమని తగాదాల వల్ల ఆర్థిక స్థితి అథ:పాతాళానికి పోవడం తప్ప ఒరిగేదేమీ లేదని రాజీ మార్గం ఎన్నుకుంది.

కొమ్ములు కథలో "భూమి పుత్రా ఉన్నప్పుడు నిన్నడిగిన్నా? నిన్నుకూకోబెట్టి సాకలే" ఆరునూరయినా బర్రెను అమ్మితీరతానని రామిరెడ్డి అన్నప్పుడు "నన్ను కూకోబెట్టి సాకడానికే పొలాలమ్మిండంటా... నన్ను సాకడానికే పెద్దరెడ్డి పక్కజేరి పార్టీలో తలదూర్చిండేమో! సేద్దెం సాలిచ్చి మీసాల్దిప్పుకుంటా తిరిగిందీ నన్ను సాకడానికేనేమో! కట్టెబట్టిందీ, బాంబుల్జుట్టిందీ, బాకులు నూరిందీ, పోలీస్టేషన్ల జూసిందీ, కోర్టులకు పొయ్యొచ్చిందీ నన్నుకూకోబెట్టి సాకడానికేనేమో!" అని ఏడుపుగొంతుతో అన్నప్పుడు ఆమె జీవితంలో కడుపులో దాచుకున్న బాధ, దుఃఖం, ఆవేదన, ఆక్రోశం, ఆవేశం కట్టలు తెంచుకున్నట్లు స్పష్టమవుతుంది. పార్టీలో తిరగడం, ఆస్తితగలేయడం తప్ప భార్యాబిడ్డలను పట్టించుకోనిది రామిరెడ్డి నైజం. లక్ష్మమ్మ ముఠా తగాదాల్లో తలదూర్చి ఆస్తిని తగలబెట్టిన భర్తను దులిపింది. నోర్మూస్తావాలేదా అన్న భర్త నోరుమూయించింది. పిల్లల పోషణకు పుట్టింటివాళ్లిచ్చిన బర్రె అండ చూసుకొంది. బయటకు నడిచింది.

వీరనారి కథలో ఈశ్వరమ్మగానీ, దుర్గగానీ, ముఠా తగాదాలున్న పల్లెలు వీడి కుటుంబాలను పట్నం చేర్చినా ముఠా తగాదాల్లో ఇరుక్కున్న తమ భర్తలకు ఏ క్షణంలో ప్రాణహాని జరుగుతుందో అని తల్లడిల్లటంతోనే జీవితాలు గడిపారు. దుర్గ భర్తకు ముప్పు తప్పలేదు.

భర్తను చంపినవాళ్లను చంపించి కసితీర్చుకొని గాని తాళిబొట్టు తీయని సంస్కృతి పాతుకుని పోయిన సమాజంలో అందుకుభిన్నంగా ఆ సంస్కృతిని పాతిపెట్టాలనే ఉద్దేశంతో కొత్తదారి తొక్కింది దుర్గ. ఒక చైతన్యానికి శ్రీకారం చుట్టింది. వీరనారికి కొంగ్రొత్త అర్థాన్ని చెప్పింది.

●

కథ

# నడిచెళ్ళే ఊర్లు



- ఎం.వి.జె. భువనేశ్వరరావు

**పరాయి స్త్రీల వేపు కన్నెత్తి చూడటం మహాపాపం. ఆ పని చేసినందుకే రావణుడు తగిన మూల్యం చెల్లించాడు. అయితే ఇది చరిత్ర.**

**భారతీయ మహిళలను బలవంతంగా దౌర్జన్యంగా ఎత్తుకెళ్ళి, ప్రాణ సమానమైన వారి మానాన్ని దోచుకోవడానికి, ఓ రహస్య ప్రదేశం కావాలనే... ఆంగ్లేయులు అండమాన్ దీవులను గుర్తించారు. ఇదీ చరిత్రే.**

పరస్త్రీలను గౌరవప్రదంగా చూసే దేశంలో ఇలాంటి చేష్టలు అసహ్యకరంగా, అసభ్యకరంగా గోచరిస్తాయ్... కాని పరుల ఆస్తులను దౌర్జన్యంగా, దుర్మార్గంగా దోచుకొంటే.. దాన్నేమనాలి?..

యాదయ్య వేదనంతా అదే...!

వర్షాలు బాగా కురుస్తూ... రైతు హృదయాల్లో పచ్చని ఆశలు తొంగి చూస్తున్న వేళ...

నదులు జలపాతాలై... ఉరకలు వేస్తూ... ఉత్సాహంగా పంట కాలువల్లోకి ఉరుముతున్న వేళ...

పంట కాలువలు నిండు కుండలై... నిబ్బరంగా...

నిటారుగా సోయగాలు పరుగులతో పొలం భూముల దాహాన్ని తీరుస్తున్న వేళ..

యాదయ్య ఆశలన్నీ ఆ నీటి ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్లు... వాటినెంతగా అందుకొందామనుకొన్ననూ చేతికి చిక్కకుండా జారిపోతున్నట్లు నిద్రలో కల వస్తే కలవరపడి లేచాడు...

ప్రక్కన భార్య, ఆ దరినే ఉన్న సీత, గంగ అనే ఇద్దరు కూతుళ్ళు... ప్రశాంతంగా నిద్రపోతున్నారు... యాదయ్యకేం తోచలేదు. నిద్రపట్టలేదు.. భయం పోలేదు... ఆలోచనలు ఆగలేదు... మంచంపైనే అటూ ఇటూ దొర్లుతూ... ఆలోచనల తుఫాన్ హోరులో చిక్కిపోయి చుట్టూ అలుముకున్న గాడాంధకారమే... తన భవిష్యత్తేమోనన్నట్లుగా బెంగ ఆవహించి... ఇక ఉండలేక... అప్పటికప్పుడే లేచి... పొలం దగ్గరికి పయనమయ్యాడు.

...

రాంపేట ఊరంతా కదిలి... పొలిమేరలు దాటి... కొండ ప్రక్కకు చేరుకొంది...

అందరి కళ్ళల్లో ప్రతిబింబిస్తోన్న ఆశల సౌధాలు..! ఇరవై ఎకరాల స్థలమంతా జనంతో నిండిపోయింది. నిలువెత్తు... వామనావతారమంతెత్తు... నాయకుల చిత్రపటాలతో... ఆ ప్రాంగణమంతా నిండిపోయింది... హడావుడి మొదలైంది. నాయకులు, వినాయకులు, ప్రతినాయకులు - అందరూ శ్వేత వస్త్రధారులై, మువ్వన్నెల కండువాల్ని కప్పుకొని... మేకవన్నె పులులనే అనుమానం అణువంత కూడా

ప్రజల్లో కలగకుండా ఉండేలా చిలక పలుకులు పలుకుతూ, తేనెపూసిన మాటలతో... వారందరి నాలుకలను రుచి చేస్తూ ఉపన్యాసాలు ప్రారంభించారు.

ఎప్పుడూ కుంభకోణలెలా చెయ్యాలనే ఆలోచించేవారు, ప్రజల ప్రాణాలు కాపాడటం కోసం ఎంతగా కష్టపడుతున్నారో కష్టపడి చెప్పేస్తున్నారు..

ఎప్పుడు తమ, తమ కుటుంబ సభ్యుల, తమ మనుమల, ముని మనుమల, పుట్టబోయే నాలుగైదు తరాల వారి కోసం ఎన్ని కోట్లు సంపాదించాలో, అదీ ఐదేళ్ళలోనే సంపాదన పూర్తి చేయడం కోసం పంచవర్ష ప్రణాళికను ఎలా దోపిడీ కోసం రూపొందించుకోవాలో ఆలోచనలు సాగించేవాళ్ళు. ప్రజలకందించే సదుపాయాల కోసం తామెంతగా... శీతలీకరణమైన గదుల్లో ఉండి చెమటలు చిందిస్తున్నారో ఏకరువు పెడుతున్నారు. మధురంగా మాటలు, జీవం పోసుకుంటున్న నటన. సమయానికందుతున్న చల్లని నీరు – రాంపేట జనాన్ని ఉధ్రుత లూగిస్తున్నాయ్... చప్పట్లు కొట్టేలా చేస్తున్నాయ్...

ఒక్కొక్క కుటుంబానికి ఒక్కో ఇండ్ల స్థలం, దానిలో ఇల్లు నిర్మించుకోవడానికి రాయితీతో కూడిన గృహ రుణం.. పూరిపాకలు లేకుండా సరాసరి పక్కా ఇల్లు కట్టుకొనే బంపర్ ఆఫర్...!

అందరి కళ్ళల్లోనూ... అవే ఆశలు...!



అంధకారంలో ఉన్న ఆ శ్వేత వస్త్రధారులు... ఒక్కొక్కరి పేర్లను పిలిచి మరీ దండలేసి అభినందించారు. ఇండ్ల స్థలం పట్టా, గృహ రుణం చెక్కు చేతిలో పెట్టినారు. ఒక్కొక్కరూ తీసుకుంటూ... ఆనందంతో ఏడ్చేశారు.. గుండెపోటొచ్చి.. గుండాగి పోయినంత సంతోష పడ్డారు. లబ్దిదారులుగా లబ్ధప్రతిష్టులై పోయారు.

వారి ఆనందానికి అవధుల్లేవు.

ఉచితంగా ఇంటి స్థలం, ఉచితంగా సరుకులు, ఉచితంగా ఆరోగ్య రక్షణ, ఉచితంగా చదువులు... ఉచితంగా ఇవీ, ఉచితంగా అవీ... వారికేవి కావాలన్నా ఉచితమే... ఇంతకు ముందెప్పుడూ ఈ పరిస్థితి లేదు..

ఇలాంటి అదృష్టం దక్కుతుందనే ఆలోచన కూడా రాలేదు...

ఇంత సులువుగా తమ ఆశలు నెరవేరుతాయనే కోరిక కూడా కలగలేదు...

ఇలాంటి భీమా... ఇంతటి ధీమా మునుపెన్నడూ మనసుకే చిక్కలేదు...

నేతల ఉపన్యాసాలతో ఉక్కిరి బిక్కిరయ్యారు...

ఉచితానుచితాలతో సంబంధం లేకుండా ఇచ్చేస్తున్న ఉచితాల నందుకొని... ఉత్సాహభరితంగా అడుగులు వేస్తూ... ఇండ్లకు చేరుకున్నారు.

ఊరు ఊరంతా మరోచోటకు మారి 'కొత్తూరు'గా అవతరించాలనే ఆవేశంతో... మరికొద్ది నెలల్లోనే ఎన్నికలు రాబోతున్నాయనే కఠోర సత్యాన్ని తెలుసుకోలేకపోయారు.

బలి ఇచ్చేముందు కోడిపుంజుకు, మేకపిల్లకు పసుపు కుంకుమలతో పూజలు చేసే... సంస్కారమే ఇది కూడాననే విషయాన్ని అర్ధం చేసుకొనే శక్తి లేకపోవడమే వారి బలహీనత..!

ఎన్నికలు పూర్తయిపోయాయి..

శ్వేతాంబరధారులే అధికారంలో నిలబడ్డారు...

'కొత్తూరు' నిర్మాణం ఊపందుకొంది... అందరి ఇళ్ళు అందంగా రూపుదిద్దుకొంటున్నాయ్...

తెల్ల సున్నంతో తళతళలాడిపోతున్నాయ్...

తెలుపు రంగు గోడలు, పచ్చని తోరణాలు.. రాంపేట ఊరు – 'క్రొత్త రాంపేట'లోని గృహ ప్రవేశం చేసింది.

ఒకటే హడావుడి..

ప్రతీ వ్యక్తిలో ఓ నూతన సంబరం.. సందడి!

కొత్త ఇంటిలో క్రొంగ్రొత్త దర్జా కోసం ఆరాటం...

క్రొత్తూరులో వినాయకచవితి, రంజాన్, దసరా, దీపావళి, క్రిస్మస్, సంక్రాంతి, శివరాత్రి, ఉగాది – వరుసగా పండగలు ఉత్సాహం, కేరింతలతో జరగసాగాయి.

చుట్టూ ఎత్తయిన కొండలు... మధ్యలో కన్నెధార, పరిసర ప్రదేశమంతా పచ్చని చెట్లు, మధ్యలో రాంపేట... ఊరు ప్రకృతిలో ఒదిగిపోయినట్లుంటోంది.

'వ్యవసాయం' ముమ్మరంగా సాగుతూ... చదవాలనుకొనే పిల్లల కోసం 'ప్రాథమిక పాఠశాల' వెలసింది. అదే సాయంత్రం పూట 'పెద్దల బడి'గా వయోజన విద్యకు వేదికయింది.

ప్రశాంతతకు మారుపేరుగా, ఐకమత్యం ఊపిరిగా అవతరించిన 'రాంపేట'పై రావణుల దృష్టి పడింది.

...

రాంపేట ఊరంతా కంపించినట్లయింది.

పిడుగులాంటి వార్త!

రాంపేటకు రక్షణ గోడలా ఉన్న ఎత్తయిన కొండల్లో బాక్సైట్ ఖనిజం నిక్షిప్తమై ఉందట. దాన్ని స్వంతం చేసుకొన్న వాడికి పది తరాలకు సరిపడే ఆర్ధిక వనరులు అవలీలగా లభిస్తాయట. దాన్ని చేజిక్కించుకొనేందుకు శ్వేతాంబరధారులే పోటీ పడుతున్నారట. ఎన్నికల వరకే ప్రజలూ, రాజకీయాలు!

ఎన్నికలయ్యేక సంపాదన, సర్దుబాట్లే!

ప్రతిపక్షం లేదు, స్వపక్షం లేదు – అంతా అధికారపక్షమే..!

రాంపేట సన్నగా వణికింది.

కొండలు, గుట్టలు అన్నీ ప్రభుత్వానివే. ప్రభుత్వమంటే ప్రజలు కానేకాదు. ప్రభుత్వమంటే ప్రజా ప్రతినిధులు, ప్రజల సొమ్మును తమిష్టమొచ్చినట్లు ఖర్చు చేసుకోగల ధీరులు, శూరులు...!

అంతా సవ్యంగానే సాగిపోయేది.

ఎటొచ్చీ ఎన్నికల ముందవతరించిన 'రాంపేట' వారికి అడ్డయింది. రాంపేట అడ్డును తొలగించుకుంటే అంతా పచ్చ తివాచీయే...!

రాంపేట ఊరి క్రింద 'భూకంపం' వచ్చే ప్రమాదముందని పత్రికల్లో వార్తలు రాయించారు. 'లావా' నిల్వలున్నాయని చెప్పించారు.

భూగర్భంలో ఉన్న జలాన్ని త్రాగితే 'ఫ్లోరైడ్ బాధితులవుతారని' బెదిరించారు.

రాబోయే పదేళ్ళలో ఆ భూమి ఎడారిగా మారే అవకాశముందని సామాజిక శాస్త్రవేత్తలతో ఆందోళనలు చేయించారు.

సామధాన భేదోపాయాలు ప్రయోగించారు.

సంఘ పెద్దల్ని ప్రలోభపరిచారు.

అయినా రాంపేట తొణకలేదు, బెణకలేదు.

దండోపాయం ప్రయోగించక తప్పలేదు.

ప్రకృతి ఒడిలో ఒదిగిపోయిన ఊరు పోలీసుల పహారాలో కెళ్ళింది.

యాదయ్య కల నిజమైంది.

ఉచితంగా వచ్చిన ఇల్లు, చుట్టపుచూపుగా రావడమే కాకుండా దాంతో పాటు తరతరాల అనుబంధం ఉన్న తాతల నాటి భూమిని కూడా లాక్కెళ్ళిపోతుంది.

యాదయ్యకు వాళ్ళు ఉచితంగా ఇచ్చిన ఇల్లు అక్కరలేదు. కాని తాతలనాటి భూమి కావాలి.



తాను చావనైనా చావాలి. తప్పితే ఆ భూమి పరాధీనం కాకూడదు. అదీ దుర్మార్గుల అదుపులోకి! వెళ్ళనే వెళ్ళకూడదు. ఇంటికి పరుగు పరుగున వెళ్ళాడు...

భార్యా పిల్లలనూ తనివితీరా చూసుకున్నాడు..

భూమి దగ్గరకే వెళ్ళాడు. రాత్రి పగలూ, ఎండ వానా, ఆకలి దప్పికా అన్నీ మరిచిపోయాడు.

ఆ మట్టివాసన, అమ్మ ఒడిలాంటి పొలం మడి.

వింజామరలు వీచే కొబ్బరి చెట్లూ, కిలకిలా రావాలు.

యాదయ్యను దూరం జరగనివ్వడం లేదు.

నిరంతరం అవే ఆలోచనలు... నిత్యం అదే ప్రపంచం!

పోలీసులు ఊరంతా కాపలా ఉన్నారు..

పొలంలో ఉన్న యాదయ్య... పోరాడటం కోసం సిద్ధమవుతున్నాడు.

ఊరంతా పొక్లయిన్‌లు, క్రేనులు, బుల్‌డోజర్లు, పోలీసులు, పోలీసు డ్రస్ వేసుకొన్న గూండాలు!

పచ్చని పొలమంతా ఖాకీ రంగులో కన్పిస్తోంది.

ప్రొక్లయిన్ల హోరులో జనాల హాహాకారాలు విన్పించడం లేదు. హాహాకారాలు, ఆర్తనాదాలకు మాత్రమే పరిమితమైన జనాల్లో ప్రతిఘటించాలనే భావనే కలగలేదు. పోలీసు దండు - యాదయ్య పొలంలోకి ప్రవేశించిందో, లేదో కొందరికి కాళ్ళు తెగాయ్, మరికొందరికి తలలు తెగాయ్... ఇంకా తెగుతూనే ఉన్నాయ్.. యాదయ్య ఉగ్రరూపమది!

ఊహించని ప్రతిఘటన... ఎక్కడా ఎదురుకాని నిరసన... వెయ్యి వేదనలు మిళితమైన ఆందోళన.. వాస్తవంలోకి వచ్చేసరికి కొన్ని నిమిషాలు పట్టింది. పోలీసు తుపాకుల గుళ్ళన్నీ... యాదయ్య గుండెను గురిగా చూసుకొని దూసుకెళ్ళాయ్...

తల, భుజం, గుండె, వీపు, తొడలు యాదయ్య శరీరంలోని ప్రతి భాగానికీ ఓ 'బులెట్' చేరుకొంది. తన కోసం పోరాడిన యాదయ్యను భూదేవతమ్మ ప్రేమగా అక్కున చేర్చుకొంది.

యాదయ్య మరణంతో ఊరంతా భయపడింది.

యాదయ్య కుటుంబం వేధింపులకు గురైంది.

చిన్నారులైన సీత, గంగలకూ ఇబ్బందులు తప్పలేదు.

అక్కడికి వంద మైళ్ళ దూరంలో ఉన్న ప్రభుత్వ భూమిలో మరో కాలనీ వెలసింది. ఆఘమేఘాల మీద పూర్తయింది.

ఆలస్యమైతే మనుషుల మనసులు మారతాయేమోననే భయమో, బాక్సైట్ వెలికితీతకు ఆలస్యమైతే కోట్లాది రూపాయల ఆదాయం ఆగిపోతుందనే ఆలోచనో.. ఏ ప్రభుత్వ కార్యక్రమమూ, పథకమూ అమలు కానంత త్వరగా కొత్త కాలనీ నిర్మాణమైంది.

రాంపేట మరోసారి నడిచెళ్ళింది...

కొత్త రాంపేట ఇంకోసారి షిఫ్టయింది...

వాళ్ళలో ఉద్వేగమూ లేదు... ఉత్సాహమూ లేదు...

ఎవరి కళ్ళల్లోనూ ఆనందమూ లేదు... ఆవేదనా లేదు..

ఎందుకంటే ఊరుకి ఊరే షిఫ్టవడం వారికీ అలవాటయిపోయింది. ఇలా మారడం వారి అలవాటుగా కూడా మారొచ్చు... ప్రస్తుతానికి వారికొచ్చే భయమేమీ లేదు... ఎందుకంటే వారు వందమైళ్ళ దూరంలో వున్నారు.

యాదయ్య త్యాగాలు ఎవరికీ అక్కరలేదు.

ఊరుమ్మడి బ్రతుకులే వారికి ఇష్టం కూడా!

...

బాక్సైట్ ఖనిజాన్ని అమ్మి పెట్టే బాధ్యతను ప్రభుత్వం ఆ ప్రాంత మంత్రి గారి కొడుక్కి అప్పగించింది.

రాంపేటను చీల్చి చెండాడినందుకు చురుకైన పోలీసు బాస్‌కు ప్రమోషన్ లభించింది.

ప్రజలకు కాకుండా ప్రజా ప్రతినిధులకు ఇతోధిక సేవలందించినందుకు అధికారులకు అవార్డులు లభించాయి.

మరో నాలుగు తరాలు మంత్రిగారి వారసులే మంత్రులుగా ఉండేందుకు సరిపడా ఆర్థిక వనరులు బాక్సైట్ ద్వారా వారికి లభించాయి. గాడ్సేల రెండో గుండుకు అనేకమంది గాంధీలు ఒకేసారి నేలకొరిగారు. గాయాలు కాకుండానే!

●



# 2జి స్పెక్ట్రమ్‌లో అసలేం జరిగింది?

- ఎం. తారానాథ్

*సరళీకరణ ఆర్థిక విధానాలలో భాగంగా విదేశీ పెట్టుబడిదారులు స్వదేశీ గుత్త పెట్టుబడిదారులతో కలిసి టెలికాం మార్కెట్‌ను ఎలా ఆక్రమించాలా అని ఆలోచించి, గత రెండు దశాబ్దాలుగా టెలికం రంగంలోని దాదాపు ప్రతి మంత్రి హయాంలో ఏదో ఒక కుంభకోణానికి పాల్పడుతూనే ఉన్నారన్న ఆరోపణలు వున్నాయి. టెలికాం పరిశ్రమలో విదేశీ మార్కెట్లలో మాంద్యం ఏర్పడటంతో విదేశీ టెలికాం పరికరాల తయారీ కంపెనీల దృష్టి భారత మార్కెట్‌పై పడింది. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల శాతాన్ని టెలికం రంగంలో 74 శాతానికి పెంచటంతో ప్రతి ఏటా లక్షల కోట్ల ఖర్చుతో టెలికాం పరికరాల దిగుమతి విదేశీ కంపెనీల నుండి జరుగుతోంది.*

నేడు దేశాన్ని కుదిపేసిన అతి పెద్ద కుంభకోణం స్పెక్ట్రమ్ - 2జి. ఈ కుంభకోణం గురించి వివరించే ముందు దాని పూర్వ రంగం గురించి క్లుప్తంగా ప్రస్తావించాల్సిన అవసరముంది. సరళీకరణ ఆర్థిక విధానాలలో భాగంగా విదేశీ పెట్టుబడిదారులు స్వదేశీ గుత్త పెట్టుబడిదారులతో కలిసి టెలికాం మార్కెట్‌ను ఎలా ఆక్రమించాలా అని ఆలోచించి, గత రెండు దశాబ్దాలుగా టెలికం రంగంలోని దాదాపు ప్రతి మంత్రి హయాంలో ఏదో ఒక కుంభకోణానికి పాల్పడుతూనే ఉన్నారన్న ఆరోపణలు వున్నాయి. టెలికాం పరిశ్రమలో విదేశీ మార్కెట్లలో మాంద్యం ఏర్పడటంతో విదేశీ టెలికాం పరికరాల తయారీ కంపెనీల దృష్టి భారత మార్కెట్‌పై పడింది. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల శాతాన్ని టెలికం రంగంలో 74 శాతానికి పెంచటంతో ప్రతి ఏటా లక్షల కోట్ల ఖర్చుతో టెలికాం పరికరాల దిగుమతి విదేశీ కంపెనీల నుండి జరుగుతోంది. స్వదేశీ టెలికం కంపెనీలైన హిందుస్థాన్ కేబుల్స్ లిమిటెడ్, ఐ.టి.ఐ. వంటి కంపెనీలు నష్టాలలో నడుస్తుండటం గమనార్హం. టెలికం రంగంలో అవినీతికి ఇదే పునాదిగా మారిందని భావించవచ్చు.

### టెలికం మంత్రుల తీరుతెన్నులు

**సుఖరాం (1991-96):** ఈయన హయాంలో హిమాచల్ ఫ్యూచరిస్టిక్ కంపెనీ పేరుతో నాసిరకం టెలికం పరికరాల సరఫరా తదితర అక్రమాల పేరుతో 1500 కోట్ల కుంభకోణం వెలుగుచూసింది. ఈయన హయాంలోనే జాతీయ టెలికాం విధానాన్ని ప్రకటించారు. దరిమిలా ప్రైవేటు కంపెనీలు ఈ రంగంలోకి ప్రవేశించాయి.

**వేణీప్రసాద్ వర్మ (1996-98) :** ఈయన టెలికామ్ మంత్రిగా వుండగానే టెలికం రెగ్యులేటరీ అథారిటీ (ట్రాయి) ఏర్పాటైంది. ప్రైవేటు టెలికాం కంపెనీలకు లైసెన్సులిచ్చారు. వీటికి 4.4 MHz (మెగాహెట్జ్) స్పెక్ట్రమ్‌తో పాటు 2.2 MHz అదనంగా ఉచితంగా ఇచ్చారు. అప్పట్లో దీనిపై అనేక అనుమానాలు రేకెత్తాయి.

**జగ్‌మోహన్ (1998-99) :** ఈయన ప్రైవేటు టెలికాం కంపెనీలపై ఉక్కుపాదం మోపి 50,000 కోట్ల పన్ను విధించారు. బడా టెలికాం ప్రైవేటు కంపెనీలు ఒత్తిడి తెచ్చి ఈయనను అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీకి మార్పించాయి.

**రాంవిలాస్ పాశ్వాన్ (1999 - 2001) :** నూతన టెలికాం విధానాన్ని ప్రవేశపెట్టింది ఈయనగారే. ప్రైవేటు టెలికాం కంపెనీలు రెవెన్యూ షేరింగ్ పద్ధతికి మారే అవకాశం కల్పించిందీ పాశ్వాన్ హయాంలోనే.

**ప్రమోద్ మహాజన్ (2001-03) :** రిలయన్స్ కంపెనీ అంతర్జాతీయ కాల్స్‌ని, జాతీయ కాల్స్‌ని లోకల్ కాల్స్‌గా మార్చడం వంటి అక్రమ చర్చలకు పాల్పడితే కేవలం 150 కోట్ల నామమాత్రపు అపరాధ రుసుం విధించి విడిచిపెట్టేశారు. ఈయన ధీరుబాయ్ అంబానీ వీరభక్తుడని ప్రతీతి.

**అరుణ్‌శౌరీ (2003-05):** యునిఫైడ్ యాక్సెస్ సర్వీస్ లైసెన్స్ విధానంలోకి ప్రైవేట్ టెలికం కంపెనీలు మారేందుకు అవకాశం కల్పించింది ఈయనగారే. లైసెన్సు దరఖాస్తులకు సంబంధించి ఫస్ట్ కమ్ సర్వ్ విధానాన్ని ప్రవేశపెట్టింది కూడా ఈయనే.

**దయానిధి మారన్ (2005-07) :** ఒక్క ఏడాదిలోనే 22 కొత్త లైసెన్సులను 2001 నాటి ఫీజుకే ఇచ్చారు.

**ఎ. రాజా (2007-10):** 122 కొత్త లైసెన్సులు 2001 నాటి లైసెన్సు ఫీజుకే ఇచ్చారు.

## లైసెన్సుల మంజూరులో అక్రమాలు

దేశంలోని టెలికాం రంగాన్ని 23 వాణిజ్య సర్కిళ్ళుగా విభజించారు. ఈ 23 సర్కిళ్ళను వాటికి లభించే ఆదాయాల ఆధారంగా ఎ,బి,సి గ్రేడ్‌లుగా విభజించారు.

దేశంలో మొదటిసారిగా 1994 నవంబరులో నాలుగు మెట్రోపాలిటన్ నగరాలలో 8 లైసెన్సులు ప్రైవేటు టెలికాం కంపెనీలకు ఇచ్చారు. 1995లో 18 సర్కిళ్ళలో సెల్యులర్ లైసెన్సులు ఇచ్చారు. వీటికి లైసెన్సు ఫీజులు బిడ్డింగ్ పద్ధతిలో నిర్ణయించారు. అప్పట్లో లైసెన్సు ఫీజు 3,500 కోట్లుగా వుండేది. లైసెన్సు పొందిన కంపెనీలకు ఆరంభ స్పెక్ట్రమ్‌గా 4.4 MHz స్పెక్ట్రమ్ ఉచితంగా ఇచ్చారు.

గ్రామీణ ప్రాంతాలలో సర్వీసులు ఇవ్వలేమనీ, లైసెన్సు ఫీజు చెల్లించలేమని ప్రైవేటు టెలికాం కంపెనీలు చేతులెత్తేశాయి. ఎన్డీయే ప్రభుత్వ హయాంలో 50,000 కోట్ల రూపాయల మేర అపరాధ రుసుం రద్దు చేశారు. 1999లో నూతన టెలికాం విధానం ప్రకటన తర్వాత ప్రైవేటు టెలికం కంపెనీలు రెవెన్యూ షేరింగ్ విధానంలోకి మారాయి. ఈ విధానంలో వార్షిక లైసెన్సు ఫీజు, స్పెక్ట్రమ్ ఛార్జి రెవెన్యూ ఆధారంగా చెల్లించాలి.

1999 ఆగస్టు 1న 4.4 MHz అదనంగా 1.8 MHz స్పెక్ట్రమ్ ఉచితంగా ఇచ్చారు.

2000 సంవత్సరంలో బిఎస్ఎన్ఎల్, ఎంటిఎన్ఎల్ మూడవ టెలికాం ఆపరేటర్‌గా రంగ ప్రవేశం చేసింది. 2001లో ప్రతి సర్కిల్‌లో నాల్గవ ఆపరేటర్‌కు అనుమతి ఇచ్చింది. ఆవిధంగా 39 కొత్త లైసెన్సులను జారీ చేసింది. ఇందుకుగాను వన్‌టైమ్ ఎంట్రీ ఫీజు, రెవెన్యూ షేరింగ్, వార్షిక స్పెక్ట్రమ్ ఛార్జి చెల్లించాలి.

2003లో యునిఫైడ్ యాక్సెస్ సర్వీసు లైసెన్సు విధానం అమలులోకి వచ్చింది. మొదటి నుంచి వున్న లైసెన్సు సర్వీసు ప్రొవైడర్లు ఇందులోకి ఉచితంగా మారవచ్చు. తరువాత లైసెన్సు పొందినవారు 4వ ఆపరేటరు కట్టిన మొత్తాన్ని చెల్లించాల్సి వుంటుంది.

2003లో 51, అలాగే 2006లో 22 కొత్త యుఎఎస్ఎల్ లైసెన్సులు 2001 నాటి రేటుకు ఇచ్చారు. అప్పట్లో కూడా 2001 రేటుకే లైసెన్సులు ఇవ్వటం పట్ల కాగ్ అభ్యంతరం వ్యక్తం చేసింది. 2008లో ఎ. రాజా 122 కొత్త లైసెన్సులు 2001 నాటి రేటుకు ఇచ్చారు. ఇదే ఇప్పటి 2జి స్పెక్ట్రమ్ వివాదం.

## స్పెక్ట్రమ్ అంటే....?

స్పెక్ట్రమ్ అంటే శబ్ద తరంగాలను విద్యుదయాస్కాంత తరంగాలుగా మార్చి, వాయుమార్గం ద్వారా ప్రసారం చేయటం. ఉన్న వాయువనే మనం వాడుకోగలం. వైర్‌లెస్ టెక్నాలజీ ద్వారా ప్రసారాలకు ఆదరణ ఏర్పడటంలో స్పెక్ట్రమ్‌కు డిమాండ్ ఏర్పడింది.

స్పెక్ట్రమ్ మొత్తం మిలిటరీ, పోలీస్ వ్యవస్థల అధీనంలో వుండేది. రక్షణ రంగానికి ప్రత్యేక ఆప్టికల్ ఫైబర్ కేబుల్ వేసి స్పెక్ట్రమ్‌ను ఖాళీచేసి, 3జి స్పెక్ట్రమ్ వేలాన్ని నిర్వహించారు. ఈ వేలం ద్వారా ప్రభుత్వానికి లక్షా ఆరువేల కోట్ల ఆదాయం వచ్చింది.

## 2జి స్పెక్ట్రమ్‌లో ఏం జరిగింది?

ఒక్కో వాణిజ్య సర్కిల్‌లో నలుగురు సర్వీసు ప్రొవైడర్లు వుండగా, మరింతమందికి లైసెన్సులు ఇవ్వాలని ప్రభుత్వం భావించింది. బడా పెట్టుబడిదారుల ఒత్తిడి కూడా ఇంకో కారణం. లైసెన్సు పొందటానికి దరఖాస్తుతో పాటు ప్రాసెసింగ్ ఫీజు కట్టాలి. ఈ కంపెనీలకు సర్కిల్‌ను బట్టి 10కోట్ల నుండి 3 కోట్ల పెయిడ్ అప్ షేర్ క్యాపిటల్ వుండాలి.

అప్లికేషన్ ఇచ్చిన 30 రోజుల లోపల ప్రభుత్వం లెటర్ ఆఫ్ ఇండెంట్ ఇవ్వాలి. ఈ రకమైన ఇండెంట్ ఇచ్చిన 15 రోజుల్లోగా లైసెన్సు పొందిన కంపెనీ వన్‌టైమ్ ఎంట్రీ ఫీజు పర్ఫార్మెన్స్ బ్యాంక్ గ్యారంటీ, ఫైనాన్షియల్ బ్యాంక్ గ్యారంటీ ఇవ్వాలి. ఒక సర్వీసు ఏరియాలో పనిచేసే సర్వీసు ప్రొవైడర్, అదే ఏరియాలో పనిచేసే ఇంకో కంపెనీలో 10 శాతానికి మించి సబ్‌స్టాన్షియల్ ఈక్విటీలు కలిగి వుండరాదు.

2006 మార్చి నుండి 2007 సెప్టెంబరు 4 మధ్య కమ్యూనికేషన్స్ శాఖ వద్ద 167 లైసెన్సు దరఖాస్తులు పెండింగ్‌లో వున్నాయి.

2007 సెప్టెంబరు 24న కమ్యూనికేషన్స్ శాఖ కొత్త లైసెన్సుల మంజూరు కోసం దరఖాస్తులను ఆహ్వానించింది. 2007 అక్టోబరు 1ని తుది గడువుగా పేర్కొంది. ఈ ఎనిమిది రోజులలో 408 దరఖాస్తులొచ్చాయి. వీటి సంఖ్య ఎక్కువగా వుండటంతో లైసెన్సులు ఎలా ఇవ్వాలో సలహా ఇవ్వమని టెలికమ్యూనికేషన్స్ శాఖ న్యాయశాఖను కోరింది. ఆర్థిక లావాదేవీలకు సంబంధించిన అంశం కనుక మంత్రుల బృందానికి సిఫారసు చేయమని న్యాయశాఖ సలహా ఇచ్చింది. 2007 ఆగస్టులో లైసెన్సు ఫీజును, స్పెక్ట్రమ్ ఫీజును సవరించమని ట్రాయ్ సిఫారసును పూర్తి స్థాయి టెలికం కమీషన్ బోర్డులో చర్చించలేదు.

2007 నవంబరు2న ప్రధానమంత్రి ఎ. రాజాకి లేఖ రాస్తూ, లైసెన్సుల మంజూరీ విషయంలో అనేక వివాదాలొస్తున్నాయనీ, కనుక లైసెన్సుల మంజూరీ పారదర్శకంగా జరిగేలా చూడాలని పేర్కొన్నారు. అదేరోజున మంత్రి రాజా ప్రధానమంత్రికి రెండు లేఖలు రాశారు. గతంలో లైసెన్సులు ఇచ్చినప్పుడు ఎప్పుడూ మంత్రుల బృందానికి నివేదించలేదు. కనుక న్యాయశాఖ ఇచ్చిన సలహా సరికాదనీ, అలాగే ఒక్కో టెలికం కంపెనీ 10 MHz స్పెక్ట్రమ్‌ని ఎలాంటి స్పెక్ట్రమ్ ఫీజు లేకుండా ఉచితంగా పొందుతుంటే, కొత్తవాళ్ళకు వేలం వేయడం 'ఈక్వల్ లెవెల్ ప్లేయింగ్' (పోటీలో సమాన అవకాశాలు కల్పించడం) అనే సూత్రానికి విరుద్ధమని పేర్కొన్నారు.

మరో లేఖలో లైసెన్సులను 'మొదట వచ్చిన అప్లికేషన్ మొదట' అనే పద్ధతిలో ఇస్తామనీ మంత్రి రాజా తెలియజేశారు. అయితే ఇక్కడ గమనించాల్సిన అంశం ఏమిటంటే ఫస్ట్ సర్వ్ విధానాన్ని మంత్రి మార్చేసి లెటర్ ఆఫ్ ఇండెంట్ ఇచ్చిన తేదీ ప్రకారం ఇచ్చారు. ఇదే వివాదాస్పదమయింది.

2001 రేటుకే లైసెన్సులు ఇవ్వటం అనే విధానాన్ని న్యాయశాఖ, కేంద్ర ఆర్థికశాఖ, టెలికమ్యూనికేషన్స్ శాఖ (డిఓటి) కార్యదర్శి, అదే శాఖకు చెందిన ఆర్థిక కార్యదర్శి వ్యతిరేకించారు. ఈ అభ్యంతరాలను కూడా మంత్రి పాటించలేదు.

2007 డిసెంబరు 26న మంత్రి రాజా ప్రధానికి మరోలేఖ రాస్తూ లైసెన్సుల మంజూరు ఫస్ట్ కమ్ ఫస్ట్ సర్వ్ పద్ధతిలో ఇస్తామని

పేర్కొన్నారు. 2007 డిసెంబరు 31న టెలికమ్యూనికేషన్స్ శాఖ కార్యదర్శి రిటైరయ్యారు. 2008 జనవరి3న మంత్రి రాజా రాసిన లేఖ అందినట్లుగా ప్రధాని లేఖ రాశారు. అదే నెల 9న జరగాల్సిన టెలికం కమీషన్ సమావేశాన్ని 15వ తేదీకి వాయిదా వేశారు. 2008 జనవరి 10న మధ్యాహ్నం 2.45కి టెలికమ్యూనికేషన్స్ శాఖ ఒక పత్రికా ప్రకటన చేసింది. ఆ ప్రకటన ప్రకారం 2007 అక్టోబరు 1 నాటి వరకు ఇచ్చిన దరఖాస్తులు కాకుండా, 2007 సెప్టెంబర్ 25 వరకు వచ్చిన దరఖాస్తుల్నే పరిగణనలోకి తీసుకుంటామనేది ఆ ప్రకటన సారాంశం.

ఈ ఉత్తర్వుల వల్ల 232 దరఖాస్తులే మిగిలాయి. వీటిలో 122 దరఖాస్తులను ఖరారు చేశారు. ఈ ప్రకటన ప్రకారం ఎంట్రీ ఫీజు, పర్‌ఫార్మెన్స్ బ్యాంకు గ్యారంటీ, ఫైనాన్షియల్ బ్యాంకు గ్యారంటీ ఇచ్చిన కంపెనీలకు లెటర్ ఆఫ్ ఇండెంట్ ఇస్తామని పేర్కొన్నారు.

కేవలం 45 నిముషాలలోపే 78 కంపెనీలు లెటర్ ఆఫ్ ఇండెంట్‌ను పొందాయి. దరఖాస్తుల ప్రాధాన్యత ప్రకారం కాకుండా ఎల్‌ఓఐ పొందిన సమయం ప్రకారమే ఇచ్చారు. అలాగే 2008 జనవరి 11న మరో 43 కంపెనీలు లైసెన్సు పొందాయి.

శ్వాన్, యునిటెక్ అనే రియల్ ఎస్టేట్ కంపెనీలు ఇంచుమించు ఒకే సమయంలో అంటే ఆరోజు సాయంత్రం 4.11 గం.లకు లైసెన్సులు మొదట పొందగలిగాయి. కాగ్ నివేదిక ప్రకారం ఈ ప్రక్రియ వల్ల ప్రభుత్వ ఖజానాకు వాటిల్లిన నష్టం ఎంత? ఇందులోని లోపాలు ఏమిటి? అన్నది పరిశీలించాలి.

1. 122 లైసెన్సులలో 85 లైసెన్సులకు డిఓటి రూల్సు ప్రకారం వుండాల్సిన పెయిడ్ అప్ కాపిటల్ లేదు. ఉదా : యునిటెల్ గ్రూపు కంపెనీలు, వీడియోకాన్. 2. శ్వాన్ కంపెనీలు నిబంధనలకు విరుద్ధంగా రిలయెన్స్ కమ్యూనికేషన్లకు 10 శాతానికి మించి వాటాలు ఉన్నాయి. 3. శ్వాన్ కంపెనీలు వాటాలు కలిగిన టైగర్ ట్రస్టీస్ ప్రైవేట్ లిమిటెడ్‌లోని ఇద్దరు డైరెక్టర్లు రిలయెన్సు కమ్యూనికేషన్లలో ఉద్యోగులు. శ్వాన్ కంపెనీ కార్యదర్శి ఇచ్చిన ఈమెయిల్ అడ్రసు రిలయెన్స్ పేరిట వుండడం గమనార్హం. 4. 2008 జనవరిలో లైసెన్సు పొందిన శ్వాన్ కంపెనీ 2008 సెప్టెంబరు 24న 45 శాతం వాటాలను దుబాయ్‌కి చెందిన ఎటిసలాట్‌కు రూ. 4,500 కోట్లకు అమ్మింది. శ్వాన్ సంస్థ పొందిన 14 సర్కిళ్లకుగాను 1,537 కోట్లు మాత్రమే లైసెన్సు ఫీజుగా చెల్లించింది. 5. యునిటెక్ 16 సర్కిళ్లకు రు. 1651 కోట్లు లైసెన్సు ఫీజుగా చెల్లించగా, 60 శాతం వాటాను నార్వేకు చెందిన టెలినార్‌కు 6200 కోట్లకు అమ్మింది. 6. ఎటిసలాట్ (ప్రస్తుతం ఎటిసలాట్ డిబి)కు డిఎమ్‌కె పార్టీతో సన్నిహిత సంబంధాలున్నాయి. 7. మంత్రి రాజా భార్య పరమేశ్వరి (ఈమె లాయర్), ఎటిసలాట్ డిబి (శ్వాన్)లో బోర్డు ఆఫ్ డైరెక్టరు. కాదు ఆమె మా కంపెనీ లాయర్ అని ఎటిసలాట్ డిబి చెబుతోంది. 8. ఈ లావాదేవీల మూలంగా దేశ ఖజానాకు కాగ్ రిపోర్టు ప్రకారమే లక్షా 76 వేల 645 కోట్ల నష్టం వాటిల్లింది.

బడా పెట్టుబడిదారులు తమ కంపెనీ వ్యవహారాలు నడిపించుకోవడానికి, ఎవరు మంత్రిగా వుండాలో, ఎవరు ఎలాంటి నిర్ణయం చేయాలో నిర్ణయించే స్థాయికి, ప్రభుత్వాలు ఏం నిర్ణయించాలో శాసించే స్థాయికి రావటం వల్ల కార్మిక, కర్షక, సామాన్య ప్రజానీకానికి ఎలాంటి నష్టం కలుగుతుందో ప్రజానీకం గమనించాలి. 2జి స్పెక్ట్రమ్ కుంభకోణం వల్ల ప్రభుత్వ ఖజానా కోల్పోయిన 1,76,645 కోట్ల రూపాయల మొత్తాన్ని సంక్షేమానికి ఉపయోగిస్తే ప్రజలకు ఎంతో మేలు జరుగుతుంది. దేశంలో ఒక్కో కుటుంబానికి నెలకు 35 కేజీల ఆహార ధాన్యాలను ఇస్తే 84,399 కోట్ల ఖర్చవుతుంది. అంటే రెండేళ్లపాటు ఈ మొత్తంతో సంక్షేమ రంగాన్ని మెరుగుపరచవచ్చు.

అందరికీ చదువు కోసం సంవత్సరానికి 34,000 కోట్లు ఖర్చు అవుతుంది. పై మొత్తంతో 5 సంవత్సరాల పాటు దేశవ్యాప్తంగా అందరికీ చదువు ఉచితంగా అందించవచ్చు.

కనుక ఇలాంటి అవినీతి కార్యక్రమాల పట్ల ప్రజలు జాగరూకత వహించాలి.

**(రచయిత బిఎస్ఎన్ఎల్ ఎంప్లాయిస్ యూనియన్ ఆంధ్రప్రదేశ్ సర్కిల్ ఉపాధ్యక్షులు)**

## చందాదారులకు ఓ విన్నపం

(1) ప్రస్థానం చందాదారుని చిరునామా పైన చందా యొక్క కాలపరిమితి సూచిస్తూ నెల - సంవత్సరం ఇస్తున్నాం. అది గమనించి వెంటనే మీ చందాను పునరుద్ధరించుకోగలరు. (రెన్యువల్స్).

(2) కంప్యూటర్‌లోని రికార్డులో చందా ముగియడంతోనే ఆ చందాదారుని పేరు ఆటోమేటిక్‌గా డిలీట్ అవుతుంది. చందా కాలం ముగిసిందని ముందుగానే వారి చిరునామాకు కార్డు రాస్తున్నాం.

(3) ఆన్‌లైన్‌లో చందాను రెన్యువల్ చేసుకోవచ్చు. ఖాతా పేరు: ప్రస్థానం, ఖాతా నెం. 52001500585. బ్యాంక్: ఎస్‌బిహెచ్. ఆన్‌లైన్‌లో 5, 10 సంవత్సరాల చందాలు మాత్రమే అంగీకరించబడతాయి.

(4) సాహితీప్రవంతి కార్యకర్తలు, అభిమానులు చందాలను ఆన్‌లైన్‌లో జమచేసేటప్పుడు కనీసం 5 చందాలను ఒకసారి జమచేయగలరు. ఒకసారి ఆన్‌లైన్‌లో జమచేసినందుకు రూ.25/-లు కట్ అవుతుంది.

(5) 5 సం॥ చందా డిస్కౌంట్‌లో రూ. 500/- కట్టడం వల్ల మీకు అన్ని సంచికలు క్రమంగా అందుతాయి. గ్యాప్‌లు రావు. రూ. 100/- ఆదా కూడా అవుతుంది. (5 × 120 = 600).

(6) ఎం.ఓ. పంపే వారు కూపన్‌కు ఒకవైపున మీ పూర్తి చిరునామా, ఫోన్ నెం. రాయండి. అడ్రస్ మారితే వెంటనే కార్డు రాయండి. ఇ-మెయిల్ కూడా పంపవచ్చు. Prasthanam _ss@yahoo.co.in.

కథ

# బజారు పావురం



- హిందీ మూలం : విజయ్

అనువాదం : ఆర్. శాంతసుందరి

**సదాబహార్ పోలీస్‌స్టేషన్‌లో సాయంకాలం ఏడుగంటలకే అంతా సద్దుమణగడం కొంచెం ఆశ్చర్యమనే అనాలి. గేటు దగ్గర బాయొనెట్‌ని నేలకి ఆనించి నిలబడ్డ పోలీసు దగ్గర్నుంచి హెడ్ కానిస్టేబుల్ మున్షీ రంజాన్ ఆలీ, ఎస్.ఐ. సంగ్రామ్‌సింగ్, అతని అసిస్టెంట్ రామ్‌భజ్ వరకూ అందరి మొహాల్లోనూ బాధ, ఒత్తిడి కనిపిస్తున్నాయి. అసిస్టెంట్ హౌస్ ఆఫీస్ దూబే ఏ.సి.పి. గదిలో హాజరయేందుకు వెళ్ళాడు.**

సదా బహార్ పోలీస్ స్టేషన్ ఒక పెద్ద పేటలో ఉంది. పెద్ద బజారూ, వీధుల్లో వర్తకుల సొంతిళ్ళూ, డి.డి.ఎ. వాళ్ళ పెద్ద కాలనీ, ప్రభుత్వోద్యోగుల క్వార్టర్లు ఉన్నాయి. నియమాలకి విరుద్ధంగా, పోలీసుల కనుసన్నల్లో, దుకాణాలు రాత్రి పదీ, పదిన్నర వరకూ తెరిచే ఉంటాయి. కానీ ఇవాళ పొద్దున్నించీ అంతటా నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. దుకాణదార్లేకాక బళ్ళమీద కూరలు, పళ్ళు అమ్ముకునే వాళ్ళు కూడా ఎ.సి.పి. ఆఫీసు ముందు గుమికూడారు. ఎంతైనా మార్కెట్ కౌన్సిల్ అధ్యక్షుడి కూతురి మీద అత్యాచారం కేసు, అత్యాచారం చేసింది ఇద్దరు పోలీసులు.

కొత్తగా ఇద్దరు జేబుదొంగలు, నజీర్, ద్వారకా, అరెస్టయి ఆ జైల్లో కొచ్చారు. ఇద్దరూ ఉండుండి ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్నారు. "వెధవలు ఉచ్చపోసుకుంటున్నారు! చూడు మొహాలు వేలాడేసుకుని ఎలా ఏడుస్తున్నారో!" అన్నాడు ద్వారకా. నిజానికి వాళ్ళిద్దరూ ఒక్కసారైనా జైలుకెళ్ళి జేబుదొంగలన్న సర్టిఫికెట్ సంపాదించుకోవాలనుకుని వచ్చారు.

మున్షీ రంజాన్ ఆలీ కూర్చున్న చోటు నుంచే గదమాయించాడు, "నోరుముయ్యిండిరా దొంగ నా కొడుకుల్లారా! నోరిప్పితే లాఠీ రుచి చూపిస్తా ఏమనుకున్నారో!"

"లాఠీ దెబ్బలు చూపించినట్టే, ఇక..." అని గొణిగాడు నజీర్.

అదే సమయంలో ఒక పోలీసు ఒక రేకు డబ్బాలో నీళ్ళు తీసుకొని అటువైపుగా వెళ్ళాడు. ద్వారికా అతన్ని "ఎక్కడికి హుజూర్?" అని అడిగాడు. అతనెక్కడికి వెళ్తున్నాడో తెలిశాక ద్వారికా నవ్వుతూ, "మురికివాడలో అలా చేస్తారని తెలుసు, కానీ పోలీస్ స్టేషన్‌లో కూడా చేస్తారని తెలీదు" అన్నాడు.

ఇంతలో ఫోన్ మోగింది. ఎస్.ఐ. సంగ్రామ్‌సింగ్ దినసరి కార్యక్రమాలు ఉన్న ఫైలు పట్టుకొని ఎ.సి.పి. ఆఫీసు వైపు పరుగెత్తాడు. ఎ.ఎస్.ఐ. రామ్‌భజ్ విసుక్కున్నాడు. "క్లర్కుల వల్ల పొరపాటు జరిగితే అది హ్యూమన్ ఎర్రర్ అంటారు. శ్యామ్‌లాల్‌కి బదులు కోర్టువారు శ్యామ్‌పాల్‌ని పట్టుకున్నారు.

మున్షీ రంజాన్ అలీ, 'అయ్యా, పోలీసులు అమాయకంగా బలైపోతున్నారు. అరె, ఈ గేందామల్ ఏడున్నరకి దుకాణం మూయకుండా రాత్రి పది దాకా తెరిచి ఉంచుతాడు. ఆ తరువాత గుమస్తాలతో కలిసి పద్దులు వేయడం ప్రారంభిస్తాడు. ఇంటికెళ్ళి పందిలా మెక్కి తేనుస్తూ పక్క మీద బోర్లాపడతాడు. వాడి భార్య కోరికని నౌకరు హిమ్మత్‌సింగే తీరుస్తాడు. ఈ గుంట వైశాలి కూడా వాడికి పుట్టిందే అంటారు. ఒక్కసారి

డి.ఎన్.ఎ. పరీక్ష చేసి చూస్తే గుట్టు రట్టవుతుంది. ఎంతైనా కూతురు కూడా తల్లిలాగే తయారవుతుంది కదా!' అని నవ్వాడు.

"అరె, అది చాలా చలాకీ పిల్ల రంజాన్ అలీ! బాల్కనీలో నిలబడి కింద వుండే కుర్రాళ్ళకి సైగలు చేస్తూ మాట్లాడటం నేనెన్నిసార్లు చూడలేదు. అన్ని అనుభవాలూ అయే ఉంటాయి. కానీ పోలీసులు కాస్త తన మీద చేయి వేశారో లేదో మహాపతివ్రత లాగ ఎ.సి.పి. దగ్గరకెళ్ళి రిపోర్టు నమోదు చేయించింది."

"ఐ.పి.ఎస్. నించి నేరుగా ఆఫీసరై వచ్చేవాళ్ళకి పోలీసు విభాగం గౌరవాన్ని కాపాడటం ఏం తెలుస్తుందిలే, వాళ్ళకి ఎంతసేపు పారదర్శకతా, చట్టం గురించే బాధ. మన పోలీస్ స్టేషన్ పరువు తీసేశాడు. ఇప్పుడు చూడు దమ్మిడీకి కొరగాని జేబుదొంగలు కూడా మన జైల్లోనే కూర్చుని మనని చూసి ఎలా నవ్వుతున్నారో!"

"ఎ.సి.పి. దాస్ ఫోన్లో తిడుతున్నప్పుడు ఎస్.హెచ్.ఓ. దూబేసాబ్ మొహం చూశావా? ఎ.సి.పి. ఆయన్ని కిషన్‌లాల్‌నీ, సుధాకర్‌నీ ఖైదుచేసి తీసుకురమ్మని కసిరాడు."



"మరేమిటి, ఎంత తలవంపులు? నిన్నటి వరకూ ఆ ఇద్దరూ పోలీసు విభాగాలకే గౌరవాన్ని కలిగించేట్టుగా మంచి పేరు తెచ్చుకున్నారు. మూన్‌లైట్ రెస్టారెంట్ వాడయితే రాత్రి తొమ్మిది గంటల తరువాత వాళ్ళ కోసం ఒక టేబుల్ రిజర్వ్‌చేసి ఉంచుతారు. ఆ బల్ల దగ్గర కూర్చోవడానికి ఎవరికీ ధైర్యం చాలేది కాదు.'

"అవును వాళ్ళు అందరి దగ్గరా బాగా డబ్బులు గుంజేవాళ్ళు, పైసా పైసా లెక్క చూసేవాళ్ళు అయినా హెడ్‌క్వార్టర్స్ వాళ్ళకివ్వవలసింది మొత్తం అక్కడికి వెళ్ళిపోయేది. అప్పుడు ఎవరూ వాళ్ళు చేస్తున్నది తప్పని అనలేదు."

"శివప్రసాద్ సింగ్ వ్యవహారం గుర్తుంది కదా సార్? ఆయనకి కిట్టని వాళ్ళెవరో తమ ఇంటిని పెంచుకుంటూ పోయారని నేరుగా వచ్చి సబ్‌ఇన్‌స్పెక్టర్ మీద మండిపడ్డాడు. బల్ల మీద చేత్తో బాది, 'అడ్డమైనవాడూ ఇంటిని పెంచుకుంటూ పోతున్నాడు. ప్రభుత్వపు జాగాని ఆక్రమించుకుంటున్నాడు. అయినా మీరు చేతులు ముడుచుకుని కూర్చుని ఉన్నారు! అని అరిచాడు."

"గుర్తుంది భాయీ! దూబే అప్పుడు నవ్వుతూ... 'ఇంటి ప్లాన్‌లో మీ మేడ పొడుగూ వెడల్పూ ఎంత ఉందో, అది అన్ని వైపులకీ ఎంత విస్తరించిందో కూడా మాకు తెలుసు. అయ్యా, మీరందరూ రాజకీయవాదులు. మధ్యలోకి మమ్మల్నెందుకు ఈడుస్తారు? అన్నాడు. అప్పుడు శివప్రసాద్, 'భాయీ, దూబే, ఆ వెధవకి శాంతి లేకుండా ఉండేందుకు ఏమైనా చెయ్యి' అన్నాడు. 'మీరు ముఖ్యమంత్రి అయిపోండి. ఒక్క సైగ చేశారంటే చాలు, మొత్తం పేటని ధ్వంసం చేసేస్తాను. మీ భవంతి మాత్రం మా పర్యవేక్షణలో చెక్కు చెదరకుండా ఉండేట్టు చూస్తాం' అన్నాడు దూబే నవ్వుతూ."

"తెలుసు సార్! ప్రస్తుతం ఒక ఎన్.జి.ఓ. సంస్థ స్థాపించి, పేదవాళ్ళకి దేవుణ్ణి చెప్పుకుంటూ, ప్రభుత్వ సంస్థల నుంచీ, ప్రభుత్వేతర సంస్థలనుంచీ వచ్చే సహాయ నిధులనన్నీ స్వాహా చేస్తున్నాడు."

"ఆ శివప్రసాద్ సింగ్ సంగతి అలా ఉంచు. మన కరత్‌సింగ్‌గారు మానవ హక్కుల గురించి నాయకుడిలా పోరాడు తున్నాడు. మామూలు జనం చనిపోతే నోరు మెదపడు, కానీ రౌడీలు తన్నులు తింటే నేరుగా కమిషన్‌కి ఫిర్యాదు చేస్తాడు. ఇది అమెరికా నుంచి మనకి అంటుకున్న దిక్కుమాలిన రోగం. అమెరికా ఆయుధాలని తయారుచేసి ప్రపంచవ్యాప్తంగా అమ్ముతుంది. అశాంతిని అంతటా వ్యాపింపచేస్తుంది. కానీ తన వరల్డ్ ట్రేడ్ టవర్లు కూలిపోగానే ఆఫ్ఘనిస్తాన్ మీదికి దండెత్తింది."

"తెలుసు, సార్! తాలిబాన్‌ని తయారు చేసిందీ వాడే, నాశనం చేస్తున్నదీ వాడే. సద్దాంని ఇరాన్ మీదకి ఉసికొల్పిందీ వాడే, ఇప్పుడు అతన్ని నేలరాసింది వాడే! ప్రస్తుతం పాకిస్తాన్‌ని అందలం ఎక్కించాడు. ఎప్పుడో ఒకప్పుడు దాన్ని మట్టి కరిపిస్తాడు."

"కానీ మన కిషన్, సుధాకర్...!"

"సార్, రాత్రి ఏ ఎనిమిది గంటలకో బాగా తాగి రోడ్డుమీదకి వచ్చి ఉంటారు. ఆ చిన్నది బాల్కనీలో నిలబడి కనిపించి ఉంటుంది. వీళ్ళు తలుపు తట్టి ఉంటారు. అమ్మ తన వ్యవహారాల్లో మునిగి ఎటో పోయుంటుంది. ఆ పిల్లే తలుపు తీసి ఉంటుంది. సులభంగా లొంగి ఉండదు, వీళ్ళు బలవంతంగా లొంగదీసుకుని ఉంటారు. అయినా ఈ మధ్య వీళ్ళిద్దరూ అదుపాజ్ఞలు లేకుండా తయారయారు లెండి!"

ఇంతలో ఎస్.హెచ్.ఓ. దూబే, ఎస్.ఐ. జీపు దిగి నవ్వుకుంటూ లోపలికొచ్చారు. వాళ్ళ మొహాలు చూసి మున్షీ రంజాన్ అలీకి చాలా సంతోషం వేసి, "హుజూర్! వ్యవహారం ఒక కొలిక్కి వచ్చినట్టుందే! కేసు కొట్టేశారా? మీరు పూనుకుంటే దానికింక తిరుగేముంటుంది?" అన్నాడు.

"కంప్లీట్ సరెండర్, రంజాన్ అలీ! తందూరు పొయ్యిలా మండే బజారు మొత్తం శెనగలమ్మే వాడి చిన్న కుంపటిలా చల్లబడిపోయింది. దాసుగారిని రెండు నిమిషాలు మాట్లాడటానికి అనుమతి కోరి, జనంతో మాట్లాడాం. 'మీ రిపోర్టు ప్రకారం వాళ్ళిద్దర్నీ జైలుకి పంపిస్తాం. కానీ నియమాలనీ, చట్టాన్ని పాటించి రేపట్నుంచీ సాయంత్రం ఏడున్నరకల్లా దుకాణాలు మూసెయ్యాలి. మున్సిపాలిటీ వాళ్ళకీ పూర్తి రిపోర్టు పంపుతాం. ఎవరెవరు ప్రభుత్వ జాగాలు ఆక్రమించారో వాళ్ళ పేర్లు ఆ రిపోర్టులో ఉంటాయి అని చెప్పాం."

"తరువాతేం జరిగింది?" అని అడిగాడు రామ్‌భజ్.

"అంతే వాళ్ళ ఉద్రేకం చప్పబడిపోయింది. పావుగంట పోయాక మార్కెట్ కౌన్సిల్‌కి సంబంధించిన అయిదుగురు అధికారులు వచ్చి 'సాబ్, జరిగింది ఘోరమే. అవమానం జరిగింది. వాళ్ళిద్దరూ వచ్చి వైశాలికి క్షమాపణ చెప్పుకుని రాఖీ కట్టించుకున్నట్టయితే గేందామల్ రిపోర్టుని వాపసు తీసుకుంటాడు అన్నారు. "రూల్ ప్రకారం షాపులు మూస్తే తమ వ్యాపారాలేం కావాలి? బజారుల్లో సగం దుకాణాలు రోడ్డు మీదే ఉంటాయి, అధికారులు కళ్ళు మూసుకోకపోతే తమ వ్యాపారాలు చట్టుబండలు కావూ? ఆర్థిక కారణాల కన్నా ఒక అమ్మాయి పరువెక్కువా? మరి ఎ.సి.పి. సాబ్ ఏమన్నారు?" అని అడిగాడు రంజాన్ అలీ.

"జనం అక్కణ్ణుంచి కదిలి వెళ్ళిపోగానే బుర్ర గోక్కుంటూ 'కాలేజీలో మార్కెట్ థియరీ చదువుకున్నాను. కానీ బజారుని మాత్రం ఇవాళే చూశాను' అన్నాడు.

అందరూ పగలబడి నవ్వారు, అది ఆ పోలీస్ స్టేషన్‌లోని నిశ్శబ్దాన్ని మింగేసింది. జైల్లో ఉన్న నజీర్, ద్వారికా భయంతో ముడుచుకుపోయారు... ఇప్పుడిక మన సంగతేమిటి! అనుకున్నారు.

"మొదట్లో మనిషి డబ్బుని ఉపయోగించుకునేవాడు మున్షీజీ. అప్పుడు డబ్బు కన్నా మనిషే ఖరీదైనవాడు, అతని ఆత్మగౌరవం, మనస్సాక్షీ జీవించి ఉండేవి. ఇవాళ డబ్బే మనిషిని నడిపిస్తుంది. మర్యాదా, మన్ననా, మనస్సాక్షీ, ఉదాత్తతా అన్నీ డబ్బు అనే చీకటి గుహలో నల్లమందు మింగి నిద్రపోతున్నాయి. ఎప్పుడైనా నిద్రలేస్తే పిసరంత నల్లమందు నాలికమీద రాస్తే చాలు, మళ్ళీ నిద్రపోతాయి."

"వైశాలీ ఏం చేస్తూ ఉంటుందో!"

"వ్యాపారం లాగ రెక్కలు ముడుచుకుని, తండ్రి కంటపడకుండా తప్పించుకుంటూ ఉంటుంది" అన్నాడు సంగ్రామ్‌సింగ్.

ఎ.సి.పి. దాస్ ఆలోచనలో మునిగాడు... గౌరవం కోసం ప్రాణమిచ్చే భారతదేశం ఎంతగా మారిపోయింది? దేశం మొత్తం ఇలాటి బజారుగా మారిపోతుందా? తరువాత అతనికి మరో ఆలోచన వచ్చింది, ఇంకా దేశంలో పేదవాళ్ళ బస్తీలున్నాయి. అక్కడి జనం పొట్ట నిండా తిండి దొరక్కపోయినా కాయకష్టం చేసుకుంటూ గౌరవంగా బతుకుతున్నారు. దేశ విభజన జరక్కపోయినా ఈ దేశం రెండు ముక్కలుగా విడిపోతోందని అతనికి అనిపించింది... ఒక ముక్క నిస్సంకోచంగా విలాసం, డబ్బు అనే కనబడని అమెరికా బజారులో జూదం ఆడుతూ బతుకుతోంది. మరో పక్క మరో రకమైన భారతదేశంలో ఎంత శ్రమ చేసినా కడుపునిండా తిండి దొరకదు. ఆ జనం మానవీయ విలువలని పట్టుకు వేలాడుతున్నారు.

దాస్ సాబ్ ఊహల్లో గేందామల్ ఇనప్పెట్టెలాంటి ఇంట్లోకి గాభరాపడుతూ తొంగి చూశాడు. అక్కడ భయంతో బిక్కచచ్చిపోయి, కదలక మెదలక పడి ఉంది వైశాలీ నిస్సహాయమైన పావురంలాగ.

ఇంతలో సదా బహూర్ పోలీస్ స్టేషన్‌లోంచి వినిపించిన అట్టహాసం నాలుగు దిక్కులన్నీ ఉలిక్కిపడేట్లు చేసింది.. 'మాతో తలబడ్డవాడు మసి కావలసిందే!' అనే మాటలు పెద్ద పెట్టున మారుమోగాయి.

నజీర్, ద్వారికా జైల్లో భయంతో బిగుసుకుపోయారు... అరె వీళ్ళు మనకన్నా పెద్ద నేరస్తులురా! వీళ్ళ దగ్గర మనం శిష్యరికం చేయొచ్చేమో! అని అనుకున్నారు ఇద్దరూ. •

---

# గ్రంథాలయం

**- సోమిశెట్టి వేణుగోపాల్**



అక్షర విత్తనాలు
అద్దెకు దొరుకుతాయి
మనసులో నాటుకుంటే
మేధస్సు మొలకెత్తుతుంది
గ్రంథాలయానికి వెళ్ళు!
ఎలాంటి విత్తనాలు కావాలో
ఎంపిక చేసుకో
మెదడులోని మస్తిష్కంలో
కోట్ల న్యూరాన్లలోకి
వెళ్ళివచ్చే అక్షరాల
చప్పుడు మాత్రమే
వినిపిస్తుంది అక్కడ
గుండుపిన్ను శబ్దం కూడా
వినిపించదు
కళ్ళు మాత్రమే పనిచేసే
కాగితాల ఖార్ఖానా అది
ఎవ్వరూ దొంగిలించలేని
జ్ఞాననిధులు గుట్టలు గుట్టలుగా
పేర్చి ఉంటాయి.
విద్యాలయాలకే విద్యాలయం అది
సాహితీ ప్రియులకు దేవాలయం
అధ్యాపకులకే అధ్యాపకురాలు
కవుల కలం
సానబడేది ఇక్కడే
అధ్యాపకుడి అధ్యాయం
మొదలయ్యేది ఇక్కడే
ఉపాధ్యాయుడి సందేహాలు
నివృత్తి అయ్యేది ఇక్కడే
తత్వవేత్తల తర్కం
తరగిపోయేది ఇక్కడే
కలం కమలాలు
పరిమళించేది ఇక్కడే
రచయితల రాతలు
రాటుదేలేది కూడా ఇక్కడే
మేధావుల మనోసంపత్తిని
దాచివుంచే స్విస్ బ్యాంకు
గ్రంథాలయం
వేలిముద్ర వ్యక్తులకు అదో
వింత ప్రపంచం
గ్రంథాలయపు గదుల్లో
దుమ్ము పేరుకుపోయిందంటే
చదువుకున్నవారి మనస్సులో కూడా
దుమ్ము పేరుకుపోయినట్లే

# నానీలు

**- యానాల ఇంద్రసేనారెడ్డి**



రోడ్డుపైన
నాటు వేస్తున్నారు
ఓటు వేసిన
చేతుల తోటే....

రాళ్లకు బొట్లు
పెడితే మొక్కుతారు
రాళ్లను మెట్లకు
కడితే తొక్కుతారు

బీచ్‌లో
బికినీల విన్యాసం
అలల కౌగిలిలో
విలువల సన్యాసం

దొరలకైనా
దొరసానులకైనా
దోమల సీమలో
రోగాల పల్లకే!

చెమట చుక్కకు
దండం పెడతాను
కన్నీటి చుక్కకు
సాయం పడతాను.

# మట్టి మనుషుల జీవన దృశ్యాల 'మట్టితాళ్ళ వల'

- కె. ఆనందాచారి



సాహిత్య సృజనకంటే గొప్పనైనదీ, నిత్యనూతనమయినదీ, వైవిధ్యభరితమైనదీ, నిండుగా నవరసాలు వొలికించేది జీవితం. మనిషి జీవితమే సాహితీ సృజనకు ఆలంబన. జీవితాల్లోనిదేదీ ఎందులోనూలేదు. జీవితమంటే ఈ ప్రపంచంతో, ప్రకృతితో, పనులతో సంబంధమే. ఈ సంబంధాలలో జరిగే ఘర్షణలూ స్పందనలు, ప్రతిస్పందనలు, అందులోంచి వచ్చే ఆలోచనలు, అభిమానాలు, ఆందోళనలు, భయాలు, ఎదురుతిరగడాలు, కలలు, విలువలు అన్నీ ఆనాటి ప్రదేశాల, కాలాల్లో రకరకాలుగా మారుతుంటాయి. ఆ పరిణామాలను, మార్పుల్ని రికార్డు చేయడమే కాక మనిషిని మహోన్నతునిగా నిలబెట్టాలన్న ప్రయత్నంలోంచే సాహితీ సృజన జరుగుతుంది.

ముఖ్యంగా సమకాలీన జీవితానికి సంబంధమున్న విషయాలు కళాత్మకంగా ప్రతిబింబిస్తే మన హృదయం అనుభూతికి, ఆత్మక ఘర్షణకు గురౌతుంది. మనల్ని మనం అద్దంలో చూసుకుని చెదిరిన జుట్టును ఎలా సరిచేసుకుంటామో, జీవితాల్ని పరచిన కథానికా పఠనంతో మన హృదయాన్ని సరిచేసుకునే ప్రయత్నం చేస్తాం. అలా హృదయాన్ని తాకని ఏ సాహిత్య సృజనా తన ప్రయోజనాన్ని పొందలేనట్టే.

'చదవాలేగానీ ప్రతి మనిషీ ఒక పుస్తకమే' అన్నదాంట్లో ప్రతిజీవితమూ ఒక కథాంశమే అనే అర్థముందని భావిస్తాను. 'నా గురించి ఒక కథ రాయవూ' అన్న బుచ్చిబాబు కథలో నీగురించి కథ రాసేందుకు ప్రత్యేకతేమీ లేదని, కథగా మలిచేందుకు కావలసిన అంశాలేవీ లేవని, నా గురించి రాయమన్న స్నేహితురాలికి కథ పూర్తయ్యేవరకూ రాయలేకపోయిన రచయితను గమనిస్తే మన చుట్టూ వుండేవారి జీవితాలలోని కథల్ని మనం చూడలేకపోతున్నామన్న విశ్లేషణ కనబడుతుంది. జీవనం అంతర్గతాంశాలను పట్టుకోవడం రచయిత చేయగలగాలి.

ఇక్కడ రెండు అంశాలున్నాయి. ఒకటి, హృదయాన్ని కదిలించగలిగేలా రాయడం, రెండు ఎవరి జీవితాలను గురించి, ఏ విషయాలను గురించి రాయాలో ఎంచుకోవడం. మొదటిది ఆసక్తి, సాధనతో వస్తుంది. రెండవది రచయిత ఆలోచన, ఆశించే ప్రయోజనాన్ని బట్టి నిర్ణయమవుతుంది. రెండింటినీ నిర్వహించడానికి సమాజాన్ని దాంతో సంబంధమున్న జీవితాన్ని చదవాలి. గతం, వర్తమానం, భవిష్యత్తుపై అవగాహన వుండాలి.

అలాంటి అవగాహనతో, సామాజిక ప్రయోజనాన్ని ఆశించే ఆలోచన కలిగిన కథా రచయిత మన శిరంశెట్టి కాంతారావు.

పరిశీలన, అవగాహన, ప్రయోజనమే కాకుండా మనుషుల్లోని అంతర్లీనాంశాలు గ్రహించి మనో విశ్లేషణ చేయగల చేయితిరిగిన కథా రచయితల స్థాయికి శిరంశెట్టి చేరుకోవడాన్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

ఇంతకుముందు 'కంచిమేకలు'తో మంచి పేరు తెచ్చుకున్న కాంతారావు 'శిర'మెత్తి కథల్ని రాస్తూనే ఇప్పుడు 'మట్టి తాళ్ళవల'తో మనందరి హృదయాలను దోచుకున్నాడు. ఈ కథానికా సంపుటిలో పది కథలున్నాయి. ఈ పదింటిలో తొమ్మిది కథలు బహుమతులు గెలుచుకున్నాకే కావడం విశేషం. అన్ని కథానికల్లోని అంశాలు మనం నిత్యం చూస్తున్నవే. వాటిని చిత్రించడంలోనే కాంతారావు నైపుణ్యం నిండి వుంది.

'అడవి లోపల' అనే కథలో ఒక క్రొత్త విషయం 'రాళ్ల మేకలు'ను అందరికీ పరిచయం చేశారు. రాళ్ళ మేక విషయంతోపాటు గిరిజనుల జీవితాలు, వారు ఏవిధంగా దోపిడీకి గురౌత్నుది కళ్ళకు కట్టి చూపించారు. గిరిజనుల భాష, వారి సంప్రదాయాలు, సంస్కృతి మన ముందు దర్శనమిస్తుందీ కథలో. మేకలకు తుమ్మకాయలు మేపుతున్నప్పుడు ఒకటో, రెండు తుమ్మగింజలు బొరిగల్లతిత్తిలో పడి అలాగే వుంటాయి. ఆ తర్వాత మేకలకు మేపే కొడిశె, పంచోది, ఏపె ఆకుల రసాయనం వల్ల అవి రంగు రాళ్ళుగా మారతాయి. వాటిని వ్యాపారంగా మాఫియాలు ఎలా మలుచుకున్నదీ ఎంతో నైపుణ్యంగా కథనల్లారు.

ఇక కథానికలకు శీర్షికగా వున్న 'మట్టి తాళ్ళ వల'లో ప్రాజెక్టులు మనుషుల్ని ఎలా తరుముతున్నాయో, నష్టపరిహారాలు, వాగ్దానాలు నీటి మూటలై ఎలా ముంచుతున్నాయో మనముందు ఆవిష్కారమౌతుంది. అయితే పందులు పెంచుకుని బ్రతికేవారి జీవితాన్ని, వారి భాషను ఎంత పరిశీలించారోగానీ వాళ్ళ జీవన దృశ్యాలు ప్రత్యక్షమౌతాయి. 'నమ్మిచెడిన వాళ్ళు' కథ తీగలు అమ్ముకొని బ్రతికేవారిని భూస్వామి చేసిన మోసం గురించినది. విషయం సాధారణమే అయినా కూలీ వాళ్ళ పట్ల పెద్దోళ్ళు వ్యవహరించేతీరు, మనస్తత్వాలను చెబుతాడు. మార్కెట్లో వస్తువును ఎలా అమ్మవచ్చో, వినియోగదారుడు ఎలా మారినదీ కథలో భాగంగా మనకు తెలుస్తుంది. పాఠకున్ని కథలోకి తీసుకుపోయి ఇలా జరిగితే బాగుండునని అనిపింపజేయడంతోనే కథకుడు సఫలం అయినట్టు. చాలా కష్టపడి తేగలు తయారు చేసిన తర్వాత, (తాటి పండ్ల నుండి తేగలను తయారు చేసే విధానం కూడా తెలుస్తుంది) అవి అమ్మటానికి భిక్షపతి, అతని భార్య వీధివీధి తిరుగుతున్నప్పుడు అయ్యో ఎవరన్నా కొంటే బావుండని పాఠకుడు అనుకునేలా చేస్తుంది.

ఇక 'వెన్నెలొచ్చింది'లో నేడు బాగా చదువుకున్న కొడుకులు మంచి ఉద్యోగాలు వచ్చాక దూరాలలో వుంటూ తల్లిదండ్రుల్ని ఎలా దూరంగా వుంచుతున్నారో అని చెబుతూనే అలాంటి కొడుకులకు, వారి బాధ్యతలను గుర్తుచేయాల్సిన అవసరం కూడా సమాజంలోని పెద్దల మీద ఉందని గుర్తుచేస్తాడు. 'అమ్మపోయింతర్వాత'లో భార్య చనిపోయిన తర్వాత భర్తపడే వంటి తనపు బాధను గొప్పగా చిత్రించారు. అంతేకాదు నలుగురు కొడుకులున్నా ఎవరూ ఆయన బాధ్యత తీసుకోలేకపోయిన పరిస్థితిని చెబుతూనే, అలాంటి తండ్రులు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి తెలియపర్చారు. కొడుకులే పుట్టాలని కోరుకునేవారికి ఇదొక చురక. 'సహనం హద్దులు దాటితే..'లో కంటికి కనిపించక మనిషిని పీడించే కోడిపేను లాంటిది ప్రపంచీకరణ దానిని నిర్మూలించాలంటే వసకొమ్ములాంటి ఆయుధాన్ని ఉపయోగించాలి తప్ప, చిన్న చిన్న చిట్కా వైద్యానికి చావదని చాలా తక్కువ నిడివిలో సెక్యూరిటీ గార్డుల బ్రతుకులను కథగా మలచారు. ఐక్యతతో హక్కులు సాధించవచ్చని నిరూపించారు.

ఈ మధ్యకాలంలో సూక్ష్మరుణాలపై చాలా ప్రచారం జరిగింది. దానిక్కారణం రుణాలిచ్చిన వారి ఆగడాలను భరించలేక చాలామంది ప్రాణాలు విడిచారు. ఈ విషయాన్ని తీసుకుని శిరంశెట్టి ఎప్పుడో 'అగరొత్తులు' అనే కథను వినిపించారు. ఇక 'ఉమ్మెత్తపూలు'లో మత్స్యకారుల బాధలు, ఫ్యాక్టరీతో కాలుష్యమైన కిన్నెరసాని నది బూడిద నదిగా మారి వారి బ్రతుకుదెరువును దెబ్బతీసినదెలాగో వివరిస్తుంది. ఇక 'గద్దలు'లో గిరిజనులపై పోలీసుల, రాజకీయ బ్రోకర్ల దుర్మార్గాలను తెలియజేస్తోంది. చివరగా 'నేలమీద జాబిలి' అనే కథ మొత్తం కథానికా సంకలనానికే మకుటాయమానంగా నిలుస్తుంది.

బంగారు నగలు చేసే వీధుల్లో మురికి కాలువల్లో మట్టిని తీసి గాలించి బంగారపు చూరను కనుగొని, దాన్ని మట్టి నుండి వేరుచేసి ఆ చిన్న చిన్న పిసళ్ళతో బ్రతుకుదెరువు చూసుకునే యానాది సొట్టోడు తన భార్య ఎద్ద కర్మకోసం పొద్దల్లా మురికి కూపంలో శ్రమించీ శ్రమించీ పొందిన ఎనిమిదివందల నలభై రూపాయల్లోంచి అప్పిచ్చిన బాలిరెడ్డి గద్దలా ఎగరేసుకుపోతూ ఖర్చులకు ఉంచుకోమని వుంచిన నూటానలభై రూపాయల్ని, చెయ్యటానికి పనుల్లేక, తిండిలేక సైనేడ్ మింగి కొడుకు చచ్చిపోగా ముసలితనంతో మూడురోజులుగా ఆకలి బాధతో వున్న సోమోజుపాపయాచారి దంపతుల బాధవిని, ఆ మిగిలిన డబ్బును వారి చేతుల్లో పెడుతూ, త్యాగమనే వెన్నెల పంచుతున్న చందమామలా సొట్టోడు వెళ్ళిపోయిన తీరును చాలా హృద్యంగా చిత్రించాడు రచయిత.

చక్కని కథాశిల్పంతోపాటు ఆయావృత్తులు చేసుకునే వారి భాషను ఉపయోగించడంలో గొప్ప కృషి వుంది. ఉదాహరణకు 'ఎలుము బద్ద' ఓండులేది ఓ నొప్పి ఇంజోరె అడతనోండు' అంటూ గిరిజన భాషను ఉపయోగించాడుకూడా.

'నాలుగు పిడసలు గబగబా మింగి' కారడ్డంగా, 'ఏగిలిపొరంగలేచి' 'పైటన్నాలు తిని' 'మిత్తితో సుద్దాల నాబాకీ తీరుస్తురా' "గడమంచె' ఓ మట్టికంచుడు నిండా', 'ఓ దుర్బుద్ధి పాముల పుట్ట పొద కోమలు పెరిగినట్టు'.

కథకు కావలసిన వాతావరణాన్ని గొప్పగా నిర్మిస్తాడు. వర్ణనలతో దృశ్యాన్ని మనముందు వుంచుతాడు. 'వెన్నెలొచ్చిందిలో' పేద ముస్లిం ఇంటిని కండ్లకు కట్టాడు. "కోతుల తాకిడికి కదిలిపోయిన పాతకాలపు గూన పెంకుల సందుల్లో నుండి పడుతున్న సూర్యరశ్మి వెలుగు ఊచల మూలంగా ఇళ్ళంతా కనిపిస్తోంది. ఇంటి మూలాల్లో బూజుపట్టిపోయిన దొంతికుండలు, దండెంమీద వేలాడుతున్న మాసిన బట్టలు, గోడలకు ఎత్తి పెట్టిన రెండు తెగిపోయిన నవారు మంచాలు, పెచ్చులూడిన గోడలు, వెలసిపోయిన జాజిరంగు తలుపులు, బయట పొగలో నుసికారుతున్న పందిరిమీద పొరక, చెట్ల ఆకులు పడి రంగు మారిన నీళ్ళగోలెం, ఆ ప్రక్కనే ఈగలు ముసురుతున్న అంట్ల గిన్నెలు, దాని ప్రక్క జాలారు బండ, బండమీద నిన్ననోమొన్ననో రుద్దివదిలేసిన వెండిబొట్టు బిళ్ళల్లాంటి చేప పొలుసులు" అని వర్ణించాడు. స్వతహాగా కవి కావడం చేత కొన్ని కవిత్వ పాదాలాతో కథను కొనసాగిస్తాడు.

విమర్శకులన్నట్లుగానే రచయిత కథానికల్లో కలుగజేసుకుంటూ వ్యాఖ్యానాలు చేయడం తగ్గితే బాగుండేది. అంతే కాకుండా అక్కడక్కడా వర్ణనలు కొంత ఎక్కువయినట్లుగా కూడా అనిపిస్తుంది. 'ఉమ్మెత్తపూలు' ముగింపు నినాదప్రాయంగా ముగిసిందనిపించింది. 'గద్దలు' ముగింపు ఇంకొంత ధైర్యాన్నిచ్చేదిగా వుంటే బాగుండనిపించింది. కొన్ని కథల నిడివి తక్కువగా వుంటే ఇంకా బావుండునేమో.

'దాచేస్తే దాగని సత్యం, ఇతిహాసపు చీకటి కోణం, అట్టడుగున పడి కాన్పించని, కథలన్నీ కావాలిప్పుడు" అన్నట్టుగా అణగారిన వారి, పీడనకు గురయ్యే వారి జీవితాలను కథానికాంశాలుగా తీసుకున్న కాంతారావు ప్రగతిశీల రచయితగా అభినందనీయులు.

నచ్చిన పుస్తకం

# సామాజిక వైరుధ్యాలను, నూతన విలువలను చిత్రించిన కథలు




- వీరప్రసాద్

"దండాల్సామే... నమస్తేసా... నా పేరు యెంకటమ్మ... ఈ హోల్ మొత్తం బంగారంపేటకి నేను 'యెంకటి'నే కానీ... నిజంగా బంగారాన్ననే పేరు తెచ్చుకున్నాసా... ఆ పోలేరమ్మ సాచ్చిగా సెప్తా వుండాను. నేను ఒక్కరి చేత ఒక్క మాటన్పించుకోకుండా అంత గొప్పగా బతికినానండ్యా... ఎవురయినా సావడానికి పోతా పోతా అపద్దం చెప్తారా సెప్పండి. మా రెడ్డమ్మయితే నన్ను అంత యిదిగా మెచ్చుకుంటాది మొదల్చేసి ఆయమ్మ దగ్గిరే పన్జేస్తుండానే. ఆయమ్మకి తెలవదా నా సంగతి. తెలవకపోతే 'యెంకటి మాలోళ్ళల్లో పుట్టాల్సిందే కాదు అంత మంచి బుద్ధి దానికి... గొప్పింట్లో పుట్టాల్సిన మనిషి' అని అంత గొప్పగా దేనికి సెప్తాది... ఆయమ్మ ఆ మాదిరిగా సెప్తా వుంటే నాకు కోడి కూర నంజుకొని సంగటి తిన్నంత ఆనందంగా వుంటాది." వి. ప్రతిమ రాసిన 'ఖండిత' కథా సంపుటిలోని మొదటి కథ 'నాగలోకం'లోని ప్రధాన పాత్ర సంభాషణ ఈ మాటలు. ఒక భూస్వామి ఇంట్లో నిష్కల్మషంగా జీవితాంతం పనిమనిషిగా పనిచేసిన 'యెంకటమ్మ' తన కూతురు కారణంగా ఆ భూస్వామితో వైరం ఏర్పడటంతో ఆత్మహత్యకు పాల్పడుతూ తన కథను చెప్తుంది. సమాజం మారుతున్న క్రమంలో పాతవిలువలు అనివార్యంగా పతనమవుతాయి. కొత్త విలువలు ఏర్పడే క్రమంలో పాతతరానికి, కొత్తతరానికి ఘర్షణ అనివార్యం. మానవ సంబంధాలలో తీవ్రమైన మార్పులు ఏర్పడతాయి. అలాంటి ఒక తీవ్ర ఘర్షణే 'నాగలోకం' కథలో ఇతివృత్తం. ఇంటి యాజమాని కొడుకు యెంకటమ్మ కూతురుతో నడిపిన ప్రేమాయణంతో యెంకటమ్మకు ప్రాణసంకటం ఏర్పడుతుంది. ఆ నిస్సహాయతలో తన పరిస్థితిని తన కూతురు చేసిన పనిని తిట్టుకుంటుంది. సహజంగా అన్పించేలా నెల్లూరు మాండలీకంతో అల్లిన ఈ కథ భూస్వామి కుటుంబాలకు, వారి దగ్గర పనిచేసే దళిత కుటుంబాలకు ఉన్న వ్యత్యాసాన్ని చాలా శక్తివంతంగా వ్యక్తం చేస్తుంది. దళిత నాయకులు, గ్రామంలోని మరో భూస్వామ్య వర్గానికి చెందిన నాయుడు కుటుంబం ఈ సమస్యను రాజకీయం చేయడానికి ప్రయత్నం చేస్తారు. రెడ్డి సామాజిక వర్గానికి చెందిన ఇంటి యజమానిని ఈ సమస్యతో ఇబ్బంది పెట్టాలని చేస్తున్న ప్రయత్నాలను యెంకటమ్మ నిరసిస్తుంది. 'అబయా కస్తూరీ... మీకు కొంచెమయినా ఆలోశనుండాదా? నక్కకీ నాగలోకానికీ పొత్తేడ కుదురద్దీ. మనమ్మేంది వాళ్ళింటి కోడలయ్యేదేంది? మీకంతా పిచ్చిగానీ పట్టలేదు గదా. రెడ్డి మనమ్మిని బతకనిస్తాడనుకుంటుండారా? నట్టనడివీధిలో పెట్టి నరికి పారేస్తాడు. చెప్పేదానికిలే... రేపు నాయుడు, రెడ్డి ఒకటయిపోయి మనల్ని పులుసులో కరేపాకు నేరినట్టు ఏరిపారేస్తారు" అని అంటుంది. అత్యంత విశ్వసనీయంగా రెడ్డి ఇంట్లో పనిమనిషిగా ఉన్న 'యెంకటమ్మ'కు గ్రామంలోని భూస్వామ్య కుటుంబాలను ఎదిరించడం ఊహకు కూడా అందని విషయం. అయితే కొత్తతరం, మారిన సామాజిక పరిస్థితులు ఊరుకోవు. దళిత సంఘాలు, నాయుడులాంటి అవకాశవాదులూ ఘర్షణను మరింత రాజేయడం అనివార్యం. ఒక కొత్త మార్పుకు ఈ ఘర్షణలు నాందిగా మారతాయి. పాత విలువల స్థానంలో కొత్త విలువలు, సామాజిక మార్పులు అనివార్యంగా ఎలా ఏర్పడతాయో ఈ కథలో చాలా సహజంగా రచయిత్రి చిత్రించారు. ఈ కథను చెప్పిన తీరు, ఉపయోగించిన టెక్నిక్ పాఠకుడిలో ఆసక్తిని రేకెత్తిస్తుంది.

'ఖండిత' ప్రతిమ రెండో కథాసంపుటి. సామాజిక దృష్టితో మానవసంబంధాలను ప్రతిమ కథలు పరిశీలిస్తాయి. అనివార్యంగా మారే సమాజంలో ఏర్పడుతున్న మార్పులకు ఈ కథలు అద్దం పడతాయి. పతనమవుతున్న పాత విలువలు, ఘర్షణకు లోనవుతున్న పాత కొత్త తరాలు ప్రధాన ఇతివృత్తాలుగా ఈ కథల్లో చూస్తాం. సామాజిక మార్పుక్రమాన్ని ఈ కథలు సమర్థవంతంగా చిత్రించాయి.

మధ్యతరగతి జీవితాలను చాలా దగ్గరగా పరిశీలించడం కొన్ని కథల్లో చూస్తాం. ఈ కథలు కేవలం సందేశాన్ని మాత్రమే ఇవ్వవు. ఈ వ్యవస్థలోని అసమానతలు, అక్రమాలు సహజ మానవసంబంధాలకు ఎంత ఆటంకంగా ఉన్నాయో తెలియపరుస్తాయి. అవి శాశ్వతం కాదు అని చెప్తాయి. సమాజం పట్ల, సాంఘిక పద్ధతుల పట్ల, మానవ అనుబంధాల పట్ల లోతైన ఆలోచనలకు ప్రేరణ కలిగిస్తాయి. వాస్తవిక జీవితం పట్ల అవగాహనను విస్తృతపరుస్తాయి. రచయిత్రి సామాజిక అవగాహన కథల్లో చాలా ప్రతిభావంతంగా వ్యక్తమవుతుంది. వాస్తవిక జీవితంలోని సంఘటనలను కథలుగా రూపొందించే క్రమంలో తన దృష్టికోణాన్ని పూలలో దారంలా చొప్పించడం ఏ రచయితకైనా కష్టంతో కూడుకున్న పని. ప్రతిమ ఆ పనిని చాలా సులభంగా ఈ కథలలో చేశారని అన్పిస్తుంది.

సమాజం మార్పుకు గురవుతున్నప్పుడు ఆ సమాజానికి మద్దుత్తుగా ఉన్న అనేక వ్యవస్థలు కూడా మార్పుకు గురవుతాయి. ముఖ్యంగా సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందటం వల్ల ఆయా మార్పులు వేగవంతమవుతున్నాయి. అలాంటి ఒక మార్పును, పరిణామాన్ని ఆసక్తికరంగా చెప్పిన కథ 'దృశ్యాదృశ్యం' ఈ కథ ఉత్తమ కథా సంకలనాలలో చోటుచేసుకోదగ్గది. ప్రజలను తీవ్రంగా ప్రభావితం చేసే వాటిలో సినిమా రంగం ఒకటి. ఈ కథ సినిమా రంగంలో వచ్చిన మార్పులను గురించి ప్రధానంగా చర్చించదు. కానీ ఆ సినిమాలను ప్రదర్శించే థియేటర్ల పరిణామాన్ని మాత్రం అత్యంత శక్తివంతంగా వ్యక్తీకరిస్తుంది. సినిమా థియేటర్ చుట్టూ అల్లుకున్న జీవితాలను, అనుబంధాలను హృదయం కరిగేలా కథలో దృశ్యీకరిస్తారు రచయిత్రి. ఒక గ్రామంలోని థియేటరు ప్రారంభకాలం నుండి జరిగిన పరిణామాలను చాలా సహజంగా ఈ కథ వర్ణిస్తుంది. ఆ థియేటరులో యజమానులకు గల అనుబంధం నేపథ్యంగా కథ నడుస్తుంది. ఒకప్పటి గ్రామీణ వాతావరణాన్ని పాఠకుడికి గుర్తుకుచేస్తుంది. 'నమో వేంకటేశా, నమ నమో తిరుమలేశా' అనే పాటతో కథ ప్రారంభమవుతుంది. ఈ పాట సినిమా థియేటర్లలో సినిమా ప్రారంభానికి ముందు వేయడం గ్రామాల నుండి వచ్చిన వారికి అనుభవంలో ఉండే ఉంటుంది. చాలా గ్రామాల్లో ఆ సినిమా పాట విని సినిమా చూడటానికి బయలుదేరేవారు. ఒకప్పటి సినిమా థియేటర్ల వైభవం నేడు ఎక్కడా కన్పించదు. టెలివిజన్ ప్రవేశంతో సినిమా థియేటర్లు మూగబోయాయి. కొన్ని రూపాన్ని మార్చుకుని ఫంక్షన్‌హాల్స్‌గా మారాయి. ఈ పరిణామాలన్నీ కథలో వస్తాయి. మరీ ముఖ్యంగా ఐమాక్స్ థియేటర్స్ కల్చర్‌తో పోల్చడం కథకు సమగ్రతను చేకూర్చిపెట్టింది. పాతతరానికి కొత్తతరం చేత మారుతున్న టెక్నాలజీని చెప్పిస్తారు రచయిత్రి. "మమ్మీ... స్టేట్స్‌లో టి.వి.లొచ్చి సినిమాలని ముంచేస్తోన్న సమయంలో ఐమాక్స్ థియేటర్స్, ఫోరమ్ థియేటర్స్... 3 డి సినిమాలు... యానిమేషన్ పిక్చరైజేషన్... యివన్నీ ప్రవేశపెట్టారు. ఈ ఎఫెక్ట్స్ కోసం యింత గొప్ప సాంకేతిక నిపుణత్వంతో తీసిన సినిమాల కోసం ప్రేక్షకులు తప్పనిసరిగా థియేటర్లకు రావాల్సిన స్థితి." అమెరికన్ కల్చర్ మనకు దిగుమతయిన తీరు ఇది.

ఒక సామాజిక పరిణామాన్ని నేపథ్యంగా చేసుకుని మానవ అనుబంధాలలో, విలువలలో వచ్చే మార్పులని చాలా సమర్థవంతంగా ఈ కథలో చెప్పగలిగారు. ఈ కథాసంపుటిలోని అన్ని కథలూ ప్రత్యేకమైనవే. ప్రతి కథలో కూడా సమాజంలో ప్రధాన సమస్య ఇతివృత్తంగా వుంటుంది. రైతు జీవితంలోని దీనపరిస్థితులను వెల్లడించే 'కంకాళం' కథ కూడా పాఠకులను వేదనకు గురిచేస్తుంది. చెరుకు ఫ్యాక్టరీ రైతుల జీవితాలలో వెలుగులు పండించింది. ఆ ప్రాంతంలో చదువుకున్న నిరుద్యోగులకు కొద్దిమందికైనా ఉద్యోగాలు లభించాయి. కానీ, అది తాత్కాలికమే అయ్యింది. ఫ్యాక్టరీ నష్టాల బారిన పడడంతో ఉద్యోగులు రోడ్డున పడ్డారు. చెరుకు రైతులకు బకాయిలు పడి, పండిన చెరుకు కొనకుండా ఫ్యాక్టరీ యాజమాన్యం చేతులెత్తేయడంతో రైతుల బాధలు వర్ణనాతీతం. రైతు ఆత్మహత్యకు పాల్పడడం కథా వస్తువు. ప్రభుత్వ రంగంలోనూ, సహకార పద్ధతిలో నడుస్తున్న అనేక చక్కెర ఫ్యాక్టరీలలోని పరిస్థితులను ఈ కథ కళ్ళకి కట్టిస్తుంది. నూతన ఆర్థిక విధానాల అమలు కారణంగా ప్రభుత్వ రంగ సంస్థలను, సహకార సంఘాలను ప్రభుత్వాలు ప్రయివేటు పరం చేయడమో, నిర్వీర్యం చేయడమో ఈ పరిస్థితులకు కారణం. ఈ అంశాలను రచయిత్రి ఈ కథలో చాలా సహజంగా చిత్రించారు– "అంతర్జాతీయ ఒప్పందాల గురించి రవణయ్యకు తెలీకపోవచ్చుగానీ, ఇక్కడిన్ని చక్కెర కర్మాగారాలు పెట్టుకుని కేంద్రప్రభుత్వం పంచదారను అధికంగా దిగుమతి చేసుకోవడం గురించి తెలుసు. కేంద్రం పదహారు రూపాయలకి కొన్న పంచదారని మార్కెట్లో కిలో పదమూడు రూపాయలకే విక్రయించడంతో మొత్తం ఫ్యాక్టరీల పరిస్థితే అయోమయంగా తయారయింది. గుట్టలు గుట్టలుగా పేరుకుపోయిన చక్కెరను అమ్ముకునే దారిలేక, ఆదాయం లేక రైతులకు చెరుకు డబ్బులివ్వలేక అన్ని పరిస్థితులు.." ఈ సంభాషణలో ప్రభుత్వాల రైతు వ్యతిరేక విధానాలను బహిర్గతం చేయడం కనిపిస్తుంది. మానవ సంబంధాలకు, సామాజిక విధానాలకు ఉన్న అవినాభావ సంబంధాన్ని ఈ కథల్లో ప్రతిభావంతంగా అవగతం చేయిస్తారు ప్రతిమ.

ఇంకా ఈ సంపుటిలోని 'ముళ్ళు', 'నీళ్ళు', 'మార్తా' వంటి కథలకు మానవ జీవితాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తున్న సమస్యలే కథా వస్తువులు. వాస్తవిక జీవితానికి ఈ కథలు అద్దం పడతాయి. వివిధ సమస్యలు జీవితాల్ని ఛిద్రం చేస్తున్న తీరును ఈ కథలు వెల్లడిస్తాయి. ఈ కథల్లోని జీవితం చాలా వరకు కఠినాత్మకం. అందుకు గల నేపథ్యాలను, మూలాలను కూడా స్పృశించగలిగారు. ఆయా సమస్యలను ఎదుర్కోవాల్సిన తీరుపట్ల రచయిత్రి దృష్టి తగినంతగా కనిపించదు. ప్రధాన పాత్రలు సమస్యల్లో మునిగిపోయి ముగిసిపోతారు. ప్రత్యామ్నాయ ఆశారేఖలు వారి దరిచేరవు.

ఈ కథా సంపుటి శీర్షిక కథ 'ఖండిత' గురించి ప్రస్తావించాలి. ఈ కథ గురించి ఇప్పటికే విమర్శకులు ప్రస్తావించిన అంశాలు సరైనవే. సాధారణ గృహిణి జీవితంలో ఉన్న మహిళ సాహిత్య ప్రపంచంలోకి ఎన్నో ఆశలతో ప్రవేశిస్తుంది. అప్పటి వరకూ తన భర్త, కుటుంబం, వ్యక్తిగత జీవితంలోని అనుభవాలకు భిన్నమైన వాటికోసం ఎదురు చూసిన ఆమెకు అక్కడ కూడా నిరాశే ఎదురవుతుంది. సాహిత్యలోకంలో కూడా స్త్రీ, పురుష సంబంధాలను అనుమానంగా చూడటం పట్ల ఆమెకు ఆశ్చర్యం కలుగుతుంది. సాహిత్యజీవులు కూడా మామూలు మనుషులే అని కథా సారాంశం. ఆధిపత్య, అసమానత్వ భావజాలం విస్తృతంగా వ్యాపించి ఉన్నప్పుడు అందుకు భిన్నంగా, ఒక సంపూర్ణ పురుషుడుగా, మానవుడిగా ఉండాలని కోరుకోవడం వాస్తవిక అవగాహనకు దూరం. ఇటువంటి భావనలు మార్పుకోసం ప్రయత్నించేవారిని గందరగోళ పరుస్తాయి. సాహిత్యం అనగానే అదేదో వేరే ప్రపంచమనే భ్రమల వల్ల జరిగేది నష్టమే. సామాజిక పరిణామాలతో సంబంధం లేకుండా అందుకు భిన్నంగా సాహిత్యవేత్తలైనా, శాస్త్రవేత్తలైనా వ్యక్తిగతంగా పరిపూర్ణులుగా రూపొందలేరు. ఈ అంశాలు రచయిత్రికి అవగాహన లేక కాదు. అటువంటి భావన వున్నవారికి ఈ కథ ఒక హెచ్చరికగా ఉంటుంది. ఈ కథా సంపుటిలోని కథలు వాస్తవిక జీవిత సంఘటనలను జ్ఞప్తికి తెస్తాయి. మనుషుల్లోని వైరుధ్యాలను, మానవ సంబంధాల్లోని అంతరాలను సహజంగా వ్యక్తీకరిస్తాయి.

# కార్మికుల కవితాధార

- హిమజ్వాల




పద్మభూషణ్ డాక్టర్ ఏ.ఎస్. రావు 96వ జయంతి సందర్భంగా ఇ.సి.ఐ.యల్. ఉద్యోగులు వెలవరించిన రచనల సంకలనమే నీరాజనం. డాక్టర్ ఏ.ఎస్. రావు గొప్ప శాస్త్రవేత్త. అంతకంటే మించి మానవతావాది. దేశభక్తుడు. స్వావలంభనకు, క్రమశిక్షణకు మరోపేరు ఏ.ఎస్. రావు.

సామాన్యంగా శాస్త్ర సాంకేతిక రంగాలలో పనిచేసే వాళ్ళు సీరియస్ కళలూ సాహిత్యాలకు అంత దగ్గరగా వుండరు. వాళ్ళ ప్రపంచం వేరుగా వుంటుంది. ప్రపంచవ్యాప్తంగానే శాస్త్ర సాంకేతిక రంగాలు పెట్టుబడి కనుసన్నల్లో నడుస్తూ మానవత్వాన్ని విస్మరిస్తున్న వేళ ఇ.సి.ఐ.యల్. ఉద్యోగులు, సమాజం పట్ల బాధ్యతను విస్మరించకుండా సమాజం ముందుకు పోకుండా అడ్డుకుంటున్న, ఆయువును హరిస్తున్న అనారోగ్య అమానుష దుర్మార్గాలను ముక్తకంఠంతో వ్యతిరేకిస్తుండటం ఎంతో అభినందించదగిన విషయం.

ఈ పుస్తకంలో ముందుమాటలో రాస్తూ ప్రసాదరావు 'శ్రమకు తోడుగా జిజ్ఞాసను పెంచి, ఆలోచనలకు సరైన దిశను చూపే కళాసాహిత్యాల' అవసరాన్ని నొక్కి చెప్పటం ఆహ్వానించదగినది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం నాగరికతను ముందుకు తీసుకొని పోవడంతో పాటు, విపరీతమైన పని ఒత్తిడి వల్ల, ఉత్పత్తి స్థలాల్లో పని చేసే కార్మికుల శరీరాలను, మనసునూ గాయపరుస్తుంది. ఒక మానసిక హైన్యాన్ని వ్యాపింపజేస్తుంది. దానికి విరుగుడు సామాజిక చైతన్యమే. అందుకు కళా సాహిత్యాలను ఆశ్రయించటం వాళ్ళు చేసిన పని.

ప్రపంచీకరణ భూతమిప్పుడు ప్రపంచాన్ని ఆవహించింది. అది మనిషిని నీడను చేసి, మనిషిగా భ్రమింపచేస్తున్నది. మన కళను విరిచేసి, మన కళను పొడిచేసి మనది కాని ప్రపంచంలో మనల్ని మనకు కాకుండా చేస్తున్నది. ఈ కుట్రను దుర్మార్గాన్ని ఈ కవులూ, రచయితలు గుర్తించారనడానికి ఈ సంకలనం ఒక ఉదాహరణ.

వీళ్ళు నాలుగేళ్ళ నుంచి ప్రతియేటా క్రమం తప్పకుండా ప్రచురిస్తున్న కవితా సంకలనాలు చూస్తే వీళ్ళ అడుగు ముందడుగుగానే ఉంటున్నదని చెప్పాలి. వీళ్ళందరికీ ఏ.ఎస్. రావు నిరంతర స్ఫూర్తి. ఆయన తమకు జీవితాన్నిచ్చారని వీళ్ళంతా భావిస్తారు. ఆ జీవితాన్ని ఎలా సార్థకం చేసుకుంటున్నారన్న దానికీ ఈ సాహిత్య క్రియా కలాపం ఒక నిదర్శనం.

దేశానికి ఈ రోజు కావాల్సింది స్వావలంబన. ఈ కవితలన్నీ ఈ మంత్రాన్నే జపిస్తాయి. ఈ కవులు 'అమ్మను ప్రేమిస్తారు. ఆ అమ్మ శ్రమ అవుతుంది. అంధకారాన్ని చీల్చే వెలుగౌతుంది. (జి. యాదగిరి రావు, స్వర్గసీమలు) యాదగిరి రావు 'డబ్బు యావను ద్వేషిస్తే, గిన్ని ఆనందరావు 'కాలుపై నిలబడు/మోకాలుపై కాదు/బానిసలా బతుకకు' తలవంచకు శ్రమించమంటూ ఒక వీరజీవితం కోసం పిలుపిస్తారు. ఆత్మగౌరవం కోసం ఆరాటపడతారు. మరోచోట- మనిషిని మర మనిషిని చేసి మల్టీనేషనల్ కంపెనీలు కాటేస్తున్న తీరును వర్ణిస్తూ, ఛార్టిస్టు ఉద్యమస్ఫూర్తిని ఆహ్వానిస్తారు. మేడే స్ఫూర్తి మనలో లేకపోతే మేడేలు పేడేలుగా మాత్రమే మిగిలిపోతాయని హెచ్చరిస్తారు.

తిరునగరి మురళి 'ఉగ్రవాదం' మనకొద్దంటారు. సామ్యవాదం కావాలంటారు. 'కరువు రక్కసి' రైతుల జీవితాన్ని కకావికలు చేస్తున్న విధానాన్ని చూసి ఆగ్రహిస్తారు. రైతుపట్ల సానుభూతి ప్రకటిస్తారు. ధరాఘాతాలను(శరాఘాతాలని ధ్వని) కళ్ళకు కడతారు. ధరాఘాతాన్ని ధనార్జనపరుల దురాఘాతంగా బట్టబయలు చేస్తారు.

ఈ సంకలనంలోని ప్రతి కవితా ఏదో ఒక సమస్యని గురించి మనతో ముచ్చటిస్తుంది. జీవితం యాంత్రికమైపోయి అన్ని విలువలు మారకపు విలువలై మమతానురాగాలు లుప్తమైపోతున్నాయని ఆక్రోశం, పర్యావరణం కోసం పరివేదన, పేదల వెతలు పట్టని ధనవంతులైన దైవభక్తుల పట్ల నిరసన, మరీ ముఖ్యంగా మాతృభాష పట్ల ప్రేమ, కుల మత ప్రాంతాయాది సమస్యలతో తల్లడిల్లుతోన్న భరతమాత పట్ల ఆవేదన, విద్యార్థులను సత్క్రమపథంలో నడువమంటూ జీవితమెంత అమూల్యమో అర్థం చేయించే హితవు ఈ కవితలలో మనం చూడొచ్చు.

ఈ సంకలనంలో ఒక నాటిక కూడా వుంది. 'కాసుల నీతి' అనే ఈ నాటికలో వరకట్న సమస్య వుంటుంది. 'యంత్రభూతాలకు పని రక్కసి కోరలకు చిక్కిన ఉద్యోగులు ఆట విడుపుగా రచన కళా రంగాలపై దృష్టి సారించితే పనిలో నైపుణ్యత, మానసిక ప్రశాంతత, సంస్థ పట్ల నిబద్ధత పెరగటం సామాజిక చైతన్యమే. ఈ సంకలనంలోని కవులెవ్వరికీ రచన ఆటవిడుపుగా వున్నట్టు కనిపించకపోవటం అభినందించతగింది.

ఇ.సి.ఐ.ఎల్. సాహితీ స్రవంతి ఒక మంచి పుస్తకం తెచ్చినందుకు, సాహిత్యం ద్వారా సమాజాన్ని జాగృతం చేస్తున్నందుకు ఎవరైనా హర్షించాల్సిందే. అభినందించాల్సిందే. ఆనందించాల్సిందే.

# ఎందుకో



- ఎన్.కె.బాబు

సామాన్యుల జీవితాలలోకి
తొంగిచూసి,
నేనల్లిన కవితలను
పుంఖాను పుంఖాలుగా
ప్రచురించాయి పత్రికలు.
పత్రికల్లో కవితలు చదివిన పాఠకులు
భేష్ బేష్ అంటూ
ప్రశంసల జల్లులు కురిపించారు
పారితోషికాలు,
అవార్డులు, క్యాష్ ప్రైజులు
నేనో ప్రముఖ కవి నీవేళ
బడుగువర్గాల జీవితాల్లోని
వ్యధలను,
శ్రామికులు గురవుతున్న
దోపిడీని,
శ్రమజీవుల కడగండ్లను
ఇతివృత్తాలుగా చేసుకొని
రచనలు నిరంతరం సాగిస్తూనే వున్నాను.
నా రచనలు - పీడిత జనుల్లో
ఎలాంటి చైతన్యం తెచ్చిందో
చూద్దామని పరికించాను.
ఏది?
ఒక్కరికి కూడా నా పేరే తెలీదు.
నా కవితలు విన్నపాపాన పోలేదు.
వాళ్ళ జీవితాలకి నా కవితలు
ఎలాంటి మార్గదర్శకం కాలేదు.
అవును నిజంసుమీ!
వీళ్ళలో చదువరులెందరు
వీళ్ళకు నారచనలు చేరాలంటే
ఇది కాదు మార్గం
మరెన్నో కళారూపాలు తయారు చేయాలి

# కొక్కొరొకో - మేలుకో

- వై.రుక్మాంగదరెడ్డి



కోడిపిల్ల గుండెమీద
ముద్దిడింది గద్దగోరు
వద్దన్నా పెద్దపులితో
సాగించెను లేగపోరు

మరణభయం ఉన్నవాడు
బ్రతికే చచ్చినవాడు
పోరాడుతు చనిపోతే
వీరుడుగా శాశ్వతుడు

కొండలతో తలలను..ఢీ
కొట్టువారు కావాలి
సముద్రాలు ఈదగల్గు
సాహసులు రావాలి.

ఊరకనే సుఖం శాంతి
ఉరికిరావు నీ ముందుకు
త్యాగాలకు సిద్ధపడవొ
ఆహ్వానించరు విందుకు

కుడిచి కూర్చొని మూలన
కునికి పాట్లు పడేజడులు
చేవలేని పేడివాళ్ళు
జీవించుట కనర్హులు

వెరవవలదు ఉరిత్రాళ్ళకు
కరకు తుపాకీ గుళ్ళకు
బూటు కాళ్ళు లాఠీలు
రూటు మార్చుకొనే వరకు

కుళ్లిన ఈ సమాజాన
వేళ్లూనిన చెదును పెరుకు
రేపటి మన ప్రజల కొరకు
శ్రమించిననె సుఖం దొరుకు

# కడుపు తీపి చంపుకుని...?

- ఎస్.ఎం.సుభాని



గంపెడాశలు
గుండెలో నింపుకుని
అమ్మచెప్పిన సుద్దులు
మదిలో తలచుకుని
నలుగురిలో
నడిబజారులో
నిలబడి
మండే ఎండలో
వెండి రంగులో
ధగధగ మెరుస్తూ
ఆంగ్లేయులను తరిమి
స్వరాజ్యం తెచ్చిన
గాంధీరూపంలోకి
పరకాయ ప్రవేశం చేసిన
పసిడి బాల్యం
శరీరం చిటపట మంటున్న
దప్పికై దాహమేస్తున్న
కర్రని ఆసరాచేసుకుని
కదలని శరీరంలో
కదిలే ఉదరాన్ని
ఓదారుస్తూ
నేలపై పరచిన వస్త్రంపై
ఆశతో ప్రసరించే చూపు
రాలే నాలుగు రూపాయలవైపు
ప్రగతి ఫలాలందని
'స్వ' రాజ్యంలో
అణగారిన బతుకుల్లో
కమ్ముకున్న కటిక దారిద్ర్యం
కానరాని....ఆవలి తీరం
కాటేసే
ఆకలి మంటల జ్వాలల్లో
అంతం చేయలేక
"కడుపు తీపి చంపుకుని"
అమ్మ
స్వహస్తాలతో
తన
'కడుపు పంటని'
సిద్ధం చేస్తుంది
యాచనకు

# కొత్త పుస్తకాలు




పంజరంలో స్వేచ్ఛ (కథా సంపుటి)

యాళ్ళ అచ్యుతరామయ్య

వెల : రూ. 75/- పేజీలు : 156

**ప్రతులకు : 9177303231**

యాళ్ళ అచ్యుతరామయ్య కథా నిర్మాణ కీలకాలు కూడా తెలిసినవాడు కావటం వల్లనే మంచి కథలు రాయగలిగినాడు. ఇందులోని కథలన్నీ అతని ప్రతిభను నిరూపించ గలిగినవే! 'బతుక్కి అర్థం', 'నిజ రూప దర్శనం', 'భ్రమ', 'అక్షయ పాత్ర' లాంటి కథలు కొన్ని చాలు, కథను నిర్మించడంలో అతడెన్ని జాగ్రత్తలు పాటిస్తాడో అర్థం చేసుకోవడానికి. వాస్తవికతను ప్రదర్శించడానికి, వ్యంగ్యమూ, అధిక్షేపమూ, హాస్యమూ లాంటి శైలీ శిల్పాలను ఎంత ఒడుపుగా వాడుకుంటాడో ఈ కథల్ని చదివితే అర్థమవుతుంది.

**- సింగమనేని నారాయణ**




కథా వార్షిక 2009

డా॥ వి.ఆర్. రాసాని

మధురాంతకం నరేంద్ర

వెల : 100/- పేజీలు : 109

**ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచ్‌లు**

ఈ కథలు స్థూలంగా మనుషుల లోనూ, మానవ సంబంధాల లోనూ వస్తున్న మార్పుల గురించీ, గత కాలపు మానవ సంబంధాల ఉదాత్తతకు సంబంధించిన పురాస్మృతుల గురించి, సామాజిక దురన్యాయాల గురించి, అభివృద్ధి పేరిట జరుగుతున్న ప్రజల విస్థాపన గురించి, సాగుతున్న అవ్యవస్థను అధిగమించి మనుషుల ఒక కొత్త ప్రత్యామ్నాయ వ్యవస్థను నెలకొల్పుకుంటారనే ఆశ గురించి, ఇంతవరకూ సాహిత్యంలోకి ఎక్కని కొత్త జీవన రంగాల, జీవన దృశ్యాల గురించి, ప్రత్యక్షంగా సమకాలీన ఘటనల గురించి ప్రస్తావించకపోయినా ఆ పునాదిపైననే దీర్ఘకాలిక అమూర్త భావనల గురించి మాట్లాడుతున్నాయి.

**- ఎన్. వేణుగోపాల్**




కొలిమి (కథా సంపుటి)

మేరెడ్డి యాదగిరిరెడ్డి

వెల : రూ. 60/- పేజీలు : 138

**ప్రతులకు : సెల్ 9949415796**

మనిషి మాటలు నేర్చిననాటి నుంచే తను చూసిన సంఘటనలను, విశేషాలను చెప్పడం నేర్చుకున్నాడు. ఆనాటి ఆదిమానవుని కథనంలో నుంచే 'కథ' పుట్టింది. క్రమంగా కథను చెప్పే శిల్పంలో నేర్పు సాధింపబడింది. తీసుకున్న వస్తువును పాఠకులు మెచ్చేటట్లుగా చెప్పడమే కథాశిల్పం. మేరెడ్డిలో శిల్పం కన్నా సమాజాన్ని నగ్నం చేసి చూపించాలన్న నిజాయితీ కన్పిస్తుంది. ఆ గుణమే అతని కథలు చదివింపజేస్తుంది.

**- ముదిగంటి సుజాతారెడ్డి**




తెలుగునాట స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర

పరుచూరి కోటేశ్వరరావు

వెల : 75/- పేజీలు : 221

**ప్రతులకు : 040-27608107**

భారత స్వాతంత్ర పోరాటంపై చాలా గ్రంథాలున్నాయి గాని తెలుగు ప్రజలకు సంబంధించిన పోరాట ఘట్టాలను విపులంగా వర్ణించేవి అందుబాటులో లేవు. స్వయంగా స్వాతంత్ర సమరయోధుల పక్షాన రూపొందించిన ఈ పుస్తకం ఆ లోటు తీరుస్తుంది. రచయితలు ప్రజాస్వామిక ప్రగతిశీల దృక్పథం గలవారు కావడంతో మామూలుగా పొందుపర్చబడని అనేక సంగతులు సందర్భాలు ఇందులో చోటుచేసుకోగలిగాయి.

**- ప్రచురణకర్తలు**




మొలుస్తున్న రెక్కలను ప్రేమిస్తా (కవిత్వం)

అమరజ్యోతి

వెల : 60/- పేజీలు : 73

**ప్రతులకు : 9291444539**

**మరియు అన్ని బుక్‌షాప్‌లు**

నాకు తెలిసినప్పటి నుంచి అమరజ్యోతికి ఉన్న కవిత్వ తపన నాకు తెలుసు. కవిత్వం కూడా పై పై మెరిసే వేషధారణ కాదు, పరిమళించేదని అమరజ్యోతికి తెలుసు కాబట్టే, కవిత్వం పట్ల ఇంత ఆరాటం. ఆ దిశగా తన ప్రయత్నం కొనసాగిస్తూనే ఉంది. అది ఇలా తన మొదటి కవితా సంకలనంగా రూపుదిద్దుకోవటం నాకు చాలా ఆనందంగా ఉంది.

**- ముకుంద రామారావు**




స్త్రీ ఎందుకు బానిసైంది (కథా సంపుటి)

పెరియార్ ఈవే రామస్వామి నాయకర్

వెల : రూ. 20/- పేజీలు : 48

**ప్రతులకు : 040-27608107**

ఈ పుస్తకంలో ఉన్న విషయాలు ఇంత వరకు మన సమాజంలో నెలకొన్న అనేక అభిప్రాయాలను, భావాలను తిరస్కరిస్తాయి. మామూలుగా సామాజిక నియమాలని, నైతిక విలువలని, సదాచారాలని, మత విధానాలని, శాస్త్రాలని పరిగణించే విశ్వాసాలను ఈ పుస్తకం తుత్తునియలు చేస్తుంది. వాటికి పూర్తిగా విరుద్ధమయిన విషయాలను ప్రతిపాదిస్తుంది.

- పెరియార్

# కొత్త పుస్తకాలు

## దూరాల చేరువలో...




డా॥ దిలావర్

వెల : రూ. 100/- పేజీలు : 158

ప్రతులకు : 9866923294

ఆయన ప్రపంచ సాహిత్యాలన్నిటిని ఒక సమాహారంగా చూశాడు. దేశ, భాషా, విభిన్నత్వవే తప్ప మానుష, భావ విభిన్నత్వాలు లేవు. అందుకే ఆయన మొత్తం ప్రపంచ సాహిత్యాన్నీ పారశీకవి రూమీ మొదలుకొని అమెరికాలో యుద్ధ వ్యతిరేక కవిత్వం దాకా ఒక సుదీర్ఘ జీవితాన్వేషణ, సంఘర్షణ, సత్యశోధన ప్రయాణంగా చూశాడు.

- వరవరరావు

## మా కథ





బొలీవియా గని కార్మికోద్యమ నాయకురాలి స్వీయ కథనం

దొమితిలా బారియోస్ ద చుంగార

వెల : 65/- పేజీలు : 197

ప్రతులకు : 040-27608107

దక్షిణ అమెరికా ఖండంలో ఒక చిన్న దేశం బొలీవియా. దాని జనాభా 50 లక్షలు. పేరుకు ఇంత చిన్న దేశమే అయినా అది గని కార్మిక ఉద్యమంతో, దానితో చేయి చేయి కలిపి నడిచిన మహిళా ఉద్యమంతో ఎంతో పేరు సంపాదించు కుంది. అక్కడి తగరపు గనుల్లో మహిళా ఉద్యమాన్ని నడిపిన ఒక నాయకురాలి స్వీయ కథనం ఈ పుస్తకం. ముప్పై సంవత్సరాల బొలీవియన్ ప్రజా పోరాట సంప్రదాయాన్ని ఇది మన కళ్ల ముందు రూపు కట్టిస్తుంది.

- ప్రచురణకర్తలు

## పొద




కదిరె కృష్ణ

వెల : రూ. 50/- పేజీలు : 117

ప్రతులకు : 09963698577

కులం ఒక అబద్ధం. ఓ అభూత కల్పన.
ఇది మన్షుల నిల్వునా చీల్చి
మానవత్వాన్ని ఉప్పు పాతరేసింది.
ఈ కులం ఈ దేశమూలవాసులకు
రికాం లేని దుక్కాన్ని మిగిలిచ్చింది.
బతుకునిండా గాయమైంది.
గిసుంటి అగ్రగండపు కులం పోవాలే
గీదానికి చీలిపోయిన కులాలు మల్ల ఒకటి గావాలె.
గీ బూమి, గీ రాజ్జం ఏలాలే. గీ జీవితాలు తెల్లారాలే...

- ప్రచురణకర్త

## ప్రాప్తం (కథలు)




విహారి

వెల : 125/- పేజీలు : 173

ప్రతులకు : అన్ని బుక్‌షాప్‌లు

బతుకు పుస్తకం లిఖించే కలంలో డబ్బు సిరా బాగా ఉంటే అధ్యాయాలన్నీ ఆనందంగా రొమాంటిక్‌గా సాగుతాయి. ఇంకింకిపోతే అప్పుడు ప్రారంభమవుతాయి అధ్యాయాల్లో కొట్టివేతల తిట్టివేతల తీసివేతలు. బ్రతుకు కథలు అవుతాయి చితుకు వ్యధలు. ఇటువంటి రెండు బతుకు పుస్తకాల్ని రెండు కథలుగా అందించారు. 'విహారి' జె.ఎస్.మూర్తి, సామాజిక 'స్పృహ'తో 'గోరంతదీపం' వెలిగించి, ఆ వెలుగులో 'గుండెలో కోయిల'ల్ని కథల 'అక్షరం'గా మలచి, 'అమ్మ పేరు చీకటి'గా పేరుకుంటూ 'బొంగరం'లా గతిశీలకమైన నడకతో 'కొత్తనీరు'లా ప్రవహిస్తూనే ఉన్న కథనశిల్పి.

- మాకినీడి సూర్యభాస్కర్

## దీపధారి గురజాడ




- డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

వెల : రూ. 35/- పేజీలు : 96

ప్రతులకు : 040-27608107

తెలుగు వైతాళికుడు గురజాడ అప్పారావు రచనా ప్రక్రియలలోని దృక్పథంలోని విలక్షణతను విశిష్టతను సూటిగా సులభంగా వివరించే వ్యాసాల సంపుటి ఇది. గురజాడపై ఇంతవరకూ జరిగిన అధ్యయనాలకు విలువైన జోడింపు. రచయిత ఆచార్య డా॥రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి ప్రభావతీ ప్రద్యుమ్నం నుంచి ప్రపంచీకరణ సాహిత్యం దాక అధ్యయన ప్రస్థానం చేస్తున్న సాహితీ విమర్శకుడు. అంశం పాతదైనా, కొత్తదైనా వర్తమాన కాలమానాలతోనే వివేచించాలనే శాస్త్రీయ ఆలోచన గల విమర్శకుడు.

- ప్రచురణకర్తలు

## మహిళా దృక్కోణంలో కులము - లింగవివక్ష




ఉమా చక్రవర్తి

వెల : రూ. 40/- పేజీలు : 90

ప్రతులకు : 040-27608107

కులము - స్త్రీ బానిసత్వం, కులము - వర్గం - కులపరమైన జీవన విధానం - ఆధ్యాత్మికం, ఇవన్నీ ఒక సంగమ స్థానంలో కలుసుకునే చారిత్రక పరిస్థితులను, సామాజిక నేపథ్యాలను సవివరంగా పాఠకుల ముందు రాసిన ఉమాచక్రవర్తి రాసిన "జెండరింగ్ కాస్ట్ త్రూ ఎ ఫెమినిస్ట్ లైన్" అన్న ఇంగ్లీషు పుస్తకాన్ని భారతి సంస్థ తమిళంలో ప్రచురించింది. ఎ.జి. యతిరాజులు దాన్ని తెలుగులోకి అనువదించారు.

-ప్రచురణకర్తలు

# అల తలపం



'అల' సంస్మరణ సభ

విజయనగరం పట్టణంలోని గురజాడ జిల్లాకేంద్ర గ్రంథాలయంలో డిసెంబర్ 9న సాహితీ సంస్థలు, ప్రజాసంఘాలను కలుపుకొని సాహితీ స్రవంతి 'ప్రజాకవి అల' సంస్మరణ సభను ఏర్పాటు చేసింది. సాహితీ స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ అల సాహిత్యం తప్ప ఎటువంటి వ్యసనమూ లేని వ్యక్తి అని,సాహిత్య సభలకు రాకుండా ఉండలేనటువంటివారన్నారు. కుల వ్యతిరేకి, పూర్తి పేరు చెబితే 'కులం' తెలుస్తుందని పూర్తి పేరు చెప్పడానికి అసహనాన్ని ప్రదర్శించేవారని, ఎంతో నిరాడంబరంగా వుండి, హంగులు, ఆర్భాటాలకు దూరంగా వుండేవారన్నారు. అంతేకాకుండా సన్మానాలను, సత్కారాలను సున్నితంగా తిరస్కరించేవారన్నారు. వామపక్ష భావజాలానికి ఆకర్షితుడై తన జీవిత పర్యంతం ఆ భావజాలాన్ని విడనాడలేదన్నారు. మిత్రుల సహకారంతో నిప్పులవాగు, మట్టి చెట్టు - పిట్ట భజనిక, అలల సవ్వడి అనే స్వీయకవితలను ప్రచురించారని, ఈయన రచనల్లో శ్రమజీవుల, రైతుల యొక్క సాధక బాధకాలు ఎక్కువగా కన్పిస్తాయన్నారు.

యువ స్పందన వ్యవస్థాపకులు డా॥ రామసూరి మాట్లాడుతూ 'అల'కి 50 సంవత్సరాలైన అలల సవ్వడి 100 కాలాలు జీవిస్తుందన్నారు. నిత్య అధ్యయనశీలి దిశా నిర్దేశం గల వ్యక్తని. శ్రీరంగం గోపాలకృష్ణగారిని తన గ్రామానికి తీసుకువచ్చి ఆయనకున్న సంగీతాభిమానాన్ని చాటుకున్నారని, సామాజిక బాధ్యతగల వ్యక్తి అని, నెల్లిమర్ల ఉద్యమంలో జూట్ కార్మికులపై కవిత్వం రాశారని అన్నారు. కవి ఏ రకమైన భావచైతన్యాన్ని కలిగి వుండాలో తెలిసిన వ్యక్తి అని అన్నారు. శ్రీనివాస్ (సిఐటియు) మాట్లాడుతూ ఎర్రజెండాను ప్రేమించిన వ్యక్తనీ, అన్ని రంగాల్లో, సబ్జెక్టుల్లోను పట్టు ఉన్న వ్యక్తనీ చెప్పడమే కాకుండా చేసి చూపినవారని, సరోజిని మహిళా మండలి అధ్యక్షులు ఈశ్వరీమోహన్ మాట్లాడుతూ చాలా చిన్న వయస్సు నుండే కవిత్వం రాసేవారని, అక్షర విజయం, సారా ఉద్యమంలో సహాయ, సహకారాలను అందించడమే కాకుండా యువజన సంఘాల్లో ఉద్యమస్ఫూర్తిని నింపేవారన్నారు.

కౌముది పరిషత్ జక్కు రామకృష్ణ మాట్లాడుతూ కవిత్వాన్ని ప్రేమించి, జీవితాన్ని వదులుకొన్న వ్యక్తి అని, మొదట భావకవి తరువాత తన మార్గాన్ని ఎన్నుకొని ఆ దిశలో పయనించారన్నారు. బుచ్చిబాబు మాట్లాడుతూ సమసమాజ స్థాపనకు కృషి చేశారన్నారు. భీశెట్టి బాబ్జి మాట్లాడుతూ ఈనాడు విలేకరితో జీవితాన్ని ప్రారంభించారని, పతంజలి గారితో అతి సన్నిహితంగా ఉండేవారన్నారు. విజయభాస్కర్ మాట్లాడుతూ అల ఎప్పుడు మాట్లాడినా కవిత్వం గూర్చే మాట్లాడేవారని, సహృదయుడు, సాహిత్యాన్ని శ్వాసగా జీవించారన్నారు. హెచ్ఎంటివి లక్ష్మణరావు మాట్లాడుతూ ఉత్తమమైన వ్యక్తి అని, వార్త రిపోర్టర్గా, జర్నలిస్టుగా, టీచర్గా పనిచేశారని అన్నారు. పి. లక్ష్మణరావు మాట్లాడుతూ నా కవిత్వాలన్నింటికి మార్గదర్శకుడని, అతని సలహాతోనే ఎదుగుదల జరిగిందని అన్నారు.

**మెరుగు** : విజయనగరం గురజాడ వారి స్వగృహంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 9వ 'మెరుగు' డిసెంబర్ 15న జరిగింది. ముందుగా యు.ఎ. నరసింహమూర్తి 'అల'కు నివాళులర్పించి, ఆయనతో ఉన్నటువంటి సాహిత్యానుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. దూరపు గ్రామమైన అన్నంరాజుపేట నుండి వచ్చి సాహిత్య సమావేశాల్లో పాల్గొనడమే కాకుండా సాహిత్య ప్రక్రియలను చర్చింస్తుండేవారన్నారు. సన్యాసిరావు మాట్లాడుతూ ఇప్పటి కవులు, రచయితలు ఆధునిక సాహిత్యం పేరుతో రాస్తున్న వాటిలో సందిగ్ధత కన్పిస్తుందని, దానిని సరిదిద్దుకోవలసిన అవసరం ఎంతైనా వుందన్నారు.

సాహితీ స్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ రాష్ట్ర స్థాయి అవార్డులు పొందిన రాజా చంద్రశేఖర్, మొయిద శ్రీనివాస్, బులుసు సరోజినీదేవి, చింతా అప్పలనాయుడుకు అభినందనలు తెలిపారు. వస్తువు విస్తృతిని పెంచుకొని, చరిత్ర ఆధారంగా రచనలు వచ్చేటట్టు కృషి చేయాలన్నారు. కొత్తపాతల మేలు కలయిక కావాలన్నారు.

24 మంది పాల్గొన్న ఈ చర్చలో హెచ్ఎంటివి లక్ష్మణరావు మతోన్మాదాన్ని ఎండగడుతూ, విశ్వాసాలను అధారం చేసుకొని తీర్పు నిచ్చిన అయోధ్య తీర్పును నిరసిస్తూ (అంధ) విశ్వాసపు దారుల్లో అనే కవితను రాశారు. ఇల్ల ప్రసన్నలక్ష్మి 'మరణ సదృశ్యం' అనే కవితలో ఒక్కోమారు మరణమూ సదృశ్యమే / .... / బంధాలు అనుబంధాల వారధిని ఒక్క ఉదుటున వదిలేస్తూ' అని అలను స్మరించారు. రాజా చంద్రశేఖర్ 'గుండె వెనుక చప్పుడు' కవితలో మాటలు మౌనంగా చిగురు తొడిగే వేళ / హృదయ సంక్లిష్టతలనీ / సందర్భాలతో పోత పోసుకొని / నిట్టూర్చిన దృశ్యాలై వెంటాడటం ప్రారంభిస్తాయని, మొయిద శ్రీనివాస్ 'కడగండ్ల వాన'లో నిన్న రాత్రి నుంచి నింగి / నేలను చినుకుల సూదులతో గుచ్చుతునే ఉంది / భరించలేని భూమి బాధను / రొజ్జగాలి రాత్రంతా మోసుకొస్తూనే ఉంది' అని, బాలసుధాకర్ మౌళి 'ప్రకృతి లీల' , ఐ.సిహెచ్. సత్యనారాయణ 'కులవివక్ష' ఆర్.కె. చౌదరి 'నడక', హృషీకేశం 'చెట్టు', ఇ. పద్మావతి 'ఒక ఉదయం', పి.ఎస్.ఎస్. లక్ష్మి, గౌతంనాయుడు, దేవరాజు గోపాలకృష్ణ తదితరులు కవితలను వినిపించగా, చంద్రిక, శ్రీపాద శ్రీనివాసరావు తమ గానాన్ని వినిపించారు. రెడ్డి శంకర్రావు, రెడ్డి రామకృష్ణ, కృష్ణారావు, హైమవతి, ఎల్.ఐ.సి. రామకృష్ణ, శ్యాసుందర్ మొదలగువారు పాల్గొన్నారు.

సాహితీ స్రవంతి సభ్యులు కె. ఆదిలక్ష్మి మాట్లాడుతూ అలతో పరిచయం తక్కువైనా, ఆయన దగ్గర ఎన్నో సాహిత్య విషయాలను తెలుసుకున్నానన్నారు. పి.వి. రావు, సత్యనారాయణ, సింహాచలం తదితరులు ప్రసంగించారు. అనంతరం 'అల' స్మృతి కవితలను జక్కు రామకృష్ణ, చెళ్ళపిళ్ళ శ్యామల, రెడ్డి శంకర్రావు, రెడ్డి రామకృష్ణ, పి.ఎస్.ఎస్. లక్ష్మి, బులుసు సరోజినీ దేవి, ఇనపకుర్తి చిన సత్యనారాయణ, రాజా చంద్రశేఖర్, మొయిద శ్రీనివాస్', శివ్వాం ప్రభాకర్ కవితలను చదివి వినిపించగా, తూట బాబాజీ, సింహాచలం పాటలను పాడగా ఆదిలక్ష్మి వందన సమర్పణతో సభ ముగిసింది.

**- చంద్రిక**

# శ్రీశ్రీ జయభేరి ఆవిష్కరణ



సాహితీ ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి రచన శ్రీశ్రీ జయభేరి (జీవితం - సాహిత్యం - రాజకీయాలు) పుస్తకాన్ని ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ కేతు విశ్వనాథ్‌రెడ్డి ఆవిష్కరించారు. ఈ కార్యక్రమం నెక్లెస్ రోడ్డు వద్ద గల పీపుల్స్ ప్లాజాలో డిసెంబర్ 21న 'హైదరాబాద్ బుక్ ఫెయిర్' వేదికపై జరిగింది. ఈ సందర్భంగా డాక్టర్ కేతు విశ్వనాథ్‌రెడ్డి మాట్లాడుతూ శ్రీశ్రీ కవిత్వ వారసత్వాన్ని, తాత్విక వారసత్వాన్ని ముందుకు తీసుకువెళ్ళాల్సిన బాధ్యత సాహితీకారులపై ఉందన్నారు. తెలకపల్లి రవి శ్రీశ్రీ జీవితం, సాహిత్య రాజకీయాలపై పరిశోధనాత్మకంగా ఈ పుస్తకాన్ని రాశారని అభినందించారు. విషయ సేకరణ చేయడమే గాక విశ్లేషణాత్మకంగా, ప్రాపంచిక తాత్విక దృష్టిలో రచన చేయడం 'రవి' ప్రత్యేకతని పేర్కొన్నారు. రవి తన అభిప్రాయాన్ని పాఠకులపై రుద్దకుండా 'శ్రీశ్రీ'ని వాస్తవ దృష్టితో పాఠకుల ముందుంచే ప్రయత్నం చేశారన్నారు. ఈ పుస్తకం పరిశోధకులకు మార్గదర్శకంగా ఉంటుందన్నారు. రచయిత తెలకపల్లి రవి మాట్లాడుతూ శ్రీశ్రీ ప్రజల జీవితాన్ని దగ్గరుండి చూసి కవిత్వం రాశారన్నారు. శ్రీశ్రీ ప్రజల పక్షం ఉన్నాడని పేర్కొన్నారు. కవితకు ఓ ఉదాహరణగా శ్రీశ్రీ నిలుస్తాడని ఆయన జీవితం కవులకు మార్గదర్శకమన్నారు. శ్రీశ్రీ సాహిత్య నేపథ్యాన్ని ఈ పుస్తకంలో తాను చర్చించినట్లు పేర్కొన్నారు. శ్రీశ్రీకి ప్రగతిని కోరేవారి పట్ల, ప్రజల పట్ల అపారమైన గౌరవం ఉందన్నారు. ప్రజల జీవితాన్ని దగ్గర్నుండి చూడటం వల్లనే శ్రీశ్రీ కవిత్వంలో గాఢత వుంటుందన్నారు. శ్రీశ్రీ కాలం సృష్టించిన కవి, కాలాన్ని కదలించిన కవి అని తెలకపల్లి రవి అన్నారు. సభకు అధ్యక్షత వహించిన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కె. శివారెడ్డి మాట్లాడుతూ శ్రీశ్రీని అన్ని కోణాల నుండి నిశితంగా పరిశీలించి 'రవి' మంచి పుస్తకాన్ని వెలువరించారని పేర్కొన్నారు.

# పుస్తక పఠనం పెరిగింది




హైదరాబాద్ బుక్‌ఫెయిర్, సాహితీ స్రవంతి సంయుక్త ఆధ్వర్యంలో డిసెంబర్ 21న నెక్లెస్‌రోడ్డులోని బుక్‌ఫెయిర్‌లో పుస్తకం అంశంపై కవి సమ్మేళనం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కె. శివారెడ్డి హాజరయ్యారు. నేడు పుస్తక పఠనం పెరిగిందని, ఐటి విద్యార్థులు సైతం పుస్తకాలు చదవడం అలవాటుగా మార్చుకోవడం శుభపరిణామ మన్నారు. కవిత్వం సృజనాత్మకతను పెంచుతుందన్నారు. నేడు కవులు మంచి కవిత్వాన్ని రాస్తున్నారని, మనిషి వికాసానికి పుస్తకమే కారణమని అన్నారు. కవి సమ్మేళనానికి అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ పుస్తక ప్రియులకు పుస్తక మహోత్సవం ఓ మంచి అవకాశం అన్నారు. ప్రముఖ కవి జె. బాపురెడ్డి మాట్లాడుతూ అక్షర ఆకాశంలో పొడిచిన తొలి పొద్దు పుస్తకం అంటూ కవితను చదివారు. ఈ కవి సమ్మేళనంలో తంగిరాల చక్రవర్తి, పొత్తూరి సుబ్బారావు, ఆచార్య నరేంద్ర, కొంపెల్లి శర్మ, చిమ్మపూడి శ్రీరామమూర్తి, శిష్ట్లా మాధవి. పి. వెంకటదాసు, జావేద్, దుర్గాప్రసన్న, కేతవరపు రాజశ్రీ, ఫణీంద్ర, రాఘవులు, కె.ఎల్. కామేశ్వరరావు, టి. కనకాచారి, ఉత్పల గోపాలరావు, సాహిత్య ప్రకాష్, దుర్గా ప్రసన్న, మహర్షి, జె. అంజయ్య తదితరులు పుస్తకంపై కవిత్వాన్ని చదివి విన్పించారు. కవి సమ్మేళనం ఆసక్తికరంగా సాగింది.

# బుక్ ఫెయిర్‌లో సాహితీవేత్తల చిత్ర ప్రదర్శన



సాహితీస్రవంతి, బుక్‌ఫెయిర్ సొసైటీ ఆధ్వర్యంలో నిర్వహించిన ప్రముఖ సాహితీవేత్తల ఫొటో ప్రదర్శన. చిత్రంలో సాహితీస్రవంతి నగర సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి.
ఈ ఫొటో 'దీప్తిధార' బ్లాగ్ నుండి స్వీకరించబడినది.

25వ హైదరాబాద్ బుక్ ఫెయిర్ డిసెంబర్ 16 నుండి 26 వరకు హైదరాబాద్‌లోని నెక్లెస్ రోడ్ వద్దగల పీపుల్స్ ప్లాజా వద్ద జరిగింది. హైదరాబాద్ బుక్ ఫెయిర్ సొసైటీ, సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ప్రసిద్ధ సాహిత్యవేత్తల ఫొటో ప్రదర్శనను 'అక్షరాంజలి' పేరిట నిర్వహించడం జరిగింది. వొరప్రసాద్, తంగిరాల చక్రవర్తి పర్యవేక్షణలో చేపట్టిన ఈ ప్రదర్శన పుస్తక సందర్శకులను అలరించింది. ప్రముఖ రచయితల చిత్రాలను ఆసక్తిగా చూసి, అమూల్యమైన చిత్రాలను ప్రదర్శనకు ఉంచిన నిర్వాహకులకు అభినందనలు తెలిపారు. సందర్శకులు సాహితీ స్రవంతి వెలువరిస్తున్న ప్రస్థానం పత్రికను చూసి చందాదారులుగా చేరారు. ఇ-తెలుగు నిర్వాహకులు సి. భాస్కర్‌రావు సాహితీస్రవంతి స్టాల్ ఫొటోలు తీసి స్టాల్ వివరాలతో తన బ్లాగ్'దీప్తిధార'లో ఉంచారు. ఈ నిర్వాహణలో సాహితీస్రవంతి నగర కోశాధికారి, వి.వి.ఆర్. శాస్త్రి, నగర అధ్యక్షులు జి. యాదగిరి రావు, సాహితీస్రవంతి నగర ఉపాధ్యక్షులు గేరా, సాహితీస్రవంతి కమిటీ సభ్యులు వెంకటి, కవులు తంగెళ్ళపల్లి కనకాచారి, సత్యభాస్కర్, విప్లవదత్ శుక్లా, కొడిదెల్లి మురళీమోహన్, కృష్ణారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# మీడియా వాస్తవాలను ప్రతిబింబించాలి




**డిసెంబర్ 20 న సుందరయ్య వికాస వేదిక, సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జరిగిన 'మీడియా-సమాజం' సదస్సులో పాల్గొన్న కె. రామచంద్రమూర్తి, కె. నాగేశ్వర్, తెలకపల్లి రవి, వై. సిద్దయ్య**

మీడియా వాస్తవాలను ప్రతిబింబించే విధంగా ఉండాలని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి అన్నారు. సుందరయ్య వికాస వేదిక, సాహితీ స్రవంతి సంయుక్తంగా డిసెంబర్ 20న 'మీడియా – సమాజం' అనే అంశంపై సదస్సు నిర్వహించాయి. ఈ సదస్సులో ఆయన మాట్లాడుతూ వర్తమాన మీడియాలో పెడధోరణులు అధికమయ్యాయన్నారు. ఆకర్షణీయ అంశాలకు ఇచ్చిన ప్రాధాన్యత ప్రజలకు సంబంధించిన వాస్తవిక అంశాలకు ఇవ్వడం లేదని అన్నారు. క్రైం, క్రికెట్, సినిమా, సెలబ్రిటీ, కార్పొరేట్ వంటివి ఇంగ్లీషు అక్షరం 'సి' తో మొదలవుతాయని వీటి చుట్టూ మీడియా తిరుగుతూ అసలైన 'సి' అంటే కామన్ మ్యాన్‌ను పట్టించుకోవడం మానేశాయని ఆందోళన వ్యక్తం చేశారు. ఇక ఇంకో 'సి' అయిన కమ్యూనిజాన్ని మరింతగా నిర్లక్ష్యం చేస్తున్నాయని అన్నారు. మీడియా ఈ సమాజానికి అతీతమైనదేమీ కాదని, వర్తమాన వ్యవస్థకు ప్రతిబింబమే మీడియా అని అభివర్ణించారు. దీన్ని కాకుండా మీడియా నుంచి మరో కోణాన్ని, భిన్నమైన విధానాన్ని ఆశించలేమని అన్నారు. పోటీ, ఆకర్షణ, పాక్షికత్వాలు, తక్షణత్వాలు మీడియాలో ఎక్కువగా చోటు సంపాదించుకుంటున్నాయని తెలిపారు.

ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న హెచ్ఎంటివి సిఇఓ కె. రామచంద్రమూర్తి మాట్లాడుతూ రాజకీయాలు, పదవులను ప్రభావితం చేయడం జర్నలిస్టుల్లో ఏనాటి నుంచో ఉందని అన్నారు. నీరా రాడియా ఉదంతంతో ఈనాడు సంచలనం అవ్వడం తప్ప ఈ ధోరణి కొత్తదేమీ కాదన్నారు. సెక్స్, క్రైం లేకుండా ఛానళ్ళను నడపడం సాధ్యం కాదనే ఒక నమ్మకం ప్రచారంలో ఉందని అన్నారు.

ఎమ్మెల్సీ, ప్రొఫెసర్ కె. నాగేశ్వర్ మాట్లాడుతూ ప్రైవేట్ స్పేస్ ఎంత? పబ్లిక్ స్పేస్ ఎంత? అనేది తేల్చుకోలేనంతగా మీడియా విస్తరించిందని అన్నారు. టెక్నాలజీ పెరిగే కొద్దీ ప్రసార మాధ్యమాల రూపాలు మారుతున్నాయని అన్నారు. సమాచారం డిజిటల్ రూపంలో భద్రపరిచే సాంకేతిక పరిజ్ఞానం పెరిగిందని, అందువల్ల సమాచారాన్ని రహస్యంగా సేకరించే అవకాశాలు కూడా పెరిగాయని అన్నారు. అందుకు ఇటీవల కాలంలో వికీలిక్స్ ఉదంతం ఉదాహరణగా నిలుస్తుందని అన్నారు. వికీలిక్స్ కొన్ని లక్షల రహస్య డాక్యుమెంట్లను సేకరించిందని తెలిపారు. సామ్రాజ్యవాద మీడియా మన దేశ విదేశాంగ విధానాన్ని, ఆర్థిక విధానాన్ని ప్రభావితం చేస్తోందని అన్నారు. ఆ శక్తులు చాలా బలంగా ఉన్నాయని, వాటిని ప్రశ్నించే వాళ్ళు కూడా సిద్ధమవుతున్నారని, అందుకు వికీలిక్స్‌నే మరోసారి ఉదాహరణగా చెప్పుకోవచ్చని పేర్కొన్నారు.

సదస్సు ప్రారంభంలో జరిగిన జనకవనంలో మీడియా అంశంపై కవులు గేరా, జి. యాదగిరి రావు, కిశోర్, మేడిపల్లి భద్రయ్య, కేతవరపు రాజ్యశ్రీ, వొరప్రసాద్, సాహితీ కిరణం మాసపత్రిక సంపాదకులు పొత్తూరి సుబ్బారావు, వెంకటి తదితరులు తమ కవితలను చదివారు. ప్రజానాట్యమండలి కళాకారుడు సైదులు పాడిన పాటలు సభికులను అలరించాయి. సదస్సు చివరలో జరిగిన చర్చలో పలువురు పాల్గొన్నారు. సభికులు అడిగిన ప్రశ్నలకు తెలకపల్లి రవి, కె. రామచంద్రమూర్తి సమాధానాలు చెప్పారు. ఈ కార్యక్రమానికి సుందరయ్య విజ్ఞానకేంద్రం కార్యదర్శి వై. సిద్దయ్య అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో సుందరయ్య వికాస వేదిక కన్వీనర్ వొరప్రసాద్, జి. యాదగిరిరావు, కృష్ణారావు, కిశోర్, శాంతిశ్రీ, నర్సయ్య, ప్రజాశక్తి జర్నలిజం స్కూలు విద్యార్థులు, రచన జర్నలిజం స్కూలు విద్యార్థులు, వివిధ ప్రజాసంఘాల నాయకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

# ఉగాది సాహిత్య పురస్కారాలకు ఆహ్వానం

ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం వారి ఆధ్వర్యంలో ఉగాది సాహిత్య పురస్కారాలు ఇవ్వనున్నట్లు సమితి అధ్యక్షులు కొట్టి రామారావు ఒక ప్రకటనలో తెలిపారు. పద్య, వచన కవితలు, నానీలు, కథ, నవల, సాహిత్య విమర్శ, నాటకరంగం, బాల సాహిత్యంపై ఒక్కొక్క ప్రక్రియకు రూ. 2000/- నగదు పురస్కారానికి 2008–2010 సం॥లలో ప్రచురించబడిన పుస్తకాలు రెండు కాపీలను జి. సత్యనారాయణ (జిసనారా), ప్లాట్ నెం. 56, గ్రీన్ ఫీల్డ్స్ కాలనీ, కానాజీగూడ, తిరుమలగిరి పోస్ట్, సికిందరాబాద్–15 చిరునామాకు 2011, జనవరి 31 లోపుగా పంపించవలసినదిగా కోరారు. ఇతర వివరాలకు 9247412077 ద్వారా సంప్రదించవచ్చును.

# కవితల పోటీకి ఆహ్వానం

శ్రీ తాండ్రపాపారాయ ఫౌండేషన్ ఆధ్వర్యంలో కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఆ సంస్థ అధ్యక్షులు కర్రి సింహాచలం ఒక ప్రకటనలో తెలియజేశారు. రాష్ట్రవ్యాప్తంగా కవులు తమ కవితలను శ్రీ తాండ్రపాపారాయ ఫౌండేషన్, ప్లాట్ నెం. 112, 113, సాయి సిరి స్విమ్మింగ్‌పూల్ క్యాంపస్, నారాయణ అకాడమి వెనుక, వివేకానందనగర్ కాలనీ, కూకట్‌పల్లి, హైదరాబాద్–72 చిరునామాకు జనవరి 21లోపుగా పంపించవలసిందిగా కోరారు. ప్రథమ బహుమతి రూ. 3000/–, ద్వితీయ బహుమతి రూ. 2000/–, తృతీయ బహుమతి రూ. 1000/– నగదు బహుమతిని జనవరి 26న జరిగే ఒక కార్య క్రమంలో అందజేయనున్నట్లు ఆయన తెలిపారు. ఇతర వివరాలకు 9247459152, 9246560349 ద్వారా సంప్రదించవచ్చును.

# 'మీడియాక్రసీ'

మీడియా – డెమోక్రసీ కాకుండా నేడు 'మీడియాక్రసీ' పెరుగుతుందని రాజకీయ విశ్లేషకులు, సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి పేర్కొన్నారు. హైదరాబాద్ బుక్‌ఫెయిర్‌లో 'మీడియా – ప్రజాస్వామ్యం' అనే అంశంపై జరిగిన సదస్సులో ఆయన మాట్లాడుతూ సమాచారం సరుకుగా మారిందని, అది ఎలక్ట్రానిక్ మీడియా ప్రవేశం వల్ల పెరిగిందన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో మార్కెట్ ఎక్కువగా పెరగడం వల్ల ఛానల్ సైతం మార్కెట్‌కు అనుగుణంగా పోటీలో నిలవాల్సి వస్తుందన్నారు. ప్రజాసమస్యల్ని ఎలుగెత్తి తెలియజేస్తున్న పత్రికలు వామపక్ష పత్రికలేనని 'ప్రజాశక్తి' ఎప్పుడు ప్రజల సమస్యల్ని, పోరాటాల్ని ఎక్కువగా ప్రాధాన్యతనిచ్చి ప్రచారం కల్పిస్తుందన్నారు.

ఎలక్ట్రానిక్ ఛానల్స్ సంచలనాలకే ప్రాధాన్యతను ఇస్తున్నాయన్నారు. పత్రిక స్వేచ్ఛ గూర్చి చెప్పే అమెరికా వికీలీక్స్‌పై ద్వంద వైఖరిని ప్రదర్శిస్తుందన్నారు. వ్యవస్థ మూలాల్ని ప్రశ్నించినప్పుడు జర్నలిస్టులు వివాదాస్పదంగా ముద్రవేయబడుతున్నారని ఆయన అన్నారు. మీడియా కార్పొరేటీకరణ అవుతున్న సందర్భంలో మార్కెట్ శక్తుల ప్రభావం మీడియాపై పడుతుందన్నారు. పేదల, పీడితుల సమస్యలు నిర్లక్ష్యం గావించబడుతున్నాయన్నారు. సాంకేతిక పరిజ్ఞానం పెరగడం వల్ల ప్రజలకు సమాచారాన్ని మరింతగా తెలుసుకునే అవకాశం వుందన్నారు. ఎమ్మెల్సీ కె. నాగేశ్వర్ మాట్లాడుతూ పత్రికలకు ప్రజల పట్ల బాధ్యత ఎక్కువగా ఉంటుందన్నారు. సమాజంపై ప్రభావం చూపగల గొప్ప సాధనం మీడియానేనన్నారు. ప్రజలు ప్రశ్నించడం ప్రారంభిస్తే ఫోర్త్ ఎస్టేట్‌లో మార్పు వస్తుందన్నారు. సమాచారంపై పత్రికలు, మీడియా గుత్తాధిపత్యం పోతుంది. ప్రజల పట్ల బాధ్యత లేకుంటే ప్రజలే ప్రత్యామ్నాయ పద్ధతిలో సోషల్ నెట్‌వర్కింగ్ ద్వారా సమాచార పంపిణీ పొందుతారన్నారు. ప్రజా చైతన్యమే మీడియాను మారుస్తుందన్నారు. వ్యవస్థాగత సమస్యను ప్రజలే మార్చాలన్నారు. ప్రముఖ రాజకీయ విశ్లేషకులు కొమ్మినేని శ్రీనివాసరావు (ఎన్‌టివి) మాట్లాడుతూ అమెరికా, చైనాలో జరిగిన ఘటనలు రాజకీయాల డొల్లతనాన్ని బహిరంగ పరుస్తున్నాయన్నారు.

మీడియా ప్రజల పక్షంగా నిలుస్తూ పరిపాలనను సరైన మార్గంలో నడిచేలా దిశా నిర్దేశం చేయడంలో కృషి చేయడం




కన్పిస్తుందన్నారు. జర్నలిస్టుల ప్రమాణాల్ని కొన్ని ఛానళ్ళు, పత్రికలు ఉద్దేశపూర్వకంగా ఉల్లంఘిస్తున్నాయన్నారు. ఆత్మహత్యలు, గుండెపోట్లపై వాస్తవాల్ని మీడియా చెప్పడంలో విఫలమవుతుందన్నారు. సమాజానికి మేలు జరిగేలా మీడియా తన బాధ్యతల్ని నిర్వర్తించాలన్నారు. పత్రికలు ప్రజాస్వామ్య పరిరక్షణలో కీలక భూమిక వహిస్తాయని హైదరాబాద్ బుక్‌ఫెయిర్ అధ్యక్షులు శ్రీనివాసరావు అన్నారు. స్పాన్సర్డ్ వార్తలు నేడు పత్రికల ప్రతిష్టను దెబ్బతీస్తున్నాయన్నారు. ప్రముఖ జర్నలిస్టు దినేష్ (టివి 9) మాట్లాడుతూ జర్నలిస్టులు రాజకీయ నాయకుల్ని వ్యక్తిగతంగా ప్రభావితం చేయలేరన్నారు. వారి రాజకీయ ఉన్నతికి లాబీయింగ్ చేయడం కుదరదన్నారు. 2జి స్పెక్ట్రంలో ఏపి జర్నలిస్టులు లేకపోవడం ఆనందకరం అన్నారు. ఎలక్ట్రానిక్ మీడియాలో ట్రెయినీ జర్నలిస్టుల అవసరం బాగా ఉందన్నారు. మహా టివి సంపాదకులు ఐ. వెంకట్రావు మాట్లాడుతూ ప్రజలే వివిధ ఛానళ్ళు, పత్రికల పట్ల నిష్పక్షపాతంగా అభిప్రాయం చెప్పగలరన్నారు. ఏ పత్రిక, ఏ ఛానల్ ఏ వార్తను, ఏ విధంగా చూపుతుందో ప్రజలు చాలా కచ్చితంగా బేరీజు వేయగలరన్నారు. మీడియా వ్యాపార వస్తువుగా మారడం వల్లే మీడియాలో విపరీత ధోరణులు ఏర్పడుతున్నాయన్నారు. ప్రసార వ్యవస్థ ప్రజాభిప్రాయంపై ఆధారపడే ఉందన్నారు. మీడియాకు రాజకీయ నాయకులకు మధ్య అవాంఛనీయ సంబంధాలు ఉండటం ప్రమాదకరమన్నారు. ప్రజల విచక్షణ చాలా గొప్పదన్నారు. మీడియా పోటీ వల్ల ఒక విషయంపై విభిన్న రకాల విశ్లేషణను ప్రజలు పొందే అవకాశం కల్గుతుందన్నారు. ప్రజల విశ్వాసాన్ని పత్రికలు కోల్పోయే ప్రమాదం ఏర్పడుతుందన్నారు.



మహబూబ్‌నగర్ జిల్లా, వనపర్తిలో నవంబర్ 21న జరిగిన ఘంటశాల గానామృతం 1008 పాటల డివిడి ఆవిష్కరణ దృశ్యం.




అక్షర సాహితీ – సాంస్కృతిక – సేవా పీఠం ఆధ్వర్యంలో రాజమండ్రి, గౌతమీ గ్రంథాలయంలో హిందీ ఉత్సవము–2010 కార్యక్రమ దృశ్యం

# సామాజిక రుగ్మతలను రూపుమాపేది కవిత్వం



ఖమ్మం రూరల్ మండలంలోని కాసిరాజుగూడెం గ్రామంలో డిసెంబర్ 5న "ఆచార్య దేవోభవ" పుస్తకావిష్కరణ సభ జరిగింది. సమాజంలో రుగ్మతలను రూపుమాపడానికి కవిత్వం దోహదపడతుందని, కవిత్వం ఆలోచనకు పదును పెడుతూ, మానసిక ఆనందానికి, మార్పుకు తోడ్పడుతుందని సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె.ఆనందాచారి అన్నారు. లెనిన్ శ్రీనివాస్ కవి రచయితగా, మంచి ఆర్గనైజర్‌గా అతి తక్కువ కాలంలోనే మంచి గుర్తింపు సాధించాడన్నారు. ప్రపంచీకరణ, ఆర్థిక సంస్కరణలు దేశాన్ని చుట్టుముట్టితే వాటి యొక్క భవిష్యత్ పరిణామాలకు స్పందించి కవిత్వం రాసే కవులలో లెనిన్ శ్రీనివాస్ ఒకడని ఉదహరించారు. ప్రముఖకవి సాధనాల వేంకటస్వామి నాయుడు అధ్యక్షత వహిస్తూ - మంచి క్రమశిక్షణ, నిరంతర ప్రజాహితం కోరే కవిత్వంతో సమాజ మార్పు కొరకు లెనిన్ శ్రీనివాస్ కృషి చేస్తున్నారని అన్నారు.

"ఆచార్యదేవోభవ"ను ఆవిష్కరించిన డాక్టర్ రాజేష్‌గార్లె మాట్లాడుతూ సాహితీ స్రవంతి కార్యక్రమాలు నిర్వహణలో లెనిన్ శ్రీనివాస్ ముందుంటారని, తన కోసం కాకుండా ఎదుటి వారి ఎదుగుదలను కోరుకుంటారని అభినందించారు. జిల్లా ప్రధాన కార్యదర్శి రౌతు రవి మాట్లాడుతూ ఈ గ్రామం చైతన్యానికి, పోరాటాలకు పురిటిగడ్డని మంచికంటి రాంకిషన్‌రావు వారసత్వబాటలో లెనిన్ శ్రీనివాస్ పయనం అభినందనీయమన్నారు. పుస్తక పరిచయం చేసిన యం.శేషగిరి అక్షరాభ్యాసం చేసిన గురువును తనదైన రీతిలో గౌరవించడం, సమాజం యెడల నిబద్ధత కలిగివుండడం అన్ని కోణాలను తన కవిత్వంలో సృజించడం గొప్ప విషయమన్నారు. ఈ సభలో నల్గొండజిల్లా నుండి రత్నకుమారి (ప్రత్యూష) కృష్ణాజిల్లా నుండి జి.నరసింహారాజు, సాదిక్ అలీ, పోతగాని సత్యనారాయణ శ్రీమతి వి.సునంద, కన్నెగంటి వెంకటయ్య ప్రముఖన్యాయవాది మద్ది శ్రీనివాస్‌రెడ్డి కొత్తా శంకర్‌రెడ్డి, అమ్మఒడి బాబు, లెనిన్ శ్రీనివాస్‌కు అక్షరాభ్యాసం చేసిన గురువు ఖాజాబహా ఉద్దీన్‌లు పాల్గొన్నారు.




డిసెంబర్, 5వ తేదీన బందరు టౌన్ హాల్లో స్పందన సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలో 'మనిషి కోసం' కవితా సంపుటి ఆవిష్కరణ సభలో ఎడమ నుండి డా॥ జి.వి. పూర్ణచంద్, డా॥ రావి రంగారావు, వి.హరి, శ్రీమతి రమ, గుత్తికొండ సుబ్బారావు, మండలి బుద్ధప్రసాద్, ప్రొ. ఎం.కె. దుర్గాప్రసాద్, కొట్టి రామారావు. డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు ఉన్నారు.




డిసెంబర్ 10న రవీంద్రభారతిలో జరిగిన **2009, 2010** సం॥రాల రంజని - కుందుర్తి అవార్డుల సభలో మాట్లాడుతున్న నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, వేదికపై డా॥ నాళేశ్వరం శంకరం, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సినారె



నవంబర్ 13న హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో జరిగిన మౌనీలు (నానీలు) పుస్తకావిష్కరణ దృశ్యం. చిత్రంలో పుస్తక రచయిత డాక్టర్ మౌని, డా.సి. నారాయణరెడ్డి, డా. గోపి, సుధామ, కె.బి. లక్ష్మి తదితరులు



డిసెంబర్ 12న కడపలో వై.ఎస్.ఆర్. జిల్లా పరిషత్ హాలులో జరిగిన లలిత కళ్యా విలాసం పుస్తకావిష్కరణ. చిత్రంలో (కుడివైపు నుంచి) సుధా మల్లికార్జునరావు, చాట్ల శ్రీరాములు, సుత్తివేలు, శ్రీమతి దేవిరెడ్డి జ్యోతిరెడ్డి, ఆచార్య అర్జుల రామచంద్రారెడ్డి, డాక్టర్ మూల మల్లిఖార్జునరెడ్డి, డాక్టర్ డి.ఎల్. రవీంద్రారెడ్డి, శశిభూషణ్ కుమార్, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, శశిశ్రీ

## ఘంటసాల సంగీత సామ్రాట్




డిసెంబర్ 4న ఘంటసాల 88వ జయంతిని చెన్నైలోని జనని సాంఘిక, సాంస్కృతిక సమితి ఆధ్వర్యంలో నిర్వహించారు. కొడుంగయూరు సీతారామనగర్ తెలుగు ప్రజా సంక్షేమ సంఘంలో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమంలో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ (చైన్నై) మాజీ డెప్యూటీ మేనేజరు కిడాంబి లక్ష్మీకాంత్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. రెప్‌కో బ్యాంకు జనరల్ మేనేజరు (టీ. నగర్) వంజీరపు శివయ్య అధ్యక్షత వహించారు. లక్ష్మీకాంత్ మాట్లాడుతూ ఆయన కంఠంలోని మాధుర్యం వీనుల విందుగా ఉంటుందని చెప్పారు. ఆయన పేదరికం నుంచి ఎంతో ఎత్తుకు ఎదిగిన కృషీవలుడని కితాబునిచ్చారు. అన్నమాచార్యునికి పదకవితా పితామహుడు అనే బిరుదు ఇచ్చినట్లు ఘంటసాలకు సంగీత పితామహుడు బిరుదు ఇవ్వాలని అభిప్రాయపడ్డారు. ఈ సందర్భంగా ఘంటసాల గురించి పద్యం పాడారు. ఆయన కంఠం నుంచి జాలువారిన నాలుగైదు మధుర, విషాద గీతాలు ఆలపించి ఆహూతులను అలరించారు. భారతి మహిళా కళాశాల తెలుగు శాఖ మాజీ అధ్యక్షురాలు డాక్టర్ నిర్మలా పళనివేలు మాట్లాడుతూ త్యాగరాజు, అన్నమయ్య కీర్తనలు ఇప్పటికీ ప్రాచుర్యంలో ఉన్నాయని, అదేవిధంగా ఘంటసాల పాడిన పాటలు ఎన్నటికీ మరుపురానివని పేర్కొన్నారు. రచయిత పదాలకు జీవం పోసి ప్రజల మనస్సులను దోచుకున్న మహనీయుడు అని కొనియాడారు. వంజీరపు శివయ్య మాట్లాడుతూ ఘంటసాల జయంతిని ఆంధ్రప్రదేశ్‌లో ఘనంగా జరుపుకుంటారని చెప్పారు. చెన్నైలోనూ జరుపుకోవడం ఆనందకరమని పేర్కొన్నారు. ఆయన కష్టపడి సంగీతం నేర్చుకుని, మధుర స్వరంతో ప్రజలను తన్మయత్వంలో ముంచిన సంగీత సామ్రాట్ అని వ్యాఖ్యానించారు. మురళీకృష్ణ మాట్లాడుతూ పదాలకు, సంగీతానికి ప్రాణం పోసిన చిరస్మరణీయుడు ఘంటసాల అన్నారు. సుబ్రమణ్యం మాట్లాడుతూ అక్షరాలు పొల్లుపోకుండా పలకడంలో ఆయనకు ఆయనే సాటి అన్నారు. సీతారామనగర్ తెలుగు ప్రజా సంక్షేమ శాఖ కార్యదర్శి కుటుంబరావు మాట్లాడుతూ ఘంటసాల పాటలు మధురానుభూతిని కలిగిస్తాయని, ఆయనది కంచుకంఠమని కొనియాడారు. జనని ప్రధాన కార్యదర్శి గుడిమెట్ల చెన్నయ్య స్వాగతం పలికి, వ్యాఖ్యాతగా వ్యవహరించారు. ఈ సందర్భంగా ఘంటసాల పాటల మాధుర్యాన్ని గుర్తుకుతెచ్చారు. మురళీకృష్ణ, మల్లిక పాడిన నన్ను దోచు కుందువటే వన్నెల దొరసాని అనే పాట అందరిని అలరించింది.

## ప్రజాసాహితి కార్యాలయ నిర్మాణానికి సహకారానికై విజ్ఞప్తి

ప్రజా సాహితీ ప్రధాన సంపాదకులు కొత్తపల్లి రవిబాబు ప్రజాసాహితీ పత్రిక స్వంత కార్యాలయం ఏర్పాటుకు చేయూతనివ్వవలసిందిగా ఒక ప్రకటనలో కోరారు. ఆ ప్రకటనలో రచయితలు, కళాకారులు, సాహిత్యాభిమానులు తోడ్పాటు నందించవలసిందిగా కోరుతూ పలువురు రచయితలు సంతకాలు చేశారు. వివరాలకు 9490196890 సంప్రదించగలరు.

## సాహిత్య పురస్కారానికి ఆహ్వానం

గుంటూరు జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో తెలుగు సాహిత్యంలో కథ, కవిత, విమర్శ, గేయం తదితర ప్రక్రియలలో ఏదేని ఒక ప్రక్రియలో ప్రతిభను ప్రదర్శించిన ఇద్దరికి ప్రతి సంవత్సరం పురస్కారం అందజేయనున్నట్లు సంఘం అధ్యక్ష కార్యదర్శులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య, కోసూరి రవికుమార్ ఒక ప్రకటనలో తెలిపారు. 'గుంటూరు జిల్లా రచయితల సంఘం సాహిత్య పురస్కారం' పేరిట ఒక్కొక్కరికి రూ.5000/- చొప్పున ఇద్దరికి ఇవ్వనున్నట్లు తెలిపారు. ఈ సంవత్సరం కథా ప్రక్రియకు ఇవ్వాలని నిర్ణయించారు. 2010 జనవరి 1 నుండి డిసెంబర్ 31వ తేదిలోపు ప్రచురింపబడిన కథా సంపుటాలను ఇందుకోసం పంపించవలసిందిగా కోరారు. జనవరి 31వ తేదీలోపు నాలుగు ప్రతులను కోసూరి రవికుమార్, ప్రధాన కార్యదర్శి, గుంటూరు జిల్లా రచయితల సంఘం, దాచేపల్లి పోస్టు & మండలం, గుంటూరు జిల్లా, పిన్- 522 414కు పంపించ వలసిందిగా విజ్ఞప్తి చేశారు. ఇతర వివరాలకు 9440214705, 9490776184 ద్వారా సంప్రదించవలసిందిగా కోరారు.

## కథ, కవిత, నవలా పురస్కారాలకు ఆహ్వానం

కడప కవిత విద్యా సాంస్కృతిక సేవాసంస్థ ఆధ్వర్యంలో 'గురజాడ' కథా పురస్కారం, 'శ్రీశ్రీ' కవితా పురస్కారం, 'కందుకూరి' నవలా పురస్కారం ఇవ్వనున్నట్లు సంస్థ అధ్యక్షులు అలపర్తి పిచ్చయ్య చౌదరి ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారం క్రింద మూడువేల రూపాయల నగదును ఇచ్చి సత్కరించనున్నట్లు తెలిపారు. కవులు, రచయితలు తమ కథ, కవితా సంపుటలను రెండేసి ప్రతులను అబ్బిగారి రాజేంద్ర ప్రసాద్, యల్.యఫ్.యల్. హెడ్మాస్టర్, మండల పరిషత్ పాఠశాల, అనంతరాజు పేట పోస్టు, రైల్వే కోడూరు మండలం, వై.యస్.ఆర్. జిల్లా, పిన్- 516 105 చిరునామాకు పంపించ వలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9000358012 ద్వారా సంప్రదించవలసిందిగా విజ్ఞప్తి చేశారు.

## 'ఆవరణం' కు వ్యాసాలు రాయండి!

ప్రముఖ సాహితీవేత్త, బయాలజీ ప్రొఫెసర్ డాక్టర్ దేవరాజు మహారాజు వ్యక్తిత్వం, సాహిత్యం అంశాల ఆధారంగా మిత్రులు, అభిమాన పాఠకులు, విద్యార్థులు వ్యాసాలు పంపించవలసిందిగా అంబికానంద్ ఒక ప్రకటనలో కోరారు. 'ఆవరణం' పేరుతో ప్రత్యేక సంచిక వెలువరించనున్నట్లు ఆయన తెలిపారు. అర్ధశతాబ్ది (1960-2010) కాలంగా సాహిత్య.పాపులర్ సైన్స్ రంగాలలో దేవరాజు మహారాజు చేస్తున్న కృషి అందరికీ తెలిసిందేనని తెలిపారు. వ్యాసాలను నెల రోజుల లోపు అంబికానంద్, 101, భావ్య బాలాజీ టవర్స్, సాయినాథపురం, ఎ.ఎస్. రావు నగర్, సికింద్రాబాద్- 500 062 చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9247125509 ద్వారా సంప్రదించవచ్చు.



నవంబర్ 28న నెల్లూరులో జరిగిన సభలో శ్రీమతి సోమిరెడ్డి జమున స్మారక అవార్డును పసనకర్ల ప్రకాష్‌కు అవార్డు అందజేస్తున్న ఈతకోట సుబ్బారావు, శేషారెడ్డి, శ్రీమతి పెళ్ళకూరి జయప్రద, డా॥ ఎన్.గోపి, శ్రీమతి అరుణ, శ్రీమతి పాతూరి అన్నపూర్ణ, శ్రీమతి కోవూరి పుష్పాదేవి



డిసెంబర్ 4న సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్‌లో జరిగిన యాళ్ళ అచ్యుతరామయ్య కథా సంపుటి 'పంజరంలో స్వేచ్ఛ' పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో తెలకపల్లి రవి, కేతు విశ్వనాథ రెడ్డి ఓల్గా, దుప్పల రవికుమార్, యాళ్ళ అచ్యుతరామయ్య, అచ్యుత లక్ష్మి, శ్రీమతి గుండుబిల్లి వెంకట జయలక్ష్మి, వెంకట రమణమూర్తి

# అంపశయ్య నవీన్‌కు గోపీచంద్ జాతీయ సాహిత్య పురస్కారం

ప్రఖ్యాత తెలుగు నవలాకారుడు త్రిపురనేని గోపీచంద్ పేరు మీద నెలకొల్పబడిన జాతీయస్థాయి సాహిత్య పురస్కారాన్ని డిసెంబర్ 4న హైదరాబాద్ త్యాగరాయ గానసభలో జరిగిన పురస్కార ప్రధానోత్సవ సభలో సుప్రసిద్ధ తెలుగు నవలాకారుడు అంపశయ్య నవీన్‌కు ప్రదానం చేశారు. ఈ సభ హైదరాబాద్‌కు చెందిన సాహిత్య, సాంస్కృతిక సంస్థ యువ కళావాహిని వారి ఆధ్వర్యంలో జరిగింది. ఈ ప్రదానోత్సవ సభకు సాహిత్యాభిమాని ప్రముఖ పారిశ్రామికవేత్త సారిపల్లి కొండలరావు అధ్యక్షత వహించగా కర్ణాటక మాజీ గవర్నర్ శ్రీమతి వి.ఎస్ రమాదేవి ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. రచయిత అమ్మంగి వేణుగోపాల్ అంపశయ్య నవీన్‌ను సభకు పరిచయం చేశారు. సినిమా నటుడు గోపీచంద్ కుమారుడు సాయిచంద్ జాతీయ సాహిత్య పురస్కారాన్ని గూర్చి వివరించారు. 2007వ సంవత్సరం నుండి గోపీచంద్ అవార్డును జాతీయస్థాయిలో ప్రదానం చేస్తున్నామని, అంతకు ముందు ఈ అవార్డును రాష్ట్ర స్థాయిలో మాత్రమే ఇచ్చేవారమని, 2007లో ఈ పురస్కారాన్ని తమిళ రచయిత్రి శివశంకరికి, 2008లో ఒరియా రచయిత ప్రతిభారాయ్‌కి, 2009లో బెంగాలీ రచయిత్రి మహాశ్వేతాదేవికి ప్రదానం చేశామని చెప్పారు. జాతీయస్థాయి అవార్డుగా మార్చాక ఈ అవార్డును గెల్చుకున్న మొట్టమొదటి తెలుగు రచయిత అంపశయ్య



గోపీచంద్ జాతీయ సాహిత్య పురస్కారం అందుకుంటున్న అంపశయ్య నవీన్

నవీన్‌గారని తెలియజేశారు. అంపశయ్య నవీన్‌కు ప్రశంసాపత్రాన్ని, జ్ఞాపికను ప్రదానం చేస్తూ దుశ్శాలువతో సన్మానించారు. తనకు గోపీచంద్ అభిమాన రచయిత అనీ, ఆ మహా రచయిత పేరుమీద స్థాపించబడిన ఈ జాతీయ అవార్డు తనకు లభించినందుకు చాలా సంతోషిస్తున్నానని, గోపీచంద్ రచించిన "అసమర్థుని జీవయాత్ర" నవల ప్రభావం తను రచించిన అంపశయ్య మీద ఉందని తెలియజేశారు. హైదరాబాద్ నగరంలోని ఎందరో సాహిత్యాభిమానులు ఈ ప్రదానోత్సవ కార్యక్రమానికి హాజరై అంపశయ్య నవీన్‌కు తమ అభినందనలు తెలియజేశారు. యువ కళావాహిని అధ్యక్షుడు వై.కె నాగేశ్వరరావు అందరికి కృతజ్ఞతలు తెలియజేశారు.

# గొడ్డండి సుబ్బమ్మ స్మారక సాహితీ పురస్కారము

"గొడ్డండి సుబ్బమ్మ స్మారక సాహితీ పురస్కారము" పేరిట తాడికొండ (గుంటూరు జిల్లా) వారు నిర్వహించిన వచన కవితా ప్రక్రియ "రెక్కలు" పోటీ ఫలితాలను సంస్థ అధ్యక్షులు గొడ్డండి రంగారావు ఒక ప్రకటనలో తెలిపారు. 16 జిల్లాల నుండి 58 ఎంట్రీలు వచ్చినట్లు తెలిపారు. "రెక్కలు" రూప శిల్పి యం.కె సుగంబాబు, జయపతాక సంపాదకులు శ్రీనివాస్‌గౌడ్, 'మల్లెతీగ' మాసపత్రిక సంపాదకులు కలిమిశ్రీలు న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించినట్లు తెలిపారు. రూ.1100/- వంగర పరమేశ్వరరావు, పేరాల - ప్రథమ బహుమతి రూ.550/- త్యాగదుర్గం మౌని, తిరుపతి - ద్వితీయ బహుమతి. రూ.275/-, శ్రీమతి జి. పద్మకళ, విజయవాడ - తృతీయ బహుమతి, శ్రీమతి ఆవుల జయప్రద, అమిద్యాల - తృతీయ బహుమతి మరో 14 మందికి ఉత్తమ రచనల బహుమతులు, నిర్ధారిత రచనా ప్రమాణాలున్న వారికి ప్రోత్సాహక బహుమతులకు గాను ప్రమాణ పత్రములను, ప్రశంసాపూర్వకముగా ప్రదానము చేస్తున్నట్లు తెలిపారు.



డిసెంబర్ 5న కరీంనగర్‌లో జరిగిన సభలో 2010 కి గాను సి.నా.రె పురస్కారాన్ని ప్రముఖ కవి కందుకూరి శ్రీరాములుకు "రావురూకుల" కవితా సంపుటికి గాను ప్రధానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ విజయేందర్ రెడ్డి, పొట్టి శ్రీరాములు తె.వి.వి. ఉపకులపతి ఆచార్య హనుమాండ్ల భూమయ్య, నేటి నిజం సంపాదకులు బైస దేవదాస్, డా॥ బోయినపల్లి వెంకట రామారావు, సాహితీ గౌతమి అధ్యక్షులు మాడిశెట్టి గోపాల్ తదితరులు



నవంబర్ 28న ఒంగోలు ఎస్.వి.యస్. కళ్యాణ మండపంలో "విశ్వశాంతి సేవా సమితి" ఆధ్వర్యంలో జరిగిన రాష్ట్ర స్థాయి పద్య కవి సమ్మేళనంలో యల్లాప్రగడ చిరంజీవి రచించిన "చిరుజల్లులు" పుస్తక ఆవిష్కరణ సభ. చిత్రంలో సంస్థ వ్యవస్థాపక అధ్యక్షురాలు కమలపాటి వెంకట శాంతలక్ష్మి, విశిష్ట అతిథి సి.ఎస్.ఎల్.కె. నరసింహరాజుగారు, శిద్దా వెంకటేశ్వరరావు, చలువాది బదరీ నారాయణ, డి.వి.ఎస్. రామాచార్యులు ఉన్నారు.



తూర్పుగోదావరిజిల్లా కొత్తపేట గ్రంథాలయ పాఠకుల సమాఖ్య ఆధ్వర్యంలో బండి ప్రసాదరావు కవిత్వం "మిణుగురులు" ఆవిష్కరణ సభ. ఆవిష్కర్త డా॥ అద్దేపల్లి రామమోహనరావు. చిత్రంలో (ఎడమ నుంచి) కళా సాహితీ అధ్యక్షులు పి. హరి హరదేవళరావు, రెవ॥ జోసెఫ్, బీరా, డా॥ బండి శామ్యూల్, డా॥ అద్దేపల్లి, సమాఖ్య అధ్యక్షుడు జి. సుబ్బారావు, పెన్షనర్ల సంఘ ప్రధాన కార్యదర్శి ఎ.వి. సుబ్బారావు, కవి ప్రసాదరావు, రొటేరియన్ చామకూర నాగేశ్వరరావు



నవంబర్ 28న నెల్లూరులోని స్థానిక ఐ.యమ్.ఎ. ఎ.సి. హాలులో డాక్టర్ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి నవల 'ఆమె' ఆవిష్కార సభ. చిత్రంలో విశ్రాంత వైస్ ఛాన్సలర్ డా.యన్.గోపి, కవయిత్రి అరుణ, ఈతకోట సుబ్బారావు, పనసకర్ల ప్రకాశ్, కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి, ఆచార్య యన్. డాక్టర్ పెళ్ళకూరు జయప్రద, పాతూరి అన్నపూర్ణ, కాపూరి పుష్పాదేవి



నవంబర్ 28న మార్కాపురం నెల నెలా వెన్నెల సాహితీ వేదిక ఆధ్వర్యంలో "మనుచరిత్ర – మార్గ నిర్దేశనా కావ్యం అను అంశంపై ఒంగోలుకు చెందిన ప్రముఖ అవధాని నారాయణం బాలసుబ్రహ్మణ్యం ప్రసంగించారు.



హైదరాబాద్ నగర కేంద్ర గ్రంథాలయంలో మానస ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో నవంబర్ 14న జరిగిన సభలో "అంబల్ల జనార్దన్ కథలు – సవిమర్శక పరిశీలన" గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ఆచార్య అనుమాండ్ల భూమయ్య, చిత్రంలో రఘుశ్రీ, డా॥ పిల్లలమర్రి రాములు, శరత్ జ్యోత్స్నారాణి, ఆచార్య ననుమాస స్వామి, ఎం.వి. రామిరెడ్డి, అంబల్ల



ముంబయి ఎవర్‌షైన్ బ్యాంకెట్స్‌లో ఇటీవల సుజంబ కళాపీఠం ఆధ్వర్యంలో అంబల్ల జనార్దన్ షష్టిపూర్తి సందర్భంగా వెలువరించిన "వ్యాసగుచ్ఛం" ముంబయ్ ఛాట్ భేల్ గ్రంథాలను ఆవిష్కరిస్తున్న సాహితీ ప్రముఖులు డా॥ ద్వానాశాస్త్రి, గుడిపాటి. చిత్రంలో కిరణ్‌కుమార్, అధ్యక్షులు రఘుశ్రీ, గ్రంథకర్త అంబల్ల



"మారుతున్న విలువలు – సమకాలీన సాహిత్యం" పరిచయ సభ ఎమెస్కో భవన్‌లో జరిగింది. డా॥ దేవరాజు మహారాజు అధ్యక్షత వహించగా పి.సి. రాములు (థింసా), విహారి, బొజ్జ తారకం ప్రసంగించారు. నిఖిలేశ్వర్ ప్రతిస్పందన తర్వాత డా॥ చంద్రశేఖర్‌రెడ్డి (ఎడిటర్ – ఎమెస్కో) వందన సమర్పణ చేశారు



హిందీ – తెలుగు సాహితీవేత్త స్వర్గీయ ఆచార్య భీమసేన్ నిర్మల్ 80వ జయంతి సందర్భంగా హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడమీలో జరిగిన కార్యక్రమంలో నిర్మల్‌గారి అమ్మాయి డా॥ బి. వాణి అనువాద గ్రంథం 'దేవయాని'ని ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి. చిత్రంలో ప్రొఫెసర్ బి.వి.ఎస్. మూర్తి, ప్రొఫెసర్ తేజస్వి కట్టా మణి, డా॥ ఎన్. గోపి, డా॥ బి. వాణి, డా॥ పి. విశ్వనాథ, ప్రొఫెసర్ టి. మోహన్‌సింగ్



హరిత అసోసియేషన్, పాలమూరు సాహితీ సంయుక్త ఆధ్వర్యంలో నవంబర్, 21వ తేదీన పాలమూరులో ఆచార్య ఎస్వీ రామారావు రచించిన "పాలమూరు సాహితీ వైభవం" ను ఆవిష్కరిస్తున్న జిల్లా కలెక్టర్ ఎం. పురుషోత్తమరెడ్డి, చిత్రంలో ఎమ్మెల్యే రాజేశ్వర్‌రెడ్డి, కపిలవాయి లింగమూర్తి, దుప్పల్లి శ్రీరాములు, టి.వి. భాస్కరాచార్య, మాది రాజ హరినందన్‌రావు, భీంపల్లి శ్రీకాంత్



రమ్య సాహితీ సమితి, పెనుగొండ వారి జాతీయ స్థాయి ఉత్తమ కథా సంపుటిగా ఎంపికైన 'గూటి పడవ' కథల సంపుటి రచయిత వడలి రాధాకృష్ణకు పురస్కార ప్రదానం చేస్తున్న పి.వి. సునీల్‌కుమార్, ఐపిఎస్, డా॥ కలిదిండి రామచంద్రరాజు, ఎం.ఆర్.వి. సత్యనారాయణ మూర్తి తదితరులు



ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్‌లో ఆచార్య మసన చెన్నప్ప రచించిన 'అసందుక', 'అమెరికా ఓ అమెరికా', 'నయాగరా' మరియు 'బృహద్గీత' గ్రంథాలను ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి ఈ కార్యక్రమంలో యెల్డి సుదర్శన్, డా॥ తిరునగరి, ద్వా.నా. శాస్త్రి, ఆచార్య కసిరెడ్డి, ఆచార్య రవ్వా శ్రీహరి, ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, గంగాధర్, ఉపేందర్

# చాలా నేర్పే కథ ... ఓ బొట్ల కోడి



ఇరవై ఒకటో శతాబ్దం. మనిషి అన్ని రంగాలలో నేడు ముందున్నాడు. మనిషి సాధించలేనిదంటూ నేడు ఏదీ లేదు. కొద్ది గంటలలో మనిషి మరణిస్తున్నాడన్న విషయం తెలిసి డాక్టరు తన వైద్యంతో కనీసం కొన్ని నిమిషాలైనా ప్రాణాన్ని నిలబెట్టగలుగుతున్నాడు. సంతానం కలగని వారికి టెస్ట్ ట్యూబ్ బేబీలు సృష్టించబడ్డాయి. మళ్ళీ ఇందులో పుట్టబోయే బిడ్డ ఎలాంటి లక్షణాలు కలవారుగా ఉండాలో ముందుగానే నిర్ణయించే స్థాయిలో సైన్స్ అభివృద్ధి చెందింది.

మట్టిలో పుట్టిన మనిషి మట్టిలో కలసిపోయే వరకు ఈ మన్ను పైనే నడయాడతాడు. అలాంటి మనిషి ఆలోచనలో మార్పు వచ్చి నీటి లోపల, బయట, వాయు మార్గంలో సంచరించే స్థాయికి ఎగబాకాడు. అంటే మనిషి మెల్లమెల్లగా పరిణతి వైపు అడుగులు వేగంగా వేయగలుగుతున్నాడని అర్థమవుతుంది. వాయు మార్గం వరకు మాత్రమే మనిషి సరిపెట్టుకోలేదు. చంద్రమండలం, నక్షత్రాలు, ఇలా సృష్టి, ప్రతిసృష్టి రహస్యాలు తెలుసుకొని నూతన ఆలోచన మార్గాలకు ద్వారాలు తెరిచాడు. నేడు మన కళ్ళ ముందు ఉన్న దాంట్లో సగభాగం వరకు మానవుని ఆలోచనల కల్పితమే అనడంలో ఎలాంటి సందేహం లేదు. శాస్త్ర, సాంకేతిక రంగాలలో ఇంకా రాబోయే ఓ ఇరవై, ముప్పై సంవత్సరాలలో నేడు ఉన్నదేది నాడు ఉండదు. ఒకవేళ ఉన్నదానిని గూర్చి నేడు మనం చెప్పుకుంటున్న సింధు నాగరికత, పురాతన యుగంలో మానవుడు ఎలా వుండేవాడు? వాడి జీవన విధానం ఏమిటి? నివాసం ఏమిటి? అని ఇలా ఎలాగా తెలుసుకుంటున్నామో!! నేటి పరిస్థితులను, నాగరికతను అలాగే తెలుసుకుంటాము. ఇందులో పురాతన యుగంలోని విశేషాలు మనకు ఎలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయో, నేటి విషయాలుకూడా రాబోయే కాలంలో వచ్చే తరం వారికి వింతలుగానూ, విడ్డూరాలుగానూ కన్పిస్తాయి. ఆ విషయానికి వస్తే మనిషికి మనిషే కొత్తగాను, వింతగాను కన్పిస్తాడు. ఇలా ఎప్పుడో ఓ ముప్పై లేదా నలభై సంవత్సరాలలో కనిపించే వింతలే నేడు కనిపిస్తున్నాయి. నాడు మనిషి క్రూర జంతువులకు, విషజీవులకు భయపడేవాడు. కాని నేడు మనిషిని చూసి మనిషే భయం, భయంగా బ్రతకవలసి వస్తుంది. నాడు ఆవు పులి కథలో పులికున్న ఉదార స్వభావం నేడు మనుషులకు లేదు.

అనగనగా ఓ కోడిపెట్ట కథలో పెద్దింటి అశోక్ కుమార్ బొట్ల పెట్ట పాత్ర ద్వారా మానవీయ విలువలు నేడు ఎలా దిగజారుతున్నాయో కళ్ళకు కట్టినట్లు వివరించారు. ఆకలితో ఉన్న పిల్లలకు నూకలను ముక్కుతో ఎలా బుక్కాలో తెలియని పిల్లలకు దగ్గరుండి నేర్పుతుంది తల్లి. "అమ్మా... కడుపు నొత్తందే....' అని ఒక పిల్ల అంటే తల్లి మనస్సు కాబట్టి ఈ "నీళ్ళు తాగు బిడ్డా నొప్పి తగ్గి పోతుంది" అని చెబుతుంది. దగ్గరుండి నీళ్ళను ఎట్లా తాగాలో నేర్పుతుంది.

మరి నేడు తల్లితండ్రులు పిల్లలతో ఎలా ఉన్నారు? పిల్లలు తల్లి తండ్రులతో ఎలా ఉంటున్నారు. తండ్రిని చంపిన తనయుడు? తల్లిని నరికి చంపి తలను సైకిల్‌పై పెట్టుకు తిరిగిన కన్న కొడుకు. కన్న పిల్లల పట్ల మృత్యువుగా మారిన కన్నతల్లి. ఇలా ఎన్నో వార్తలను సందర్భాలు ఏవైనా, సమస్యలు ఏమైనా ఏదో సందర్భంలో మనం వింటూనే ఉన్నాం. చూస్తూనే ఉన్నాం. మొన్నటికి మొన్న మహబూబ్ నగర్ అడ్డాకుల గ్రామంలో కన్నకొడుకే తండ్రిని అందరూ చూస్తూ ఉండగానే గొడ్డలితో నరికి చంపాడు. ఓ తల్లి తనకు పుట్టిన ఇద్దరు కవల పిల్లలలో ఓ బిడ్డ ఆడ శిశువు కావడంతో భరించలేకపోయింది. మగబిడ్డను ఉంచుకుని ఇంకా లోకం చూడని పసికందును బాత్రూమ్ కిటికీల గుండా విసిరివేయగా ఆ పసికందును కుక్కలు, పందులు ఆహారంగా పంచుకున్నాయి.

కాని అశోక్ కుమార్ 'బొట్ల పెట్ట' (తల్లి) తన పిల్లలను కంటికి రెప్పలా కాపాడుతుంది. వారి తప్పులను సరిచేస్తుంది. తన రెక్కలను చాపి పిల్లలను చలి నుండి, శత్రువుల నుండి రక్షించు కుంటుంది. ఇది మాతృప్రేమంటే. చెట్టుకు కాయలు బరువు కావు. అలాగే తల్లికి బిడ్డలు బరువు కారు. ఎన్నటికి కాకూడదు కూడా (అసలు అలా ఆలోచన రావడమే మూర్ఖత్వం). పిల్లలకు ఎత్తు, పల్లాలను ఎలా ఎక్కాలో, దిగాలో నేర్పుతుంది. బొట్ల పెట్ట. పిల్లి మనకు శత్రువని దానిని చూసి జాగ్రత్తగా దాక్కోవాలని చెబుతుంది. అమ్మా... ఎందుకే? ఎందుకు దాక్కోవాలెనే?...." అని అమాయకంగా అడిగిన పిల్లలకు "అదంతే... లోకం తీరు. చిన్న జాతిని పెద్ద జాతి, బలవంతుడు బలహీనుణ్ణి మింగుతాడు. అందుకే పగదారుల్ని చూసి దాక్కోవాలే. ఇక్కడ కోడి పిల్లలకు పిల్లి పగదారుడు. కాబట్టి దాని నుండి రక్షించుకోవడం వాటి ధర్మం. కాని మన కడుపులో పుట్టిన పాపానికి తల్లిదండ్రులే వారి ప్రాణాలను తీస్తుంటే వారినేమనాలి? "తిండి కోసం తిరగాలె బిడ్డ" అని తల్లి చెప్పగా "అమ్మా... ఇక్కడ నూకలు లేవు గదటే..." అన్న పిల్లల మాటలకు తల్లి "ఉండవు... మనమే దేవులాడుకోవాలే, తవ్వుకోవాలే" అని వారికి కర్తవ్యాన్ని, బాధ్యతను బోధిస్తుంది. అంతేగాని ఒకరి మీద ఆధారపడవద్దు మనది, మనం సంపాదించుకోవాలే" అని మార్గనిర్దేశాన్ని బొట్ల పెట్ట చెప్తుంది. బాధ్యత మరచిన తల్లులు తండ్రులకు ఇది ఒక చురక.

పిల్లి, గద్దలు మనకు శత్రువులని అవి కనిపించగానే బొబ్బ పెట్టాలే. ఉరికొచ్చి దాక్కోవాలె అంటూ శత్రువుల గుణాలు, రూపురేఖలు ఎలా ఉంటాయో? వాటి నుండి ఎలా బయటపడాలో జాగ్రత్తలు చెప్తుంది. గుంటూరుజిల్లా మాచర్లలో తన రెండు నెలల ఆడశిశువును రైలు పట్టాల దగ్గర పడేసిపోయిన తల్లి బొట్ల పెట్ట కథ ద్వారా తల్లి సిగ్గుతో తలదించుకోవాలే.

బొట్ల పెట్ట తన పిల్లలకు శత్రువులు కనబడితే ఎంతసేపు బొబ్బ పెట్టి దాక్కోవడం మాత్రమే కాదు. ఒక్కొక్కసారి ఎదురు తిరిగి పోరాడాలని భయపడరాదని, ఎదురుతిరగాలని తిరుగుబాటును పోరాడే స్వభావాన్ని కూడా తల్లి తన పిల్లలకు పసితనం నుండే నేర్పుతుంది. చివరకు బ్రతకడమెలాగో నేర్పుతుంది. పెరిగి పెద్దయ్యేదాకా వెంటనే ఉండి అన్ని జాగ్రత్తలు నేర్పి, పిల్లలు బతుక నేర్చినట్టు, బొట్ల పెట్ట గుర్తించి తృప్తిగా పిల్లలను చూసి నవ్వుకుంటుంది. ఎవరి కాళ్ళపై వారు స్వయంగా నిలబడగలరని నమ్మి వారు సల్లగా బతుకుతే సాలనుకుంది. అది కూడా అన్ని విద్యలు నేర్పాకే తన దారి తాను చూసుకుంటుంది. బొట్లపెట్ట కాని నేడు ప్రతి రోజు ఎక్కడో ఒకచోట కన్నవారే కాలయముళ్ళాగా అవతారమెత్తుతున్నారు. నవమాసాలు మోసి పురిటి నొప్పులు భరించి ఎంతోకాలం నుండి స్త్రీ అమ్మతనం ఎప్పుడొస్తుందా? అని ఆతృతతో ఎదురుచూసి ఆ ప్రసవ సమయం రాగానే ఆ ఆనంద క్షణాలను తలుచుకుంటూ పుట్టబోయే తన రూపం కోసం భూమి బద్దలయ్యేలా అనిపించే పురిటి నొప్పులను భరిస్తుంది. అంత నొప్పిని భరించిన ఆ తల్లి తన సంతానం పట్ల నాగుపాము పడగనీడ ఎందుకు పడుతుందో తెలియజేయడం లేదు. పుట్టిన పిల్లలకు బ్రతుకుదెరువు చూపి వారు ఒక దారికి వచ్చాక ఇక ఫర్వాలేదు అని నమ్మకం కుదిరేదాకా అంటి పెట్టుకుని తృప్తిగా ఆ నమ్మకం కుదిరాక బొట్ల పెట్టలా తల్లిదండ్రులు వారి వారి పాత్రల నుండి విశ్రాంతి తీసుకోవాలి. వారి విశ్రాంతి సమ యంలో బిడ్డలు మంచి ప్రయోజకులు అయ్యా రని ఇరుగు పొరుగు పొగుడుతుంటే.. ఆ ఆనంద క్షణాల్లో మాతృత్వం మురిసి పోతుంది.

**- "సింగంపేట" పున్నమి వెంకటయ్య**

# గదులకూ కొన్ని పరిమితులున్నాయి



"సాహిత్య ప్రస్థానం" నవంబర్ 2010 సంచికలోని కథ "అడ్డు గోడ" పంజాబీ కథా రచయిత్రి దవీస్ కౌర్ తివానా, స్వయంగా తాను అనువాదం చేసుకున్న హిందీ అనువాదానికి తెలుగు రూపం ఇచ్చిన వారు డా॥ దేవరాజు మహారాజు. ఇద్దరూ అభినందనీయులే.

ఆ "అడ్డుగోడ" ఏమిటో పరిశీలనాంశంగా తీసుకుందాము.

"ఆఫీసులో నీ గది నా గది ప్రక్కనే ఉంది. నువ్వు నీ గదిలోకి వెళతావు. నేను నా గదిలోకి. నీ గది ఇటువైపు రాలేదు. నా గది అటువైపు పోలేదు. ఈ గదులకు కొన్ని పరిమితులున్నాయి. ఈ రెండింటి మధ్య ఒక వాస్తవం - అడ్డుగోడ."

అది ఎప్పటి నుంచో ఉంది...

"నేను గది బయటికి వరండాలోకి వచ్చి చూద్దును కదా నీ గది గుమ్మానికి ఒక దళసరి పరదా వేలాడుతూంది. నేను తిరిగి నా గదిలోకి వెళ్ళిపోయాను. గుమ్మాలకు, కిటికీలకు జనం ఈ మధ్య ఖరీదైన గుడ్డలతో అందంగా పరదాలు వేసుకోవడం నేర్చారు. ఆ మాట కొస్తే నా గది గుమ్మానికి కూడా ఓ అందమైన కర్టెన్ వేలాడుతోంది."

"... నీ గదిలో నువ్వు దీర్ఘంగా నిట్టూర్చినా అది నా గదిలోకి వినిపించేది. బహుశా నీకు ఈ విషయం తెలియకపోవచ్చు. ఒకరి వెనుక ఒకరు కూర్చుని ఉన్నాం. కాని మన మధ్య ఒక అడ్డుగోడ ఉంది."

"ఓ రోజు నా గదిలో ఫ్యాన్ ఆగిపోయింది. బహుశా కరెంట్ పోయి ఉంటుంది. నీ గదిలో కూడా ఫ్యాన్ ఆగిపోయే ఉంటుందని అనుకున్నాను. పరదా సందుల్లోంచి నీ గదిలోకి తొంగి చూస్తూ "పంఖా నడుస్తోందా?" అని అడిగాను. కరెంట్ లేక ఫ్యాన్ ఆగిపోతే బయటి వరండాలోకి రావచ్చు కదా? అని నా ఉద్దేశం." "మన గదుల మధ్య అడ్డుగోడ ఉండి కూడా నువ్వు ఆఫీసుకు రాని రోజు అంటే నీ గదిలో నువ్వు లేని రోజు నాలో ఏదో వింత భావం బెంగగా తిరుగాడుతూ వుంటుంది. ఆ రోజు ఎన్నిసార్లు గడియారం చూసుకుంటానో... రోజుటిలా చకా చకా పనిచేయలేను. పని వాయిదా వేస్తుంటాను."

"ఓసారి నేను చాలా రోజులు సెలవు పెట్టాను. జ్వరం తగ్గి కొంచెం ఫర్వాలేదనిపించినప్పుడు నేను ఆఫీసు కొచ్చాను. నేను వచ్చిన సంగతి బహుశా నీకు తెలిసి ఉండదు. అందరి మీదా చిరాకు పడటం, కింది ఉద్యోగస్తుల్ని తిట్టడం, రాసిన కాగితాలు చించివేయడం, కలుద్దామని వచ్చిన వాళ్ళని తరువాత కలవమని పంపేయడం... నాకు తెలుస్తూనే ఉంది."

"నన్ను చూసినప్పుడు 'రావడం లేదేం ఇన్ని రోజులూ?" అన్నావు.

"ఆరోగ్యం బాగుండక!" అన్నాను నీరసంగా నవ్వుతూ.

"ఓహో - ఇప్పుడెలా ఉంది మరీ?"

"ఫరవాలేదు. బాగానే ఉంది. థాంక్స్" అంటూ నేను నా గదిలోకి వచ్చాను. నువ్వు నీ గదిలోకి వెళ్ళావు. ఇద్దరి మధ్య ఓ పెద్ద అడ్డు గోడ వుంది. ఓ గది నీది, ఓ గది నాది. ఒక్కొక్కసారి నాకనిపిస్తుంది... రెండు గదులు పక్క పక్కనే ఉన్నాయంటే మనిద్దరం పక్కపక్కనే ఉన్నామని కదా అర్థం.

"ఇంతకీ పక్క పక్కన ఉండటమనేది కూడా సామాన్యమైన విషయం కాదు గదా? అని ఈ మధ్య మరీ మరీ అనిపిస్తోంది.

రచయిత్రి తనపరంగా (స్త్రీ పరంగా) రాసిన విషయమిది. ప్రక్క గదిలో ఉన్న ఆమె సహచరుని ఉద్దేశించి చేసిన ఊహ ఇది.

అయినా... వాటి మధ్య ఉన్నది కేవలం ఒక్క అడ్డుగోడే కదా?... ఈ గదులకు కొన్ని పరిమితులున్నాయి.

ఏదిఏమైనా, పాఠకుని ఆలోచనలు పాఠకునికే ఉంటాయి!

**- బి. నరసింహారావు**

# ఆలోచనాత్మకం

మాస పత్రికను దిగ్విజయంగా నెలనెలా మాకందిస్తున్న సంపాదక వర్గానికి పేరుపేరున కృతజ్ఞతలు.

'సాహిత్య ప్రస్థానం'లో వచ్చే కథలు ఎంతో విజ్ఞాన దాయకంగాను, ఆలోచింపజేసేవిగాను ఉన్నాయి. ముఖ్యంగా ఈనెల (డిసెంబర్ 10) 'నాపేరేమిటి' కథ చాలా బాగుంది. మమ్మల్ని ఆలోచింపజేసింది. కవితలు నిజంగా సాహిత్యపుటంచులను రుచిచూపిస్తున్నవి. ముఖ్యంగా 'అపర బ్రహ్మ', 'బద్నాంగల్లీ' సమాజ రుగ్మతలలోని నీచత్వాన్ని నిరూపించాయి. వ్యాసాలు (నిజం నిర్భయంగా చెప్పగలగటం) అద్భుతం. "సాహిత్యంలో కులాధిపత్యం" "జ్ఞానోకవి రచనాధార" వివేకాన్ని పెంచాయి.

**- కె. జగదీష్**

# సందేశాత్మక రచనలు

సాహిత్య ప్రస్థానం డిసెంబరు 2010 సంచిక చూశాను. అందులోని రచనలన్నీ నవ్యంగా దివ్యంగా కనిపించాయి. సంపాదక మిత్రులందరికీ ధన్యవాదాలు. కొత్తరక్తంలో పుట్టే ఆలోచనలన్నీ విప్లవాత్మకంగా, సందేశాత్మకంగా ఉంటాయి. దానికి ఉదాహరణ 'మస్తకానికి పుస్తకం' (పేజీ 35) – టెక్నాలజీ శ్రుతిమించి పుస్తకాన్ని మింగేయడం ఘోరం. ఎలక్ట్రానిక్ మీడియా, ప్రింట్ మీడియాను మూలకు నెట్టేస్తున్న దృశ్యం 'కోటం చంద్రశేఖర్'కి ఇబ్బందికరంగా కనిపిస్తుంది.

**- గాజుల పవన్‌కుమార్**



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# త్రిపురనేని రామస్వామి చౌదరి

15.1.1887 - 16.1.1943



49

హేతువాద ఉద్యమానికి ఊపిరి పోశారు. వైదిక ప్రాబల్యాన్ని సవాలు చేసే 'ఖూనీ', 'శంబుక వధ' వంటి నాటకాలు రాశారు. 'సూతపురాణం' తదితర కావ్యాలు వెలువరించి సంచలనం కలిగించారు.

SAHITYA PRASATHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



## సాహిత్యకారులకు, పుస్తక ప్రియులకు సరికొత్త కానుక!

పేజీలు 356
అరుదైన ఫొటోలతో...

# శ్రీశ్రీ జయభేరి

## జీవితం-సాహిత్యం-రాజకీయాలు

### తెలకపల్లి రవి




సామ్యవాదమే నా గమ్యం కవిత్వంలోనూ జీవితంలోనూ అన్న శ్రీశ్రీ కవిత్వం భువన భవనపు బావుటాగా ఎగురుతూనే వుంది. శ్రీశ్రీ జీవితాన్ని, సాహిత్యాన్ని, రాజకీయాలను సమగ్రంగా, వాస్తవికంగా పరిశీలించిన పుస్తకం ఇది. ఆయన స్వీయరచనలు, సమకాలికుల జ్ఞాపకాలు, రాజకీయ చారిత్రక పరిణామాలు, ఉద్యమాల, సంఘాల పూర్వాపరాలు ఒకేచోట చూపించే విస్తృత ప్రయత్నం. శ్రీశ్రీ అశేషాభిమానులకు, అభ్యుదయ గాముకులకు ఆసక్తి గొల్పే రచన.

**ప్రతులకు:**

ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో

హైదరాబాద్- 040 - 27608107, ఖమ్మం- 9959700852, నల్గొండ - 08682-230525,
హన్మకొండ- 0870-2544559, విజయవాడ- 9490099060, విశాఖపట్నం-9490099061,
గుంటూరు- 9490259186 తిరుపతి- 9490099062, ఒంగోలు- 9490300359,
హైదరాబాద్- ఎస్.వి.కె. బ్రాంచ్- 040-27667543

వెల: రూ. 100/-

ప్రత్యేక తగ్గింపు 25%

50

తెంటనే కొని చదవండి!

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVMO2A123 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |